

విరోధి భాద్రపద బహుళ
త్రయోదశి —— ౧౯౪౦

APPROVED FOR SCHOOL USE.

# చాందసుల్తానా

( చరిత్రాత్మక నవల )



రచన:

శ్రీ దూబగుంట వెంకటరమణయ్యగారు.

ప్రచురణ:

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,

సంస్కృతాంధ్ర గ్రంథాలయం, (స్థాపితం 1882) రాజమండ్రి.

# చాంద సుల్తానా

## మొదటి ప్రకరణము

పదునాఱవ శతాబ్దాంతమున నొకనాటి సాయంసమయమున అహమ్మదునగర ప్రాంతముననున్న కాంతారమంతయుఁ బక్షుల కలకలారావములచేతను, అతిభయంకరములైన హర్యక్షముల గర్జితములతోడను, ముప్వన్నెమెకముల భీకర స్వనంబులతోను నిండియుండెను. అపరదిక్కాంత తన ముఖపద్మంబున ధరించిన కుంకుమపు బొట్టుచందమున నలరారు సంజకెంజాయ దేదీప్యమానమై తన కాంతుల దిక్కుల వెదజల్లుచుండెను. మఱికొంతసేపటికి రాత్రినిబోడసూపు సంజచీఁకటులు నలుదెసలఁ గ్రమ్మఁ జొచ్చెను. పిమ్మట గాఢాంధకారము నిరాటంకముగ జగమంతయు నాక్రమించుటచేఁ జెట్టులు, పుట్టలు, గట్టులు. నేకముగ నంధకారావృతములై నిర్దేశింప వలనుపడకుండెను. ఉన్నట్టుండి యాకసమున మబ్బుపట్టెను. దివినున్న నక్షత్రబృంద మీఁకమీఁద జరుగఁబోవు ఘోరవిపత్తును జూడలేమో యనునట్లు మేఘమండలి వెనుక డాగియుండుట కరుదెంచుచుండెను.

ఇట్లుండఁ బెనుగాలి వీవనారంభించెను. అవ్విపినంబునకుఁ బరిసరములనున్న పర్వతములపైనుండి యెండుటాకులును నెఱ్ఱని ధూళియు నెగసె భూనభోంతరాళముల ముంచివైచుచుండెను. ఆ భయంకర ఝంఝూమారుతముతోఁ బోరి యోడిపోయినవో యనుచందమున శైలశిఖరమున విరాజిల్లు వృక్షావళి వ్రేళ్లతోఁ గూడఁ బెల్లగిలి ఫెళఫెళారావములతోఁ బడిపోవుచుండెను. ఆ భీకర ధ్వనులకు వన్యమృగంబులన్నియుఁ బెల్లుభయంబున నలుదిక్కులకుఁ బలాయనము లగుచుండెను.

అత్తరుణమున నవ్విపినాంతరాళమున నొకఫకీరు కంటక శిలామయంబగు పథంబున నతికష్టంబుతో మెల్లమెల్లగ నడచి పోవుచుండెను. అంత నతఁడా దారుణమారుతమున కోర్వఁజాలక తిన్నగ నొక మహావృక్షము చెంతకేఁగి నిలుచుండెను. తన బుద్ధికి సూటిగఁ బొడమునూహలచేఁదానెంతయు సంతసించుచుండెను. గాని గాఢాంధకారమును, వన్యమృగముల భయంకర ధ్వానములును వాని మనస్సును గలంచుచుండెను. అహఃపతి తూర్పు దిక్కున నుదయింపఁగనే మంచువిరిసిపోవునట్లు ప్రకంపనుఁ డుగ్రుఁడై దారుణకర్మ మొనర్పఁ బ్రయత్నించినక్షణముననే యాకసమున మేఘపటలము భిన్నమైపోయెను. అంతఁ దారకావళులు కాంతిచే బింకముఁ జూపినందున మన ఫకీరున కిప్పుడు

కొంతవెల్తురు గాన్పించుటచే నతఁడు బిరబిర నడచుచుఁ జేతనున్న ఖడ్గమును ద్రిప్పుచుఁ గ్రూరమృగము లగపడినపుడెల్లఁ గత్తి ఝళిపించుచు నేద్దియో యాలోచించుచుఁ బోవుచుండెను. అంతఁ గొంతవడికి నతనికిఁ జాలదూరమునుండి యొక దీపపుకాంతి దృష్టిపథంబునంబడుటచే నట్టి నిర్జనారణ్యంబున దీప ముండుటకుఁ గతంబెయ్యది యని చింతించి దానింజేర నతఁడు గడువడిగ నడువం దొడంగె. అతఁడట్లు తన గమ్యస్థానంబుఁ జేరునప్పటి కచ్చట నతని కొక పటకుటీరంబు గోచరంబయ్యె నవ్వింతఁ బరిశీలింప నతఁడు దానింజొచ్చె. గుడారమునకు మధ్యభాగమునఁ దళతళలాడు రెండుకత్తులు వ్రేలాడఁగట్టఁబడి యుండినవి. కుటీరమునందే వేఱొకచో నొక ప్రాతపెట్టె యుండెను. ఫకీరు దానిందెఱచి చూడ నందు యమపాశమువంటి యొక త్రాడును రెండు చిన్నబాకులును దప్ప వేఱేదియు నతనికిఁ గాన్పించలేదు. అంత నతఁడాచోద్యమునుబరిశీలింప జేరువనున్న యొకపొదచాటున దాగియుండుట కరుదెంచెను. మఱుక్షణముననే దీర్ఘకాయుఁడును, మహాబలసంపన్నుఁడగు నొక నల్లని మనుజుఁడు భుజమున నొక గండ్రగొడ్డలిని ధరించి వడివడిగ నా కుటీరమును జొచ్చెను. అతని భుజముననున్న గొడ్డలియు, నాతఁడు ధరించియుండు మొఱటుబట్టలును నతఁడొక పర్వతప్రాంతముల వసించు నాటవికుఁ డని తెలియఁజేయుచుండెను. గుడారమును జొచ్చినవెంటనే యాతఁడు మఱల బయటకువచ్చి యెవరికొఱకో నిరీక్షించు వాని వలెఁ గుటీరమునొద్ద బచారు చేయుచుండెను.

పిదపఁ గొంతసేపటికి వికృతాకారులగు నల్వురు మనుజు లొక బాలుని వెంటఁబెట్టుకొనివచ్చి యాతనియెదుట నిల్పిరి. ఆ బాలుఁ డతిసౌందర్యవంతుఁడై రాజచిహ్నములను వెదజల్లు చుండెను. కాని వ్యాఘ్రములమధ్యనున్న లేడిచందమున నతఁడతి దుఃఖాక్రాంతుఁ డగుటచే నాతని ముఖపద్మము వాడియుండెను. నీలప్రభావిరాజితంబులగు వాని ముంగురులు చెదరి రమణీయ ఫాల భాగమున ముసురుగొనియుండెను. వాని విశాల నయనములు వికసితంబులును, ముకుళితంబులును గాక యరమోడ్పు వడి యుండెను. ఇట్లుండ నా బాలుఁడు వారితోఁ "అయ్యా! నన్ను విడువుఁడు. మా యమ్మకు నే నొక్కఁడనే బిడ్డఁడను. నన్ను మీరు విడుతురేని మీకుఁ గావలసినంత ధనమిప్పింతు" నని చెప్పి తన్ను విడిపించుటకు వారి నెన్నియో విధముల వేడుకొనెను. పాప మా బాలునిమాటలు వారు పెడచెవినిబెట్టిరి. ఆ శూరుల నాయకుఁడు "ఆలస్యము జేయక వీని నా చెట్టునకుఁగట్టి తల నఱకుఁడు పోం"డని తన శిష్యుల కుత్తరువిచ్చెను. ఇట్లాజ్ఞాపింపఁ బడిన శిష్యులలో నొకఁడు తటాలున గుడారముకేగి యొకత్రాడును దెచ్చి చేరువనున్న మహావృక్షమున కా బాలుని దలక్రిందుగఁ గట్టెను. పొదచాటుననుండి జరుగుచున్న చర్యనంతయుఁ జూచు చున్న ఫకీరు వారిని దెగటార్పఁ దనకృపాణమును దడవి చూచు కొనెను. కాని ఖడ్గమగపడలేదు. పొరపాటున నా ఖడ్గమును గుడార మున విడిచి వచ్చినందులకై చింతిలుచు నతఁడు చేయునదిలేక దుఃఖాక్రాంతుఁడై పొదచాటుననె దాగియుండి గుడారమును

జొచ్చుటకు సమయమునకై వేచియుండెను. ఇట్లుండశిష్యాగ్రేసరుఁ డగునొక నల్లనిమనుజుఁ డా బాలునిశిరముఁ దెగవైచుటకుఁ గత్తి మెడపైఁబెట్టి వాటముఁజూచి మరలఁ గత్తినెత్తి "నీకు శిరచ్ఛేదము గావింపఁబడును. నీ యిష్టదైవమును దలచికొ" మ్మని బలికెను. ఈ మాటలను విన్నతోడనే యా బాలుఁడు మిగుల వెఱగొందెను. నేత్రయుగ్మమునుండి యశ్రుకణంబులు రాల్పఁదొడంగెను. అతఁడు చేయునదిలేక ముకుళితనేత్రుఁడై యీశ్వరధ్యానముచేయుచుండెను. అందఱును బాలుని జూచుచుండిరి. ఆ వ్రేటున కాతనిశిరము తెగి నేలఁబడవలసినదే కాని భయముచే నతఁడు మెడను గొంచెము త్రిప్పినందున నావ్రేటు దప్పెను. మఱల నా క్రూరుఁడు చక్కగ గురిపెట్టి చేయిపైకెత్తెను. చేరువనున్న వారంద ఱా బాలునివంకఁ జూచుచుండ బకీరెట్లో గుడారముజొచ్చి తన ఖడ్గమును దీసికొని ధైర్యమవలంబించి తలనఱుక నుద్యుక్తుఁడై యున్నవాని శిరమును దెగవైచెను. అంత మొదలునఱికిన తరువువలె నేలఁగూలిన యా మనుజుని జూచి మిగత వారందఱు పలాయనమైరి. అంత నా ఫకీరాబాలునికడకేఁగి చెట్టునుండి వానినివిప్పి వానిదురవస్థలకుఁ గారణంబు లడుగుచు వానిని వెంటఁబెట్టుకొని యెక్కడికో వెళ్లిపోయెను.

## రెండవ ప్రకరణము

ఆహా : ఏమి యావీరుల పరాక్రమము ! నాకంటె శూరుఁడితరుఁ డెవ్వఁడు లేఁడని యిన్ని దినములనుండియు నెన్నుచుంటిని. వా రొకస్త్రీచేఁ బోషింపఁబడి సరియైన యుద్ధశిక్షన లేకున్నను యెట్టివీరులైరి ! ఆ యువతిధైర్య మేమని చెప్పుదు ! నాతోఁ బోరాడు టట్లుండ నొక్కుమ్మడి వేత్వేలు సేనలతోఁ బోరి తన శౌర్యమును జాపెను. ఏదియెట్లున్నను అహమ్మదు నగరరాజ్యమున కామెయు, నాపిల్లవాఁడును నెట్లర్హులగుదురు ? మఱియుఁ బట్టణములోని జనులంద ఱేకమై యెవరోయొకస్త్రీ రాజ్య మేలుచుండిన దమ క్రూరకృత్యముల సందులేక జరిగింప వచ్చునని యెంచి యారాజ్యసంతతి వారిలోకెల్ల నామెకును దదనంతర మామెతమ్ముని మనుమఁడగు బహదరునకును హక్కుగలదని యొకశాసనము వ్రాసినారు. వీరికృత్రిమశాసనములు నాకడఁ జెల్లవు. నాతండ్రియు రాజ్యవ్యవహార విషయమై నైజాం షాహోవారితో నసేకపర్యాయములు వాదించి యహమ్మదుకే హక్కుగలదని శాసనము వ్రాయించి యున్నాఁడు. అయిన నాస్త్రీ బహదరుకు సహాయ మొనర్చుటకు బీజపురమునుండి పరుగిడివచ్చి, యతనికే హక్కుగలదని వాదించి, తానే ప్రథమమున రాజ్యము నేల నెంచి, తనకున్న ప్రజ్ఞలం బ్రకటించి నాతోఁ బోరాడ గడంగియున్నది. ఎట్లయిన నాయువతితోఁ

బోరి యహమ్మదునగర సింహాసనము నధిష్ఠింపఁ గలను. ఇప్పుడే నాశిష్యవర్గము నంతయు నాయువతి నెక్కెలైన జెఱపట్టి యీరడిసేయఁ బంపియున్నాను. సాధ్యమైనంతవఱకు నాశిష్యాగ్రేసరుఁ డగ ఖాదరు తనకుఁ గల యుక్తులనిఁ దన స్నేహితులఁ గలసికొని యహమ్మదునగరరాజ్యమును నాశము జేయఁగలఁడు. నా పాడియుఁ, బంటయు, సిరియు, నహమ్మదునగరమునేలుబడి హక్కును గూలంద్రోసిన యానీచమతిని దైవంబునెరుపకుండునే! ప్రాణంబు కంఠంబునం దున్నంతకాలము నేనామెతోఁ బగ సాధించి నాయావచ్ఛక్తిని వినియోగించి పరరాజు నామెపై దాడి విడియఁ బంపి యామెను రాజ్యభ్రష్టగాఁ జేసి, అహమ్మదు నగరమును బాడుచేసి, ఆలుబిడ్డల నెడబాపి, యామెనే నమ్మి యామెకుఁ ద్రికాలములయందు సహాయులుగ నున్న వారి నిడు ములఁగుడిపి వేధింపక పోతినేని నేనొకమహమ్మదీయుఁడను గాను. ఇదియే నాశపధము. ఇప్పుడు ఢిల్లీకెట్లులైన పోవుచున్నాను గదా! అక్బరు నాకించుకైన సాయమొనర్చునా? అతఁడు గొప్ప చక్రవర్తి, పరాక్రమశాలి, దీనసంరక్షకుఁడు. అచ్చటికి వెళ్ళి నా గోలంతయు నాతనికి విన్నవించి నా చమత్కారముచే నాతని నెట్లులైన సైన్యమును సహాయమునకుఁ బంపునట్లు చేసెద. యెట్ట యెదుట నొక చిన్న పట్టణము గానవచ్చుచున్నది. చీఁకటి పడక మున్నె పట్టణమును జేరవలయును. 'ప్రభాకరుఁడును నావలెనే తేజము నెడి యపరసముద్రమున దలదాచ వెళ్లుచున్నాఁ' డని తనలోఁ దాను వితర్కించుకొనుచు నొక యౌవనపురుషుఁ డొక

నా(టి సాయంకాలమున ఢిల్లీకి దక్షిణమున నున్న యడవిలోనుండి బిరబిర నడచుచు బాగుగ( జీ(కటి పడునప్పటికి దన యెదుట నున్న యొక పట్టణము( జేరి యచ్చట నొక సత్రమున నిలిచెను.

ఈ సత్రము చాల విశాలమైన దగుటచే నందు బాట సారులచే నిండి నిబిడీకృతములగు పెక్కుగదులు గలవు. ఆ గదు లకు ముందు భాగమున నొక విశాలమైన యరుగు గలదు. ఆ యరుగుమీ(ద నొక రిద్దఱు బైరాగులును, నొక పకీరును బవ్వళించి యుండిరి. చదువరులారా ! ఈ పకీరు మీ కిదివఱలో( బరిచితు(డే ! పాప మీతనికి మనస్సు కలతచెంది యున్నందు వలననో లేక మఱియేకారణమును బట్టియో నిద్ర పట్టుటలేదు. హృదయవారధినుండి యోచనాతరంగము లుద్భవిల్లినప్పు డెల్ల నాత( డాయింటి కప్పుతట్టు చూడ్కి నిగిడించుచుండెను. ఈత( డావచ్చిన నూతన పురుషుని జూచినంతనే తన చోటినుండి లేచి కూర్చుండి యెద్దియో యాలోచించుచు( గోపారుణితలోచనుండై యా పురుషుని యూరక చూచుచుండెను. ఇంతలో నా వచ్చిన పురుషు(డును యరుగుపై నొకచోట పైగుడ్డను బరచుకొని నిద్రించుట కారంభించెను. వెంటనే పకీరా మనుజునియొద్ద కరు దెంచి వానిని బాగుగ( బరిశీలించి యేమిచేయుటకును దో(పక నడుమునకు( గట్టుకొనియున్న ఖడ్గమును బయటకుదీసెను ఇంతలో నాపురుషునియంగరఖా పకీరున కగపడ దాని నాత( డావలకుం గొనిపోయి దాని జేబునందున్న యొక కాగితమును దీసి దగరనున్న దీపమునొద్దకు దీసుకొనిపోయి చదివి దానిం దనజేబునందు

బదిలపఱచుకొనెను. అంతఁ బకీరు కోపావేశుడై యొడలు తెలియక యొక్కపెట్టునకే యాపురుషునిం జంపఁ దనకత్తి నెత్తెను. ఇంతలో సత్రములో నుండువారిలోఁ గొందఱు 'దొంగ దొంగ' యని కేకలు వేయుచు నలుదిక్కులకుఁ బర్విడుట కారంభించుటచేఁ బకీరు చేయునదిరేక యెత్తిన హస్తమును నశ్లే దించి యా పురుషుఁడు ప్రాణములను దక్కించుకొన్నందులకుఁ జింతించుచుఁ దనతావున కరిగి మరలఁ బరుండెను. సత్రములోని జనులకు దొంగయెచ్చట నగపడనందున వారును దమగదులకుఁబోయి పరుండిరి. అంత నాయౌవనపురుషుఁడు మేల్కాంచి చాల ప్రొద్దుపోయినదని తెలిసికొని, తెల్లవాఱుటకుఁ గొంచెము ముందుగనే ఢిల్లీకిఁ బ్రయాణమై పోయెను. అరుగుపైఁ బండుకొనియున్న పకీ రిప్పటికిని నిద్రింపలేదు. ఆతండూరక యానూతనిపురుషుని గుఱించియే చింతించుచుండెను. 'ఓరీ! నీచుఁడా! నీ వొనరించుచున్నకుత్రల నెల్లను గ్రహించుచున్నాను. లెమ్ము. సమర్థుండనగు నే నామెకు నండగనుండు నంతకాలము నీ దుండగమునెల్లఁ దుదముట్టింపఁ ద్రికాలముల యందును బ్రక్కలోని బల్లెమువలె వర్తించుచుండెదను లెమ్ము. నీకు సాయ మొనరింప వేడుట కగ్బరుపాదుషాకడకా పోవుచుంటివి! గత యుద్ధంబున నీ వందిన గౌరవంబే భావికాలంబున నాతఁడును బొందుఁగాక. నేఁడు నీవు ప్రాణంబుల దక్కించు కొన్నందుల కెంతయుఁ జింతించుచున్నాను. దుర్మార్గుడా! కానిమ్ము. అచిర కాలంబునమదీయబాహుబలము నించుక రుచి చూడఁ గల' వని తలంచుచున్నంతలోఁ దెల్లవాఱెను. పకీరు సత్రమును వదలి తేన వాసస్థానమును జేర బయలుదేఱెను.

## మూఁడవ ప్రకరణము

చదువరులారా! మనచరిత్రకు సంబంధించిన రాజ్య మహామ్మదునగరరాజ్యము. ఇది దక్షిణహిందూదేశమున నెట్లేర్పడినదనియు, నెట్లు పరిపాలింపఁబడినదియు, మొదటఁ గసుగొని పిమ్మటఁ గథాసందర్భమునకు మరలుదము.

ఢిల్లీపట్టణములో మహామ్మదుటోగ్లకు రాజ్యముచేయుచుండఁగ హసన్ గంగూ అను సేనానాయకుఁడు దక్షిణ హిందూదేశములో దిరుగఁబడి స్వతంత్రుఁడాయెను. ఇతఁడు మొదట గంగూఅను బ్రాహ్మణుని సేవకుఁడుగ నుండి యతఁడు చెప్పిన చొప్పున నడచుకొను చుండెను. ఒకదినము హసను పొలము దున్నుచుండగా నతనికిఁ గొంతధనము లభ్యమగుడు దానిం గొంపోయి తన యజమానుని కొసఁగ వానిధర్మమునకు మెచ్చి యతనియజమానుఁడు వానిని నవాబుదగ్గరకుఁ బిలిచికొనిపోయి పదివేలగుఱ్ఱములకు నాధిపత్య మిప్పించెను. పిమ్మట గంగూ బ్రాహ్మణుఁడు హసనుతో నీకింక కొలది దినములకు రాజ్యప్రాప్తి కాఁగలదు. అప్పుడునన్ను మఱవవల' దని జ్యోతిషము చెప్పి వానింబంపివేసెను. పిమ్మట హసననేక యుద్ధములలో గెలిచి ఢిల్లీశ్వరునివలన జాఫర్ ఖాన్ అనుబిరుదమును వహించెను. అతఁడు 1347 వ సంవత్సరమున అల్లాయుద్దీన్ షాహాయని పేరుపెట్టుకొని దక్షిణదేశమున స్వతంత్రుఁడైనపిమ్మట రాజాయెను. అంత నతఁడు గంగూబ్రాహ్మణుని జ్ఞాకార్థమై తనకు హసన్

గంగూఅనియు, నతని వంశమునకు బహమన్ లేక భామినీ వంశమనియు, దానుసంపాదించిన రాజ్యమునకు భామినీరాజ్యమనియుఁ బేళ్లుపెట్టెను. ఈతఁడు 1347-58 వఱకు నారాజ్యమును నిరంకుశాధికారియై బరిపాలన మొనర్చెను. ఈతని వెనుక నెనమండుగురు రాజ్యపాలన మొనర్చిరి. వారిలోఁ గడపటివాఁడైన మహమ్మదుషాహా 1482-1528 వఱకు రాజ్యపరిపాలనము జేసెను. ఈతనికాలములోనే భామినీరాజ్యములోనుండి యైదురాజ్యము లేర్పడెను. అవేనన 1 బీడారు, 2 బీరారు, 3 అహమ్మదునగరము 4 బీజపూరు, 5 గోలుకొండ. బీరారునందు రాజ్యముచేయువాని "బరీద్ షాహా" లనియు, బీడారునందు రాజ్యముచేయువారిని "ఇమ్మద్ షాహా" లనియు, అహమ్మదునగర ప్రభుత్వమువారిని "నిజాం షాహా" లనియు, గోలుకొండయందు రాజ్యముచేయువారిని "కుతుబ్ షాహా" లనియు, బీజపూరునందు రాజ్యముచేయువారిని "అదిల్ షాహా" లనియు వాడుచుండిరి.

పాఠకులారా! మనము ప్రస్తుతపుచరిత్రకు సంబంధించిన అహమ్మదు నగరమునకు మరలుదము. ఈరాజ్యము 1489 వ సంవత్సరమున అహమ్మద్ షాహాచే స్థాపింపఁబడెను. ఈతఁడు 1508 వఱకు రాజ్యపాలన మొనర్చెను. ఇతని వెనుక బురుహాన్ నిజాంషాహాయును, నతని వెనుక హుసేన్ నిజాంషాహాయును బాలనమొనర్చిరి. మనకథానాయికయగు చాందబీబీ (చాంద సుల్తానా) యీతని పుత్రికయె. అహమ్మదునగరు, బీజపూరు, గోలుకొండ నవాబులు విజయనగరముపై దండెత్తుటకు నిశ్చ

యించుకొన్న కాలములో హుసేన్‌నిజాంషాహా తనకుమార్తెయైన చాందబీబీని బీజపూరునవాబగు అల్లీఅదిల్‌షాహాకిచ్చివివాహాము జేసెను. 1580 వ సంవత్సరమున నీతని నొకఁ డకస్మాత్తుగఁ జంపెను. అల్లీతమ్ముని కొడుకగు రెండవ యిబ్రహీం అదిల్‌షాహా చాలా పసివాఁడగుటచేఁ జాందబీబీ కమీల్‌ఖానుని మంత్రిసాయమున రాజ్యమునేలుచుండెను. బీజపురమునందు మంత్రులు చాందబీబీని బెక్కుగు నిక్కట్టుల నలయింపఁజేయుచు రాజ్యమంతటను క్షోభము గలుగఁజేసితిరి. మంత్రిపదవులకొఱకై వీరు తగవులాడి రెండుపక్షములవారైరి. పిమ్మట నబ్దుల్‌హసననువానికిఁ బ్రధానత్వ మిప్పింపఁబడెను. దిలార్‌ఖానను సిద్దీ మిక్కిలి గర్వించి అబ్దుల్‌హసనును జంపి తానే ప్రధానుఁడయ్యె.

ఈ దిలార్‌ఖానుఁడు మిక్కిలి రాజ్యకాంక్ష గలవాఁడగుటచేఁ చాందబీబీ బీజపురమునందుండిన దనయాట లేవియు సాగవని తలఁచి యామెను దిన్నగ నహమ్మదునగరమునకుఁ బంపివేయ నొకపన్నుగడను బన్నెను. అదెద్దియనిన విబ్రహీం అదిల్‌షాహా చెల్లె లగు ఖుదీజాసుల్తానా యను రాజపుత్త్రిని అహమ్మదునగర రాజైన మిరాన్ హుసేనున కిప్పించి ఖుదీజాసుల్తానాకుఁదోడుగఁ చాందబీబీని యహమ్మదు నగరమునకుఁ బంపెను. అందుచేఁ చాందబీబీ యహమ్మదు నగరమునకు రావలసివచ్చెను. ఖుదీజా సుల్తానాను బెండ్లియాడిన పిమ్మటమిరానుహుసే నయిదుసంవత్సరములు మాత్రము రాజ్యముచేసెను. ఇతని వెనుక బురాణా షాహాయును, ఇస్మయల్‌షాహాయును ఇబ్రహింనిజాంషాహాయును

రాజ్యపాలన మొనర్చిరి. ఇబ్రహిం నిజంషాహా మరణానంతరమునం దతని పుత్రుఁడగు బహదర్ పసివాఁడగుటచే నతనికిఁ బట్టముగట్టి యతని పేరఁ జాందబీబీ మిగుల శ్రద్ధవహించి యహమ్మదునగర రాజ్య మేల మొదలుపెట్టెను. బహదరుకు షాజిబీబీ యను సహోదరి యుండెను. షాజిబీబీ వయస్సున బహదరుకన్న మిగులఁ బెద్దది. ఆమె పదునెనిమిది సంవత్సరముల ప్రాయముగలదై నిండు జవ్వనమున విరాజిల్లుచుండెను. చాందబీబీ, బహదర్ షాజిబీబీల యెడల సమమగు ప్రేమగలిగి రాజకార్యముల నన్నిటిని తానే వహించి తన ప్రజలను గన్నబిడ్డలవలెఁ బోషించుచుండెను. ఆమె మంత్రులలోకెల్ల మాలికాంబరు ప్రధానమంత్రియు, సహచరుం డునునై యుండెను. ఈతఁ డసమాన పరాక్రమవంతుఁడై సైన్యాధిపత్యమును వహించి రాజకార్యములందుఁగూడఁ దన బుద్ధికుశలతను జూపుచుండెను. ఆమె రెండవమంత్రియగు హూసేను మీర్జాయున్ను, మూడవమంత్రియగు నబ్దుల్ రహిమానుఁ డును శౌర్యసాహసములందు మాలికాంబరుతోఁ దులఁదూఁగుచు నాతనికిఁ బలుకార్యములందు సహాయపడుచుండిరి. చాందబీబీ నాల్గవమంత్రియగు హమీదుఖానుఁడు మాత్ర మేకారణముననో రాణిపై ద్వేషభావమును వహించి పైకిమాత్రము మంచిగ నటించుచుఁ దక్కిన మంత్రులతోఁ గలియక ప్రత్యేకముగ రాణికడకు వచ్చుచుఁ బోవుచు నుండెను.

షాజిబీబీ పసితనమునుండియుఁ చాందబీబీతోఁ గూడ బీజపూరునందే కాలము గడుపుచుండినందున నిబ్రహీం అదిల్ షాహాపినతండ్రికొమరుఁ డగు మహమ్మదు ముస్తుఫాయందత్యం తానురాగము గలదై యతనిఁదప్ప వేఱొకనిని బెండ్లాడ నిష్టలేక యుండెను. ముస్తుఫాయును శైశవమునుండి స్నేహముగనున్న షాజిబీబీయందనురాగముగలిగి వేఱొకయువతిని బెండ్లాడ నిష్టము లేక షాజిబీబీ నెప్పుడెప్పుడు వివాహమాడుదునా యని వేచి యుండెను. చాందబీబీయు భర్తృవియోగదుఃఖానలసంతప్తమానసయై యున్నను ధైర్యము వీడక రాజ్యసంతతివార మని చెప్పుకొని యామెను రాజ్యభ్రష్టం గావింపఁదలంచిన పెక్కుఁ శూరుల యుక్కడించుచు రాజ్యమేలుచుండెను.

## నాల్గవ ప్రకరణము

అహమ్మదునగరమునకు దక్షిణమున నొక సన్నపాటిరస్తా గలదు. ఇది దక్షిణమున పోనుబోను యొక గొప్పయరణ్యము లోనికిఁ జొచ్చియున్నది. అవ్విపినమును దాఁటితిమేని యా రస్తా మూలమున ననేక పట్టణములకుఁ బోఁగలుగుదుము. ఈ బాట కిరుపార్శ్వముల బాటసారుల కనుకూలముగఁ జెట్లు నాటఁబడి యున్నవి. మఱియు నమ్మహీరుహముల కిరువంకల నెత్తుగఁ బెరిగియున్న పొదలును, మొక్కలును, తీవలును దూరముననున్న గుట్టలవఱకును వ్యాపించియున్నవి. అక్కడక్కడ బ్రాకృచ్ఛిమంబుల కొకరిద్దరు మనుష్యులుమాత్రము పోవుటకు సరిపడిన యిఱుకుత్రోవ లామార్గంబునఁ గలియుచున్నవి.

పగలు దాదాపు రెండుజాములప్రొద్దు కావచ్చుచుండెను. అట్టి సమయమున రమారమి ముప్పదియేండ్ల ప్రాయముగల మనుజుఁ డొకానొకచోటునుండి తురగారూఢుఁడై బయలుదేరి వచ్చుచుండెను. అతఁడతి బలాఢ్యుఁడై నట్టుకన్పట్టుటయేకాక యతని ముఖపద్మము సుందరమై గంభీరభావమును స్పష్టపఱచుచుండెను. అతఁడతిదూరమునుండి స్వారిచేసివచ్చుటయుఁబట్టియు, వేసఁగి కాల మగుటచే మార్తాండుఁ డతి రౌద్రంబునం బ్రకాశించుటచేతను నాతనిదేహమంతయు స్వేదబిందువులచే నిండుటయేకాక బడలికయు, నాకలియు, దప్పియు, నాతని గడుంగడు వేధించుచుండెను. అతని హయంబును బై కారణముల డస్సినదై మందగమనంబునఁ బోవుచుండెను.

బాటసారి చనుచున్న మార్గమునకుఁ దూర్పుదెసను సుమారు రెండుక్రోసులదూరమున నతివిశాలంబులును, నానావిధ కుసుమ ఫలభరితంబులును నైన వృక్షంబులు చాలదూరము వరుసగ వ్యాపించి యుండుటచేఁ నచ్చటనుండి గంధవాతూల మప్పుడప్పు డతి మనోహరంబుగ వీచుచు మనపాంథుని బడలికను గొంత యుప శమింపఁ జేయుచుండెను. అందుచే నతఁడు సమీపమున నేదో యొకవనం బుండు ననియు నందేదేని యొక నది యుండుననియు నూహించి మార్గమును దప్పించి యరణ్యమార్గమునం బోయి దానిం బ్రవేశించెను. బాటసారి తలఁచినట్లది వనముగాదు. అదియు నరణ్యప్రదేశమే. అయిన నచ్చట గొప్పగొప్ప మహీరుహములు లేక, చిన్నచిన్న ఫలవృక్షములుమాత్రము విశేషముగ నుండెను.

వాటికి సమీపమున నొక నది ప్రవహించుచుండుటచే బాటసారి యానందభరితుఁడై యశ్వమునుండి దిగి దాని వీపుజరిమి యం దుండెడు పచ్చికబయలునందు మేఁతకుఁ విడిపించి, నదిలోని నిర్మలోదకమును గడుపారఁ ద్రావి యొక విశాల ఫాలమహీజము క్రింద విశ్రమించెను. అంతఁ దా నేదియో యాలోచించుచుఁ దనకు దగ్గరనున్న స్థలములఁ గొంతవఱకుఁ జిన్నచిన్న చెట్లు దట్టముగాఁ బెఱిగి యుండుటనుజూచి యాశ్చర్యపడి దానిం బరిశీలింపఁ దన చోటునుండి లేచి యచ్చోటి కరిగెను. కొంతమంది మనుష్యులా పొదవద్ద దిరుగుచున్నట్లచ్చటచ్చట నున్న యడుగుల జాడవలన నతనికిఁ దెలియవచ్చుచుండెను. అంత నా వింతఁ గనుఁగొన నతఁడు ప్రక్కనున్న యొకబండపైఁ గూర్చుండెను. అతనికంటికి సూటిగ నా పొదలోఁ గొన్ని తీవలు తిరుగఁబడిఁ యుండెను. బాటసారి తన హస్తంబున నా తీఁగల నావలఁ బాఱవైచెను. వెంటనే గుండియ ఝల్లుమనునట్లతని కొక గొప్ప రంధ్రము గాన్పించెను. అంత నతఁడు దీర్ఘాలోచన జేయఁ దొడఁగి తుద కా సొరంగము మనుష్యనిర్మిత మనియు గ్రూరమృగము లందేవియు వసింపవనియుఁ దెలిసికొని ధైర్యమవలంభించి దానిం జొచ్చె. అది యంధకారబంధురంబై చాలవఱకు వ్యాపించియుండెను. లోపల మెట్లు నిర్మింపఁబడి యుండుటచే నాతఁడు సులభముగ నొకగడియకాలములో నా సొరంగమును దాటి యావలి మైదాన మును జేరెను, అచ్చటఁ గొంచెము వెలుతురుగ నుండుటచే నతని కొక గృహంబు దృగ్గోచరంబయ్యె, పిమ్మట నతఁ డా యింటి

వద్దకు మెల్లగఁ జేరఁబోయి దీర్ఘకాయుఁడును, గృపాణ పాణియు నగు నొక పురుషుండు తనకత్తిని ఝళిపించుచు నాయింటి వాకిట నటునిటుఁ దిరుగుచుండుటను గనిపెట్టెను. వానికంటఁ బడకుండ నా బాటసారి యెట్లో యింటివెనుకకేఁగి లోపల నొక కుర్చీపైఁ గోరమీసములు గలిగినట్టియు నెఱ్ఱని యంగరఖాను దొడిగినట్టియు నొక శూరాగ్రేసరుని గాంచెను. అతని కిరువైపుల నిద్దఱు మనుజులు వింజామరలు బట్టుకొని నిల్చియుండిరి. పిమ్మట గాలాంజనాకారులగు నలువురు మనుజులరుదెంచి బద్ధాంజలులై యాతనియెదుట నిల్చిరి. అంత ఖాదరు "ఓరీ! మీరు పర్వత ప్రాంతముల నివసించువారగుటచే దృఢశరీరులనియు నసమాన ప్రజ్ఞావంతులనియుఁ దలఁచి మిమ్ములఁ గడుంగడు విశ్వసించి యీ పనికి నియమించుట నాదే తప్పు. లేనియెడల బక్కచిక్కిన యొక మానవునకు వెఱచి యీ బాలు నూరక విడుతురా? ఆ పిల్లవాని ప్రాణముల నప్పుడేతీసి వాని తలను నా యెదుటికిఁ గొనిరాక రిక్తహస్తములతో నా మొగము జూడ మీ కెట్లు చెల్లెను. గుండడు సహితము మృతిబొందెను. ఇఁక నా స్త్రీ మన పించ మార్పఁగలదు. మీయందఱిలో నాబాలుని విడిచిన వాఁడెవ్వఁడు?" అనియెను.

మొదటివాఁడు:—స్వామీ! మేమా పిల్లవానిని జెట్టుకుఁ గట్టి చంపుటకు సిద్ధపడి యందఱము వానివంకఁ జూచుచుంటిమి. వెంటనే గుండని తల తెగి క్రిందఁబడెను, మే మందఱము భయపడి వెళ్లితిమి. ఆవల నేమిజరిగెనో మాకుఁ దెలియదు.

ఎండవవాఁడు :—మహాప్రభూ ! మమ్ముల నేఁటికి మన్నింపుడు. ఇఁకమీఁద నిటువంటి పొరబాటును జరుగనీయము. మే మిఁక జేయఁబోవు కార్యములలో నతిజాగరూకతఁ గలిగియుందుము.

అంటలకు ఖాదరు " ఆ స్త్రీ నెట్లయినఁ జంపి మన సవాబు గారిని సంతోషపెట్టవలయును. రాజ్యమాతనికిఁ జెందున ట్లొనర్చుటలో మన మాతనికిఁ ద్రికాలములయందును సాయపడవలయును. అహమ్మదునగరములో నా స్నేహితులు నాకొఱకు వేచియుందురు. నే నచ్చటికి వెళ్లవలయు " నని చెప్పి వారినందఱి దనవద్దకుఁ బిల్చి, మఱికొన్ని రహస్యములను వారిచెవిలో నూఁది, వారి నావల కంపి బిరబిర నొక కాగితమును దీసి దానిలోఁ గొన్నివిషయములను వ్రాసి మేజామీఁదబెట్టి యా గృహము వదలి వెలుపలకు రాఁబోవుచుండెను. ఇంతలో నా బాటసారి ఖాదరురాక నెఱింగి తత్క్షణమే యా సౌరంగపు మెట్లనెక్కి తన యథాస్థానమును జేరి గుఱ్ఱముపై జీన్వైచి దాని నధిరోహించి యతి త్వరితగతిం దానిం బోనిచ్చుచు నిట్లాలోచింపఁ గడంగెను. " ఆహా ! యిన్ని దినంబులనుండియు రాణిగారిని గష్టముల పాలుచేయుచుండిన దుర్మార్గులు వీరే యని నా కిప్పుడు దృఢముగఁ దెలియవచ్చెను. ఆ కోరమీసములవాఁడు వారి యజమానుఁడు గాఁబోలు ! వాని మాటలన్నియు వినఁబడెనుగాని మరల నేవో కొన్నిరహస్యముల వారిచెవి నూదెను. అం దేమి సంగతు లున్నవో యెవ రెఱుఁగుదురు. వీరి దుండగముల నడంప రాణిగారితో నీ వార్త జెప్పవలయు " నంచుఁ దన తురంగమును వడివడిగ నహమ్మదు నగరమునకుఁబోవు మార్గమునఁ బోనిచ్చుచుండెను.

## అయిదవ ప్రకరణము

మనచరిత్రకాలమున హిందూదేశమున ఢిల్లీనగరముకంటెఁ బ్రసిద్ధికెక్కిన పట్టణము వేఱొకటిలేదు. ఈ కాలమున నక్బరు చక్రవర్తి దానిం బాలించుచుండెను. మన దేశమందు రాజ్యమేలిన మహమ్మదీయరాజులలో నీ పాదుషాహా యప్రతిముఁడగు రాజని చెప్పుటకేసందేహములేదు. ఏ రాజు మతభేదములు లేక యన్ని మతములవారిని దయతోఁ బ్రోచుచుండెనో, ఏరాజు రాజపుత్రస్త్రీలఁ బెండ్లాడి వారి బంధువులకు గొప్పయుద్యోగము లిచ్చుచుండెనో, ఎవనికాలమున గ్రూరమగు దురాచారము లన్నియుఁ గొట్టివేయఁ బడెనో, ఏరాజు సద్గుణపుంజములు జనులెల్లరచే నుతింపఁబడుచుండెనో ఎవని బాణసంధానము చూపరులకు భయసంభ్రమములఁ గలుగఁ జేయుచుండెనో యట్టి యక్బరుచక్రవర్తి ఢిల్లీని బరిపాలించుచుండ జనులెల్లరు సుఖముగ జీవించుచు శత్రువులవలన నేబాధలు లేక హాయిగఁ గాలము గడుపుచుండిరి. ఈతఁడు రాజ్యమునకువచ్చిన కొలదికాలములోనే జానుపురము, బంగాళము, కాశ్మీరము, సింధుదేశము, గుజరాతము, కాబూలు మొదలగువాని జయించి యసమాన ప్రతిభావంతుఁడై యుండెను.

ఇట్లుండ నక్బరుచక్రవర్తి యొకనాఁడు తన యాస్థాన మంటపమునకేఁగి తన మంత్రులను, సేనానాయకుల నవలోకించి "మంత్రులారా! మొన్నటిదినము కాంధహార్‌రాజ్యము మన కతి సులభముగ స్వాధీనమయ్యెను. మన సైన్యముల కేమియుఁ

గష్టములు గలుఁగలేదని తలంతును. మఱియు నా తాత తండ్రుల వలెనే నాకును దేశమునగల పెక్కురాష్ట్రముల జయించి హిందూ దేశమున మొగలాయి రాజ్యమును స్థాపింప బుద్ధివొడముచున్నది. దీనికి మీరెల్లరు శ్రద్ధవహించి పనిచేయుచు నాకు మిక్కిలి సాయ పడవలయు" నని చెప్పునంతలో నొక పరిచారకుఁ డరుదెంచి "ప్రభూ ? ద్వారముకడ నెవఁడో తమ దర్శనార్థమై వచ్చి యున్నాఁడు. సెలవైన రా నెంచుచున్నాఁ" డన నక్బరా వచ్చిన వానిని రా నాజ్ఞ యిచ్చెను. అంత నొక యౌవనపురుషుఁ డక్బరు యెదుట నిలిచెను. అక్బరా నూతనపురుషుని నుచితాసనాసీనునిగఁ జేయ నాతఁ డిట్లనియె. "మహాప్రభూ ! నే నహమ్మదునగరమున కైదామడలదూరమందున్న శివనేరిదుర్గము నిటీవల, జయించి దానికి నాయకుఁడుగ నున్నాను. నాపేరు మియర్‌మంజూ నా సమీప బంధువులలో నొకఁడును, నైజాంషాహావంశమునకు సంబంధించివాఁడును నగు నొకబాలుఁ డిప్పు డహమ్మదునగర రాజ్యసింహాసనము నధిష్ఠింప హక్కు గలిగియున్నాఁడు. ఆ పిల్ల వానికి రాజ్యమును జెందనీక పెక్కురు తమకునైతము హక్కు గలదని వాదించుచున్నారు. ప్రతిదినమును జరుగు పోరాటంబులకు లెక్కలేదు. పిదప నేఁ గొంతమందితోఁ గలిసి ప్రస్తుత మారాజ్యము నకు రాణియని పేరుపెట్టుకొని బహదరనుపిల్లవానికే హక్కుగలదని గట్టిపట్టుపట్టి వాదించుచున్న చాందబీబీతో యుద్ధముచేసి సంపూర్ణ ముగ నోటమింబొంది మీ సహాయము వేఁడ నిటకుఁవచ్చితి. కావున నా యందు మీరు సంపూర్ణకటాక్షముంచి మీ సేననుబంపి నాకు

సాయమొనర్చితిరేని యహమ్మదునగర రాజ్యములో నర్ధభాగమును నేనుభక్తితో మీకు సమర్పింప సిద్ధముగ నున్నాను. మఱియుఁ చాంద బీబీ నెటులైనఁ జెఱపట్టి హింసింప నా శిష్యులలో ననేకులను పంపియున్నాను. వారాకార్యమును నెఱవేర్చిన మన మతిసులభము గనే యహమ్మదునగరమును స్వాధీనము చేసికొనగలమనిచెప్పెను. రాష్ట్రముల నెల్ల జయించి యేకఛత్రాధిపత్యమును వహింపవలయు నని యాశతో నున్న యక్బరా వార్త విన్నతోడనే సంతోషాక్రాంత స్వాంతుఁడై మియర్‌మంజూపంకఁజూచి " అయ్యా ! కొద్దికాల ములోనే నా పుత్త్రుఁడగు మురాదువెంట గొప్పసైన్యమును బంపు చున్నాను. నీవు దానికై చింతిలవలదు. నీవు నీ సేనను సిద్ధముగ నుంచు " మని చెప్పెను. అంత మియార్‌మంజూ మిక్కిలి సంతసముతో నతని కనేక సలాములొనర్చి తన పరగణానుజేరఁ బ్రయాణమైపోయెను.

## ఆఱవ ప్రకరణము

చదువరులారా ! అహమ్మదునగరము తట్టు మరలఁ జూడ్కి నిగిడింతము. ఆహా ! కలధౌతశిఖరులో యన భ్రమఁ బుట్టింపఁజాలిన యా హర్మ్యములను, ఆ విద్యాశాలలను, ఆ నాటక శాలలను జూడుఁడు. కనులపండువై కనుపించు మనోహర కుసుమతతుల నలంకరించుకొని ప్రభాకరుని యఖండ తేజోరూప మును మింటఁగలిపి చల్లని మందమారుతముచే నప్పురజనుల

మనంబుల నుల్లసిల్లఁజేయుచు నల్లిబిల్లిగనల్లుకొని ప్రకాశించుచున్న తరులతోద్యానవాటికలను సాయంసమయమున సౌధోపరిభాగమున విశ్రాంతికై విహారమునల్పుచున్న యా సుందరాంగనలఁ దిలకింపుఁడు ! ఆహా ! వారియందమేమి ! అల్లదిగో యా విపణివీధుల సొంపు నించుకచూడుఁడు ! ఎచ్చటఁజూచినను ధాన్యరాసులు, ఎచ్చటచూచినను వస్త్రపుగుట్టలే ! అత్యద్భుత శిల్పకళాసౌభాగ్య భాసురమై, శూరనివాసమై యొప్పు నప్పురంబున సుజనులు, దుర్జనులు గూడి నివసించుచుండిరి.

చాందబీబీ నివసించునగరు మిక్కిలి పెద్దది. ఈనగరునకు నైదు హజారములు గలవు. ప్రతిహజారమునందును గావలివారు తుపాకులను భుజములపైఁబెట్టుకొని సదా దానింగాపాడుచుందురు. రాణివద్దనుండు మంత్రులును, నౌకరులును దప్ప మిగులవారి నెవరినిగాని రాణిగారియాజ్ఞయైన పిదప నీకావలివారు నగరు లోనికిఁబోనిచ్చుచుందురు. హజారముల నన్నిటిని దాటితిమేని మనమొక పెద్దబంగళాలోనికి బోయెదము. ఇందు చాలామంది నౌకరులు రాజ్యాంగ వ్యవహారవిషయములను నెఱవేర్చుచుందురు. దీనికిఁ బైయంతస్థునందు విశాలమైన కూటమొకటి గలదు. దీనియందే చాందబీబీ సాధారణముగఁ దనమంత్రులతో రహస్యాలోచనలు సల్పుచుండును.

ఒకదినము మధ్యాహ్నము మూఁడుగంటలకుఁబిమ్మట నీ విశాలభవనమున చాందబీబీ యుత్తమాసనాసీనురాలై యుండ నామె కిరుపార్శ్వముల షాజిబీబీయు, బహాదరును గూర్చుండి

యుండిరి. అత్తరుణమున చాందబీబీయు, షాజిబీబీయుఁ దమ యంతరంగముల నిమిడియున్న విషయములంగూర్చి సంభాషింపఁ దొడఁగిరి.

చాంద :—మొన్న బహాదరుకుఁ దటస్థించిన ఘోరవిపత్తును గుఱించి తలఁచినపుడెల్ల నా మనస్సు దహించుచున్నది. ఇంతచేసిన దుర్మార్గులిఁక నెంతపని చేయనెంచియున్నారో? మియర్ మంజూ మనతోఁ బగ సాధించినదిమొద లిప్పటి వఱకును బ్రజలకు నేదో యొక కీడు వాటిల్లఁజేయుచునే యున్నాఁడు.

షాజి :—అమ్మా! యింతకు ముందొకప్పుడు మీరు నాతో నేమి చెప్పియుంటిరో జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. "నా కంఠమునఁ బ్రాణము లుండువఱకుఁ బగవారితోఁబోరి యహమ్మదు నగరమును శత్రువులచేతికిఁ జిక్కనీయ" నని నుడివి యుండలేదా? మఱియు నా దుర్మార్గుఁడక్బరు చక్రవర్తిని సాయము వేడఁగోరి ఢిల్లీ కరిగనట్లు విన్ననేకదా మనకు వర్తమానము వచ్చినది.

చాంద :—ఢిల్లీకిఁ బోయిన నక్బరుపాదుషా యిట్టిదుర్మార్గునికి సహాయ మొనర్చునా? ఒకవేళ సాయమొనర్చినను మనకు మాత్రము సాయపడువారులేరా? ఇబ్రహిం అదిల్ షాహా మనకుఁ బ్రాణదానమునైనఁజేయుటకు సిద్ధముగనున్నాఁడు.

చాందబీబీ యిట్లు చెప్పునప్పటికి షాజిబీబీ తలవంచెను. కారణమేమి ? ఇబ్రహీం అదిల్‌షాహా యనుమాట తాను వినిన తోడనే యామెకు బీజపూరు జ్ఞాపకమునకు రాగా వెంటనే యామె తన ప్రియుఁడగు ముస్తుఫాను జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. అందుచే షాజి సిగ్గుచేఁ దలవంచెను.

చాంద :—అమ్మా ! ఏల తలవంచుకొంటివి ? అదిల్‌షాహా సహాయ మొనర్పఁడనియా ?

షాజి :—( తన మనస్సులోని సంగతి వెలిబుచ్చక ) తప్పక సాయమొనర్చియేతీరును. ముస్తుఫాగూడ నిబ్రహింతోఁ గలిసి సైన్యాధిపతియై వచ్చునేమో ! యని చెప్పుచు దన ప్రియుని నామాక్షరముల నించుక సేపు స్మరించుటచేఁ దనకుఁగలిగిన యానందమును వెల్లడిచేయుచు నానంద బాష్పములను విడిచెను.

చాందబీబీ షాజిబీబీయొక్క హృదయమును గనుగొన్నదై " అమ్మాయీ ! నీ సంకల్పమెట్టిదో నాకుఁ దెలియవచ్చెను. భగవంతుఁ డచిరకాలములోనే దానిని నెఱవేర్పఁగలఁడు. నేను దానికై కావలసినంత యత్నమును జేసెద " నని చెప్పునంతలో గడియారమైదుగంటలు గొట్టుటచే వారచ్చటినుండిలేచి పరిశ్రమా గార మార్గమునఁ బోవుచుండిరి.

షాజిబీబీయుఁ జాందబీబీవలెనే యుద్ధక్రమమును జక్కఁగ నెఱిఁగియుండుటచే నప్పుడప్పుడు యుద్ధములలోఁ జాందబీబీకిఁ దోడుపడుచుండెను. వారిద్దఱు పురుషులవలెనే మంచి శరీరపుష్టి

గలిగినవారు. దేహపరిశ్రమమునకై వీరిరువురికి నంతఃపురమునందే యొక పెద్దగది కలదు. దానిలోఁ జిత్రవిచిత్రములైన యాయుధములు, లోడీలు మున్నగు శరీరపరిశ్రమ కుపయోగపడు పనిముట్లు నిండియుండెను. దేహపరిశ్రమ మొనర్చుతరి వీరిబింబములు ప్రతిఫలించుటకు రెండుఅద్దములా గదిలో నమర్పఁబడియుండెను. ప్రాతఃకాలమునను సాయంకాలమునను వారు శరీరపరిశ్రమ మొనర్చుటకా గదికిఁ బోవుచుందురు.

అట్లే నేఁటి సాయంకాలమునఁ గూడ వారు దేహపరిశ్రమ మొనర్చి వెంటనే స్నానమాడుగది కేఁగిరి. అచ్చటికి నలువురు పరిచారిక లరుదెంచి వారిని జలకమాడింప వారు భోజనశాలకు వెళ్లిరి. వీరికి భోజనాదికృత్యము లగునప్పటికి రాత్రి దాదాపు తొమ్మిదిగంటలు కావచ్చుటచే వారు వారి ప్రతేక శయ్యాగృహంబులకు వెడలిపోయిరి.

షాజిబీబీ శయ్యాగృహమున కేఁగి తలుపు దగ్గరగ వేసికొని పట్టుపాన్పుపైఁ జేరి తా నిన్నిగంటలకు రా నియమించిన మనుజునికొఱకై వేచియుండెను. ఇంతలో నా గదితలుపుదెరువఁబడెను. వెంటనే పకీరచటికిరాగా షాజిబీబీ మంచమునుండి లేచి యతనికి వందన మాచరించెను. అంత పకీరు " అమ్మా : నీ సంకల్పము కొద్దికాలములోనే నెఱవేర్పఁగలను. దానికై మీరు చింతింప నవసరములేదు. నా మేనిలోఁ బ్రాణములుండ నెవ రెన్ని యాటంకములు గలుగఁ జేసినను నే నాపనిని సఫలము గావించి

మిమ్ముల సంతోషవార్ధి నోలలాడించెద " నని చెప్పెను. అంత షాజీ " కరుణాసముద్రా ! నిన్ను నే నేమని పొగడఁగలను ? నాకు మీరు చేయఁబోవు మహోపకారమున మీ కెన్ని సంకటములు దటస్థించినను గలఁతజెందక కార్యమును ఫలవంతముగజేయుఁడు ఆ దుష్టులొకవేళ సాహసించి కార్యభంగ మొనర్పవచ్చును. మీరు జాగరూకతతో మెలంగవలయు " నని చెప్పుచుఁ దన పాన్పు క్రిందనున్న యొక కాగితమును దీసి పకీరు చేతికందిచ్చెను. అంతఁ బకీరు దానిని తన యంగరఖాలోఁ బదిలపరచుకొని యామెవద్ద ననుజ్ఞగొని యెచ్చటికో వెళ్లిపోయెను. షాజీబీబీయుఁ గాఁగల కార్యములను గుఱించి తలంచుచు నిద్రించెను.

## ఏడవ ప్రకరణము

ఆహా ! రాత్రి సృష్టి, స్థితి, లయములకు హేతుభూతుండగు భగవంతునిచే సృష్టించఁబడి సకల జంతుసంతతికి నపార నిద్రాసుఖ మొసంగు మహోపకారిగదా ! మఱియుఁ బాపకర్ములకును జార చోరులకును గంటికిఁ గూర్కు రానీయక వారిచ్చవచ్చినట్లు జరుపుటలో సహాయభూతముగ నుండునుగదా ! అట్టి సమయమున నహమ్మదునగరములోని జనులందఱు తమ్ము, దామెఱుఁగక నిద్రించుచుండిరి. పక్షులన్నియుఁ గూజితములు మాని తమతెక్క లలో ముక్కులఁజొప్పించి గూడ్లయందుఁ గూర్కుచుండెను.

అత్తరుణమున నొక తరుణవయస్కుఁడు వేషధారియై యహమ్మదునగర వీధులలో వడివడిగ నడచుచు గస్తిదిరిగెడువా రడ్డము వచ్చెనేని నేదైన నొక స్తంభముచాటున దాగుచు నెట్లో యొక యరగంట కాలమునకు దక్షిణపు దిక్కుననున్న వీధి యందుఁ బదియవ యింటికడ నిల్చి మెల్లగఁ దలుపుదట్టెను. పిమ్మట నిద్దఱు మనుష్యులు లోపలినుండి బరుగెత్తివచ్చి యా తలుపునుదీయ వేషధారి లోపలఁ బ్రవేశించి యొక పెద్దహాలు లోనికిఁ బోవుచుండెను. అంత నిరువురుమనుజు లతని కెదురుగ వచ్చి సలాములొనర్చి గూఢములైన మార్గముల నీతనిఁ దీసికొని పోవుచు నొకగదిఁజొచ్చిరి. ఇతరుల కెవరికైన నా గదిని బ్రవేశించుట కతికష్టముగ నుండుటచే నదియొక యాలోచనామందిరమని తెలియవచ్చుచుండెను. ఆ గదిలో నొక కుర్చీపై నొక స్థూల కాయుఁడు గూర్చుండియుండెను. అతని ముఖమండలము క్రోధ ఘూర్ణిత మగుటచేఁ బొమలు ముడివడి యుండెను. కోపానలముచేఁ గలిగిన హృదయతాపమువలన నాతఁడూరక రొజుచు నేదియో యాలోచించుచుండెను. లోపలఁ బ్రవేశించిన వేషధారి నీతఁడు చూడఁగనే యాతనికోపము తగ్గెను. వేషధారియు నాతని చెంత వేరొకకుర్చీపైఁ గూర్చుండెను. అంత నలుగురు మనుజు లరుదెంచి యచటి కుర్చీలపైఁ గూరుచుండిరి. అంత నా స్థూల కాయుఁడైన దస్తగిరి వేషధారియైన ఖాదరునుజూచి, "ఆ దుర్మార్గురాలు మన కుట్రలన్నిటిని గనిపెట్టి మనల నందఱిని జెఱబెట్టి వధింపనున్నదఁట. ఇప్పట్టున మన మామెను బొలియించుటఁ గష్ట

తరముగ నున్నది. సర్వకాల సర్వావస్థలయందును నామెకుఁ దన మంత్రులు సహచరులై యున్నారఁట. అది నిక్కమో కల్లయో నేనెఱుంగ. మన కార్యముల నతిజాగరూకతతో నొనర్చు గుండడును మృతిబొందెను. మఱియు మన రాజుగారి కగ్బరు సాయ మొనర్చునో యొనర్పఁడో—ఇవన్నియు నాలోచించిచూడ నాకు భయమగుచున్న" దనెను. అంత ఖాదరు "దస్తగిరీ! నీ కేమింత భయము? ఎంతమంది యామెకు సహాయ మొనర్చిననేమి? నా యుక్తులచే నేనామెను లోబరచుకొని యామె నెట్లైన వధింపక పోదునా? మఱియు నింకొక నూతనవార్తఁ జెప్పెద. మన రాజుగారు షాజీబీబీ నెట్లయిన బెండ్లాడనెంచి యున్నాఁడు. షాజీబీబీ ముస్తుఫాసుదప్ప వేఱెవరిని బెండ్లాడదఁట. అందుచే నతఁడు షాజీబీబీకిని ముస్తుఫాకును వేఱుపాటు గల్పించనెంచి యున్నాఁడు. అట్లొనరించిన షాజీబీబీ దుఃఖముచేఁ దన ప్రాణములను వదలును. షాజి మృతిబొందఁగనే చాందబీబీయును కాలధర్మము నొందును. అంత మనమా పిల్లవానిని సంహరించి సులభముగ నహమ్మదు నగరమును స్వాధీనము జేసికొనఁగలము. పోనిండు. షాజి మన రాజుగారినే వివాహమాడునని దలంతము. అంతట సతిసులభముగ చాందబీబీ మన రాజుగారిని సన్మానించి యహమ్మదునకుఁ బట్టము గట్టును. అట్లుకానిచో నెట్లైన ముస్తుఫాను మన వలలోఁ జిక్కించుకొని ప్రాణములఁ దీయవలయును. అంత షాజి తన ప్రాణములనైన వదలును; లేదా బలాత్కారముగ మన రాజుగారి నైన వివాహమాడును. ఎట్లయిన మనకే లాభ" మనెను.

అంతట వాకిట నెవరో తలుపుతట్టినట్లు వినఁబడెను. వెంటనే తలుపుతీయఁబడెను. ఆ వచ్చిన మనుజుఁడు లోపలఁ బ్రవేశింపగనే ఖాదరు వానినిజూచి "హైదరూ! నీకొఱకే వేచి యున్నాము. నేఁడేమైన క్రొత్తసంగతులున్నవా?" యని ప్రశ్నించెను. అందులకు హైదరు "క్రొత్తసంగతులు లేకేమి? అవి యటుండనిమ్ము. నీవు పాతాళగృహమునుండి యెప్పుడువచ్చితివి? వారిని బాగుగ దండించితివిగదా?" యని యడిగెను. "దండించిన నేమిప్రయోజనము. 'గతజలసేతుబంధన' మనినట్లు వారి నిప్పుడేమిచేసియు నేమిలాభము? మేము పొరబడితిమి. మాదే తప్పని మనఃపూర్వకముగ నన్ను వేడుకొనిరి. అందువల్ల నేను వారి నిదియే మొదటితూరి యని క్షమించితి" నని ఖాదరు బదులు చెప్పెను. అంత హైదరు "అది యటుండనిమ్ము. మనతో నింత వఱకుఁ గలహించి మనపైఁ గత్తికట్టియున్న నాగసింగు తన యన్నయగు ప్రతాపసింగుతో నిటీవలఁ గలహించి మనపక్షముజేరి వాని యన్నయొక్కయు, రాణియొక్కయు గర్వమడఁపనెంచి యున్నాఁడు. నిన్నటిరోజున నన్నాతఁడు గలిసికొని తన్నెట్లయిన రక్షింప వేఁడినాఁడు. వానికిఁ గొంతసైన్య ముండుటచే మన రాజుగారి సైన్యముతో దానిం గలపవచ్చునని యెంచి నే నందులకు సమ్మతించితి. దీనికి మీ యభిప్రాయ మే" మని యడిగెను. అందులకు ఖాదరు "నీ యభిప్రాయమెట్టిదో మా యభీష్టము నంతియే. దీనికి మన రాజుగూడ సమ్మతించును. ఇఁక నా చాంద బీబీపని తెలియఁగల" దనిచెప్పి తన తావునుండిలేచి యిఁకమీఁద

తాఁజేయఁబోవు కార్యములను గుఱించి వారితో విశదముగఁజెప్పి మఱికొన్ని పనుల నొనర్ప వారికి నియమించి తా నా వేషముతో నా గృహము వదలిపోయెను.

## ఎనిమిదవ ప్రకరణము

సముద్రపు లోతునైనఁ గనిపెట్టవచ్చును. కాని, మానవుని హృదయవారిధిలోతు గనుటకు సాధ్యముగాదు. పైకి మంచిగనుండి లోలోపల నెన్నియో కుట్రలను బన్ను వా రనేకు లీ ప్రపంచమునఁ గలరు. తేనెపూచిన కటారిచందమున నుండునట్టి వారి మాటలను నమ్మి బేలుపోకూడదుసుమా! ప్రత్యక్షమందు దిచ్చకములాడి పరోక్షమందుఁ గార్యహానిచేయు సంగాతకాండ్రు పయోముఖ విషకుంభమువంటివారు. ఇట్టివారి కెప్పటికిఁ జోటియ్యరాదు. అట్టివారి వలలోఁజిక్కి చాలమంది తమ ధనమును గోలుపోయి యాలుబిడ్డలను ద్యజించి సన్యాసులై యూరూర బిచ్చమెత్తుకొను చున్నారు. అయిన నెట్టి మహాధీరులైనను దమ పూర్వజన్మ పరిపాకముకొలఁది దమకుఁగలుగఁబోవు విపత్స్వరూపముల నెఱుఁగక యిట్టివారికిఁ జోటిచ్చెదరు.

మన చరిత్రకు సంబంధించిన ఖాదరు పైని జెప్పఁబడిన పయోముఖ విషకుంభమువంటివారిలో నొకఁడు. అతఁడట్లాలోచనామందిరము వదలి బయట నొక స్నేహితుని గలిసికొని యా యర్ధరాత్రమున నహమ్మదు నగరములోని రాజవీధినిఁ బోవుచుండిరి. ఆ స్నేహితునకును ఖాదరునకును నీ క్రింది సంభాషణ జరిగెను.

ఖాదరు :- —నాగసింహా ! నీవు మీ యన్నతోఁగలహించి మమ్ములఁ గలిసినందులకు నా కెంతయు సంతసము గలుగుచున్నది. నీవు మాతోఁజేరినట్లు హైదరిప్పుడే నాకుఁ జెప్పెను. నేనింకఁ జేయబోవు కార్యములలో నీ వత్యంత విధేయుఁడవై సహాయము జేయవలయును. నీ కత్యంతహితులుగ నున్నవారిలో నిద్దఱిని నాకు సహాయ మంపవలయును. నీవు మాతోఁ గలిసిన సంగతి రాణికిఁ దెలియఁగూడదుసుమా ?

నాగ :—ఖానూ ! నీ యాజ్ఞ నేను మీఱుదునా ? నీ కేదినమున నా స్నేహితులఁ బంపవలయును ?

ఖాదరు :—నా మిత్రు లే దినమున నీకు జాబువ్రాయుదురో యా మఱునాఁడు సాయత్ర మూఁడుగంటలకు వారిని నా యొద్దకుఁ వచ్చునట్లు చేయుము.

వీరిట్లు సంభాషించుకొనుచు మెల్లగఁ చాందబీబీ నగరు వాకిటఁజేరిరి. అంత నాగసింగు ఖాదరువద్ద సెలవుతీసికొని తన యథాస్థానమును జేరఁబోయెను. పిమ్మట ఖాదరు నగరిహజారము వద్ద కేఁగి నిలుచుండెను. అచ్చట నొకసిపాయి తుపాకి నొకదాని నెత్తుకొని యిటునటు దిరుగుచు నా వచ్చినమనుజుని జూచి "ఎవరు నీవు ? ఈ యర్ధరాత్రమున నిటకు వచ్చుటకుఁ గత మెయ్యది ?" యని యడిగెను. అందులకు ఖాదరు "అయ్యా ! మాది శివనేరిదుర్గము. మాగ్రామ మిచ్చటికిఁ జాలదూరమగుటచేఁ నిచ్చోటికి వచ్చుటకుఁ జాలకాలమైనది. పరుండుటకు దావెచ్చటను దొరకదయ్యె. కాన నీ రాత్రి నీ హజారముకడఁ బరుండి తెల్లవాఱఁగనే రాణిగారిని దర్శించి వెళ్లవలయు" నని చెప్పెను. సిపాయి యందులకు సమ్మతింప నతఁడచ్చటనే బరుండి యెప్పుడెప్పుడు తెల్లవాఱునాయని వేచియుండెను.

అంతఁ గొంతవడికి సూర్యోదయంబయ్యెను. ఖాదరు ప్రాతః కాలకృత్యంబుల నెఱవేర్చి దాదాపెనిమిదిగంటలకు రాణిగారిసభకు వెళ్లెను. అతఁడు చాందబీబీని దర్శించినవెంటనే యామెకు పెక్కు సలాములొనర్చెను. రాణిగారును నాతని కుచితాసన మొసంగె. మంత్రులు దండనాయకులు మున్నగువా రాతనిఁజూచి యతఁ డెవఁడో సామంతరాజని తలంచిరి. అబ్దుల్ రహిమానుఁడుమాత్ర మాతఁడెవఁడో జిత్తులమారియని సందేహించి దానిని వెలిబుచ్చక యూరకెద్దియో యాలోచించుచుండెను. అంతఁ చాందబీబీ యా వచ్చిన నూతనపురుషునిజూచి "అయ్యా! మీరెవరు? మీ దేశమెద్ది? ఇటవచ్చుటకుఁ గతంబెయ్యది? మిమ్ములఁజూడ మీ హృదయము దుఃఖసముద్రమున మునిఁగినట్లున్న" దనెను. అంత ఖాదరు మఱింతదుఃఖము నభినయించుచు "అమ్మా! నాపేరహమ్మద్ఖానుఁ డందురు. మీ రాజ్యమున కైదామడల దూరమందున్న శివనేరిదుర్గమునకుఁ బ్రస్తుతము మియర్పంజా గదా యేలిక! అతనివద్ద నేను ప్రధానమంత్రిగనుండి రాజకీయ వ్యవహారముల గొప్పపేరు వడసితిని. కాని యాతఁడొనరించు కుట్రలయందు నేఁ బాల్గొనుట కియ్యకొననందున నాకు విరోధు లుగా నున్నవారి మాటలనువినియు నన్నుద్యోగమునుండి తొల గించి నాపైఁ గక్షగట్టి నన్నుఁజంపుట కనేక ప్రయత్నములఁ జేయుచున్నాఁడు. మఱియు నే నొకదినమున గ్రామమున లేనితఱి నా యాలుబిడ్డలనువధించి మా యింటఁగల ధనమును దొంగిలింప నా దుర్మార్గుఁడు కొంతమందిని నా యింటిపైకిఁ బంపెను.

రాణి:—రహిమానూ! చూచితివా యా మూర్ఖుఁ డొనరించు దుండగములు!

ఖాను:—"అమ్మా! నేను మా యింటికి వచ్చునప్పటికి ధనమంతయుఁ గొల్లగొట్టఁ బడియుండెను. నా భార్యకును, బిడ్డకును గొన్ని గాయములు తగిలియుండినవి. ఆ దుండగీం డ్రెవరైనదియుఁ గనుఁ గొను తరుణమున మఱికొందఱు దుర్మార్గులు హఠాత్తుగ నాభార్యపైఁబడి దానిం జంపిబిడ్డలను విగతప్రాణులఁ గావించిరి. నన్నుఁజంపుటకు నాపైఁబడు క్షణమున నేనెట్లో తప్పించుకొని మీ సన్నిధి కరుదెంచితి. మీరు నా కభయదానమిచ్చి రక్షింపవలయు"నను చాందబీబీ వెంటనున్న బాలునిఁజూచి దుఃఖించుచున్న ట్లభినయించెను.

చాంద:—అహమ్మదుఖానూ! భయపడకుము. ఈ సభామధ్యమున నిదిగో నీ కభయదాన మిచ్చుచున్నాను. రక్షించితి. కాని నీవేల బహదరువంకఁజూచి విలపించుచున్నావు?

ఖానుఁడు:—అమ్మా! ఆ దుర్మార్గుఁడేకదా యరణ్యప్రదేశముల వారితో స్నేహమొనర్చి యీ బాలుని జంపఁబ్రయత్నించినది. అయిన నే మహానుభావుఁడో రక్షించెను. అమ్మా! నా కంఠమున బ్రాణములుండ నాకుఁగల యుక్తులచేతను, మీ ప్రధాన మంత్రుల సహాయమువలనను నేనెట్లయిన నామూర్ఖుని దెగటార్పకపోదునా!

చాంద:—అహమ్మదుఖానూ! నీవు మా పక్షమునఁ జేరి నవాఁడవైతివి. నీవు మా ముఖ్యమంత్రులలో నొకఁడుగా నుండుటకు సమ్మతించి మాకు సహాయమొనర్పవలయును.

చాందబీబీ యీ మాటఁజెప్పగనే యామెవద్దఁ గూర్చుండియుండిన హూసేను మీర్జాయును, అబ్దుల్ రహిమానుఁడును ఆందోళితమనస్కులై తల్లడపడఁసాగిరి. వా రామెతోఁ జెప్పఁబూనుకొన్న విషయముల నహమ్మదుఖానుని యెదుట వెలిఁబుచ్చకూడదని తలచిరి. అదేమిచిత్రమో! చాందబీబీ వేషధారియై మాఱుపేరు పెట్టుకొనియున్న ఖాదరు ముఖము జూఁడగనే వానియం దత్యంతానురాగము గలదయ్యెను. ఈయనురాగమామెకు ఖాదరునదృష్టమువలనఁ గలిగినదో, లేక తన దురదృష్టమువలన సంభవించినదో చదువరులెఱుఁగఁ గలరు. అంత ఖానుఁడు "అమ్మా! నాకు సెలవిచ్చిన నా బసకేఁగెద. మరల మధ్యాహ్నము మూఁడు గంటలకు మిమ్ము దర్శింపవచ్చెద. అంత చాందబీబీ "ఖానూ! నీవు వేఱుగఁదలఁతువేమో నీకు నేఁడు మంత్రిపదవి నొసంగితి" నని చెప్పుచు నాతనికి సెలవిచ్చెను.

పిమ్మట ఖానుఁడు సభనుండి లేచిపోయెను. అతని ముఖపద్మము వికసించెను. తాననుకొనిన కార్యములన్నియు నిఁక నిమిషమాత్రంబున నెఱవేఱునుగదా యని యుప్పొంగుచుండెను. ప్రపంచమున జనులు తామెంచిన కార్యములన్నియు సమకూరునని యే తలంతురు. దైవసంకల్ప మెన్నటికి వారికిఁ దెలియదు గదా!

ఖానుఁడు తన తావునుండి లేచిపోవఁగనే హూసేను మీర్జా చాందబీబీనిజూచి "అమ్మా! నీ సింహాసన మధిష్ఠించినది మొదలు భవదీయ దర్శనార్థమై వచ్చినవారికెల్ల నీదోయొక పసదపమొసంగి పంపుచునేయున్నావు. నేఁడరుదెంచిన మనుజునిచర్య బాగుగఁ బరిశీలింప నీతఁ డొక యసాధారణ మనుజుఁడని తోచుచున్నది. నాకుఁజూడ నీతఁడు మియర్ మంజూ ఆజ్ఞగై కొని మన మొనర్చు పన్నుగడలఁ గనుఁగొన వచ్చినట్లున్నది. క్రొత్తగ వచ్చినవారి స్వభావ మేలాగునఁ దెలిసికొనవచ్చును? సజ్జన సాంగత్యమువలన సర్వశ్రేయములు దుర్జనసాంగత్యమువలనసర్వానర్థములునుబ్రాప్తించును. దానికి సంశయములేదు. ఆ జిత్తులమారి తేనెమాటలను నమ్మి మోసపోకూడదు. మనుజులు వారివారి కార్యముల సమకూర్పనెంచుకొని యెన్నియో బొంకులు బొంకుదురు. అవన్నియు నిక్కములనియే తలఁచి వానికి లోఁబడవచ్చునా? మీరెంత మాత్రము వానిని నమ్మకుఁడనెను.

చాంద:—ఏమీ! నమ్మకూడదా? తొలుదొల్త వానిని నమ్మి మంత్రిపదవి నొసంగెదనని మాటయిచ్చి యిప్పుడు వానిం దృణీకరించుట న్యాయమా? వానిమాటలయం దణుమాత్రమైన నీవు తలంచునట్టి ద్రోహబుద్ధిలేదు. ఇఁక మీదట నీవూరక యతని విషయ మెత్తకుము.

హూసేను:—అమ్మా! మనకేల నీవాగ్వాదము. నిజము నిలకడమీఁద దెలియఁగలదు. మీఁకు నే మారుపల్కువాఁడనా?

అని చెప్పుచుఁ దన స్థలమునుండి లేచిపోయెను. చాంద బీబీయు నావచ్చిన నూతనమనుజుని గుణములను బొగడుచు సభ నుండి లేచిపోయెను.

## తొమ్మిదవ ప్రకరణము

భామినీరాజ్యములోనుండి యైదు చిన్న రాజ్యములేర్పడిన వనియు, నందులో బీజపూరుగూడ నొకటనియుఁ జదువరుల కిది వఱకే తెలిసియున్నది. గత ప్రకరణమున వివరించిన విషయ ములు జరుగుచున్న కాలమున బీజపూరునందు రెండవయిబ్రహీం అదిల్ షాహా రాజ్యము నేలుచుండెను. ఈతని పినతండ్రి పుత్రుఁ డగు మహమ్మదు ముస్తుఫా యీతనికి సహాయపడుచు నచ్చటనే కాలము గడుపుచుండెను. ముస్తుఫా వయసున నిరువది వత్సరము లవాఁడై స్వర్ణకాంతినిబోలు దేహచ్ఛాయఁ గలిగి యుండెను. మఱియు నీతఁ డున్నత విగ్రహుండును, ఆజానుబాహుండును, పీనవక్షుండును, సర్వకళా కుశలుండునునై తనసాటి రాచకొమరు లకుఁ నీతిబోధ నేయుచున్నదో యనునట్లు నిష్కపట హృదయ మును వెల్లడిజేయు ముఖారవిందమును గలిగియుండెను. ముస్తుఫా పసితనమున నుండఁగనే తనతండ్రి గతించినందున దనకుఁగల గుఱ్ఱములను, యేనుఁగులను,కాల్బలమును విబ్రహీమ్ అధిపత్యము క్రిందనే యుంచెను.

ఇట్లుండ నొకనాఁటి సాయంకాలమున ముస్తుఫా యుద్యానవనమునఁ దన సహచరుఁడైన హుసేనుతో విహరించుచు నిట్లనియె. "హుసేనూ ! ప్రస్తుతము నాకు సంకటములే సంప్రాప్తించుచున్నవి. ఆయువతి నాయందనురాగము గలిగియున్నను నామెను నాకిచ్చి యుద్వాహ మొనర్చుటకుఁ చాందబీబీ కిష్టములేదేమో ! ఒక వేళ చాందబీబీ సమ్మతించిన దనుకొందము. మదాంధుఁడైన యా మియర్ మంజూ నేఁజేయఁబోవు ప్రయత్నముల కన్నింటికి నడ్డుపడి షాజి బీబీని తానే వివాహమాడ నెంచి యున్నాఁడని తెలియుచున్నది. తుట్టతుదకు నా ప్రియురాలిమోముఁ జూడనైన నాకుఁ బ్రాప్తి గలదో లేదో"యని చెప్పెను, అందులకు హుసేను "మీరు దానికై చింతింపకుడు. షాజి మిమ్ములనే వివాహమాడ నెంచియున్నదని చాందబీబీకిఁ దెలియును. ప్రథమమునుండియు షాజి యెవరిని వరించునో యాతని కామెనిచ్చి పెండ్లిఁజేయఁ చాందబీబీ పట్టుపట్టియున్నది. వారిద్దఱును సమ్మతింప నిఁక మిజర్ మంజూ యేమిచేయఁగలఁడు ? కావున మీరు దానికై వగవకుఁడు అనియెను. అంత ముస్తుఫా "హుసేనూ! నిన్నేమని పొగడఁగలను. నీవచనామృతధారలచే దుఃఖానల సంతప్తమగు నా హృదయము కొంత శాంతిపడినది. ఆహా ! ఈ మందమలయానిలయంబు నామనస్సును బరిపూర్తిగ శాంతింపఁజేయుచున్న" దనెను. చీఁకటి పడకమున్నె యంతఃపురమునకుఁబోవఁదలఁచి ముస్తుఫా హుసేనునకుఁ బోనాజ్ఞయొసఁగి తన భవనంబునకు వెళ్లెను.

అంతఁ గొంతవడికి రాత్రి యెనిమిదిగంట లాయెను. ముస్తుఫా భోజనమైన వెంటనే శయ్యాగృహమున కరిగెను. ఈ పడకగదియం దనేక చిత్రపటములు గోడలకుఁ దగిలింపఁ బడి యుంచెను. గదికి నాలుగు ప్రక్కలను నిలువుటద్దములు స్థాపింపఁ బడియుండెను. ముస్తుఫా పట్టుపాన్పుపైఁ బరుండి యిటునటు బొర్లుచు నెద్దియో యాలోచించుచుండెను. నిద్రించుటకు సాహ సించినను అతనికిఁ గంటికిఁ గూర్కురాలేదు. మదన ప్రేరితుఁ డగువాని హృదయ మెప్పు డాందోళనపడుచుండునుగదా! అంతఁ గొంతవడికి ముస్తుఫా లేచి కూర్చుండి యెద్దియో చిత్రపటమును జేతికిఁ దీసికొనెను. ఆ చిత్రపట మెవరిదైయుండును? అది షాజి బీబీ చిత్రపటమని చదువరులకు వేఱుగఁ జెప్పవలయునా? అంత ముస్తుఫా యా పటమును జేతఁబట్టి యీక్రిందివిధమున వర్ణింప సాగెను.

"షాజిబీబీ నెన్నఁడో చిన్నతనమునఁ జూచియుంటిని. గాని తిరుగ జవ్వనమున జూచియెఱుఁగ. ఆహా! యెట్టివానినైన నున్మత్తునిగఁజేయు నీపుత్తడిబొమ్మ నొకసారి యీ చిత్తరువునం దైనఁ జూచి యానందింతును, దీని యంగశృంగారంబు నేమని వర్ణింతును. కృతిమాలంకారములతో నీమెకుఁ బనియేమి? ఈమె నెమ్మేనికాంతియే బంగారము, కెమ్మోవి చాయలు కెంపులు, పలు వరుసయే ముత్యాలసరులు, పెన్నెరు లింద్రనీలములు, తళుకు తళు కని మెఱయు సోగ కన్నులే సానదీర్చిన వజ్రములు. ఇట్టి నాతిని

జేపట్టిన పురుషుని కిట్టిట్టనరాని సుఖంబు గలుగునుగదా ? నేనీమె నీచక్షువులతో జూడఁ జాలునంతటి భాగ్యశాలి నగుదునా ? మేలిమి యగు సంతిపురముల వసించు నతిసుకుమారులై జాళువాపసిండి బొమ్మలఁ బోలు నీలాలక లెందఱెందఱినో చిత్రపటములందుఁ జూచియుంటినిగాని యీత్రిలోకమోహిని కెనయగు తొయ్యలి నెయ్యెడను జూచియెఱుఁగ. భూమికవతరించిన దేవతవలె నున్నది. చంద్రునికి వంకలుదిద్దు ముద్దుమోము గలది. ఆహా ! యీపడతిని గడుపారఁ గన్న తలిదండ్రు లేమిపుణ్యముచేసిరో" యని వర్ణించునంతలో నాగదితలుపు మెల్లగఁ దెఱవఁబడెను. ముస్తుఫా షాజి వచ్చెనను భ్రమతోఁ దలుపువద్ద కేఁగెను. ద్వారముకడఁ దనకొక ఫకీరు గాన్పించెను. వెంటనే ముస్తుఫా ఫకీరునకు పెక్కుసలాము లొనర్చి యాతని లోనికిం గొంపోయి పాన్పుపైఁ గూర్చుండఁ బెట్టి భయవినయములతో నిట్లనియె. "స్వామీ ! భవదీయ దర్శనంబున నామనస్సు సంతుష్టి నొందినది. మీరాఁకకై రెండు మాసముల నుండియు వేఁచియున్నాను. దూరదేశములకువెళ్ళియుంటిరని తలంచితిని. నేఁడేల మీరింత ప్రొద్దుపోయిన వెనుక వచ్చితిరి ? అహమ్మదునగరమునుండి యీ పట్టణమునకు మార్గమతి దుర్ఘటమే ; ఇంతరాత్రివేళ నాఘోరారణ్యమున మీరెట్లురాఁగలిగితిరి ?" అందులకుఁ ఫకీరు, "నాయనా ! ప్రొద్దు పోఁక ముందే యిటువచ్చిన నాదుర్మార్గు లూరకుందురా ! వారెట్లయిన నేఁజేయుఁ బన్నుగడలఁ గనుఁగొని నన్నుఁ బరిమార్పనెంచియున్నారు. కాని నేను వారిచేయిఁ జిక్కువాఁడనా ! మఱియు

మీరు నాతో నిదివఱలో సుడివినరీతి నాయువతి డెందము నేఁగను గొంటి. త్రికాలములయందు నామె మనస్సు మీ యందే లీనమై యున్నది. మఱియు నామె మొన్నటి దినము నాచేతి కొక లేఖ యిచ్చినది. దానియందేమున్నదో చదువుకొనుఁడు అనుచు నతని చేతికొక జాబునిచ్చెను. అంత ముస్తుఫా దాని నీ క్రిందివిధమునఁ జదువఁదొడఁగెను.

"నా ప్రాణప్రియుఁడగు ముస్తుఫాగారికి,

లేడిని వ్యాఘ్రములు చుట్టుకొనఁబోవుచున్నవి వానిలో నొక బెబ్బులి యా కురంగమును వీపునధరించుకొనిపోయి తన యిచ్ఛవచ్చినట్లు చేయ నెంచియున్నది. జింకపై ప్రేమగల శూరుఁ డావ్యాఘ్రములఁ జెండాడి లేడిప్రాణముల దక్కించవలయును. ఆశూరునికొఱకై యాలేడి వేచియున్నది.

ఇట్లు,
మీ ప్రియురాలు, షాజీబీబీ"

అట్లతఁడు దానింజదివి ముగింపగనే ఫకీరు "ముస్తుఫా! దానిలోని సంగతులు నీకు విశదముగఁ దెలిసెనుగదా! కాన నీవు త్వరలో బయలుదేరి యహమ్మదునగరమునకు రావలయును. తడవుసేయక నేను వెళ్ళవలయు ననుచు నారాత్రి తానటనుండక ప్రయాణమై పోయెను.

## పదియవ ప్రకరణము

ఆహా! ఇమ్మహాప్రపంచమున జన్మించియుండు ప్రాణి కోటులను పరిపరివిధముల హింసలకుఁ దాల్చి యలమట పెట్టునది యాశ. ఆశ పాశమువంటిది. యమపాశమునైన ద్రెంపవచ్చును గాని యీ యాశాపాశమును ద్రెంచుటకు సాధ్యముకాదు. గొప్ప గొప్ప యోధులు నైత మీయాశాపాశముచేఁ గట్టఁబడి హింసకు లోనై మృతినొందుచున్నారను సంగతి యందఱకుఁ దెలిసిన విషయమే!

మన చరిత్రకు సంబంధించిన మియర్ మంజూ ఇంతవఱకు నాశాపాశముచేఁ గట్టఁబడి యుండెను. పాశ మచేతన వస్తువు. ఇప్పుడది చేతన వస్తువుగా మాఱినది. పాశము పిశాచమైనది. ఇప్పుడీయాశాపిశాచము మియర్ మంజూ మనస్సును బలువంకలకు బోనిచ్చి యైంద్రజాలకుని వలెఁ బెక్కు సంభవములను క్షణకాల ముననే కాన్పింపఁ జేసి యవన్నియు సత్యములుగఁ దోచున ట్లొనర్చి యతనిని సర్వదా హింసించుచున్నది.

ఈ కాలమున దక్కనీతురుష్కు లనియుఁ బరదేశీయ తురుష్కులనియు రెండు తెగ లేర్పడెను. దక్కనీ తురుష్కు లనఁగా బహుకాలమునుండియు దక్షిణదేశమునందే కాపురముం డిన తురుష్కులు. అట్లుగాక క్రొత్తగ నరబ్బీ, పారశీకాది దేశ ములనుండి వచ్చినవారు పరదేశీయ తురుష్కులు. ఆ కాలమున గొప్పగొప్ప సర్దారులుగానున్న వారందఱు పరదేశీయులైన తురు

ష్కులగుటచే వీరి యుత్కర్షమును జూచి దక్కనీతురక లోర్వ లేక పోయిరి. అందుచే నీరెండు తెగలవారికి ననేక యుద్ధములు జరుగుచుండెను.

మియర్ మంజూ దక్కనీతురకలలో ముఖ్యుఁడు. ఈతఁ డహమ్మదు నగరరాజులపై మితిలేని యాగ్రహమును వహించి యారాజ్యమును దిగమ్రింగ సమయమునకై నిరీక్షించుచుండెను. ఇప్పు డహమ్మదు నగరమునకుఁ బరాక్రమశాలియగు రాజు లేఁడ నియు, బహదరు చాల పసివాఁడనియు నెంచి యహమ్మదు నగర మును మ్రింగఁ బ్రయత్నించి తా నొంటరిగ నీపనిజేయుట కసాధ్య మని యెంచి, భామినీరాజులతోఁ గక్షవహించియున్న దక్కనీ తురకల నందఱిని తన వశము జేసికొని యహమ్మదుషాహాచే జయింపఁబడిన శివనేరిదుర్గము నాక్రమించుకొని మురాదు సేనకై యనుదినము నిరీక్షించుచుండెను. పైప్రకరణములోఁ జెప్పఁబడిన ఖాదరు, హైదరు, దస్తగిరి యను నీమువ్వురను మియర్ మంజూకు ముఖ్యమంత్రులు. అదుష్టత్రయమే తమ యేలికకు సదా సాయ పడుచు నతఁడు చెప్పిన చొప్పున నడుచుకొనుచుందురు.

శివనేరిదుర్గములోని దర్బారుమహాలునందున్న గద్దియ నొక నాఁటి మధ్యాహ్నమున మియర్ మంజూ అధిష్ఠించియుండెను. అతని దాఁపున మంత్రులలో నిద్దఱును, సేనాధిపతులును వెలయు చుండిరి, అహా ! అదృష్ట మెట్టినీచునినైన మహోన్నతదశకుఁ దెచ్చునుగదా ! మియర్ మంజూ ఇంతవఱకును నహమ్మదునగర

ములో నొక సర్దారుఁడుగ యుండెను. ఇప్పుడతఁడెట్టి యున్నత దశయం దున్నాఁడో చూడుడు.

మియర్ మంజూ ముప్పదియేండ్లకు పయిబడ్డవాఁడని చెప్ప వచ్చును. బాహువులు దృఢములై మోఁకాళుల వఱకు వ్రేలాడు చుండెను. ముఖము కఠినమై హృదయకాఠిన్యమును వెల్లడిచేయు చుండెను. అందుచే నతని మాటలు గంభీరములై వినువారలకు భయాస్పదములుగ నుండెను. ఇట్లున్నను రాజకార్యములయం దెన్ని చిక్కులున్నను, క్షణకాలముననే వానిని సరిదిద్దు బుద్ధివై దగ్ధి యాతనికిఁ గలదు.

మియర్ మంజూ సింహాసనమున నున్నతఱి నొకవీరుఁ డొక పిల్లవానిని వెంటఁ బెట్టుకొని యాతనికడ కరుదెంచెను. అంత మియర్ మంజూ తన యాసనమునుండి దిగి యెదురేగి యా వీరపురుషుని గౌరవపూర్వకంబుగఁ బిలిచికొని వచ్చి దాఁపున నున్న యొక గద్దియపైఁ గూర్చుండఁబెట్టి తన స్థానము నలంక రించెను.

మియర్:—హసన్ మియ్యాగారూ! ఈ పిల్లవానికై పడుపాట్లె న్నియని చెప్పుటకు వీలులేదు. ఇటీవల ఢిల్లీచక్రవర్తిని సాయమునకుఁ బిలిచితి. నా వేడికోలున కాతఁడియ్యకొని తన పుత్రుఁడైన మురాదు వెంట సైన్యము నంప సిద్ధ ముగ నున్నాడు. మన సైన్యముల నతి జాఁగరూఁకతతోఁ జేర్పవలయును. అహమ్మదే యహమ్మదునగరమునకు

రాజని యూరంతయుఁ జాటించుటకు సేవకుల నిప్పుడే పంపియున్నాను.

హాసను:—(పిల్లవానివంకఁజూచి) అహమ్మదూ! నీ యదృష్ట మిప్పుడు తెలియవలయును. నా అన్నయగు నీ తండ్రి చనిపోవునప్పుడు నే నాతనికిఁ జేసియుండు వాగ్దానము నెఱవేఱ వలయును. (మియర్ మంజూవంక జూచి) మిత్రమా! సిద్దీసర్దారులందఱేకమై చాందబీబీకి సహాయ పడనెంచి బహదరు నతిజాగరూకతతోఁ గాపాడుచున్నారు.

మియర్!—అందువల్ల నాబహదరును జంప నా సేవకులను బంపితిని. వారాబాలుని జంపుటయందుఁ బొరపడినట్లును నీతరుణమున వారిని మన్నించినట్లును ఖాదరు నా కొక లేఖను బంపెను. మఱియు ఖాద రహమ్మద్ ఖానుడను పేరుతో చాందబీబీ వద్దనున్నాడు. అతడెట్లయిన నిఁక చాందబీబీని గడతేర్పఁగలఁడు, బహదరు, చాందబీబీలఁ జంపుటకు నా శిష్యవర్గములోఁ గొంతమంది నిప్పుడే ఖాద రుకు సాయముగ నహమ్మదునగరమునకుఁ బంపితి. మన వారు వారిద్దఱిని గడతేర్చిన నే నతిసులభముగ షాజీబీబీని బెండ్లాడఁగలను. పిమ్మట నహమ్మదుకుఁ బట్టముఁగట్టుట మన కతిసులభము.

హాసను:—మాలికాంబరు షాజీబీబీని బీజపూరులో నుండు మహ మ్మదు ముస్తుఫా కిచ్చి వివాహము జేయుటలో మిక్కిలి శ్రద్ధవహించి యుండునట్లుగూడ సంగతి తెలియవచ్చినది.

అతఁడు నేయఁదలఁచుకొనిన యేకార్యమునుగాని ముందుగ నెవరికిఁ దెలియఁజేయఁడు. మఱియు మన ఖాదరు చాంద బీబీనగరు జేరిన వెనుక రాణికి ఖాదరుపై మిక్కుటమగు ప్రేమ జనించుటచే నామె మాలికాంబరునుగూడఁ దృణీక రించుచున్నదఁట? ఇందెంతనిజ మున్నదో నాకుఁ దెలియదు.

ఈ మాటను విన్నతోడనే మియర్ మంజూకు పట్టరాని సంతోషము గలిగెను. అతఁడు ఖాదరును మిక్కిలి కొనియాడుచు "స్వామికార్య ధురంధరుఁడన్న బిరుదము మన ఖాదరుకే తగి యున్నది. ఇఁక మన కార్యము లన్నియు నచిరకాలములోనే సిద్ధింపఁగలవు. రేపు కొంతసైన్యమును సిద్దీసర్దారులపైకిఁ బంపి వారినెట్లయినఁ గడతేర్పవలయును. లేనిచో మనము జయము పొందుట కష్టము" అనెను.

ఇట్లు వారు కొంతకాలము మాట్లాడినవెనుక హసన్ మియ్యా బహదరును వెంటఁబెట్టుకొని తన స్థానమునకుఁ వెడలి పోయెను.

## పదునొకండవ ప్రకరణము

ఆహా! ప్రేమ యెంత మనోహరమైనది. అది యీశ్వర దత్తమైన శాశ్వతవస్తువు. అది యెట్టివారికైన నెచ్చట నిష్టమో యచ్చటనే యుత్పన్నమగుచుండును. ఎవరియందుఁగాని తమ ప్రేమను లగ్నము చేయక మానవు లుండఁజాలరు. అది త్రాళ్ల

లేకయే బంధించును. ఈ బంధనములను ద్రెంప నెవరికిని సాధ్య ముగాదు. పూర్వజన్మ కర్మము ననుసరించియే యీ ప్రేమ యుత్పన్న మగుచుండును.

కాలము జరుగుకొలఁది చాందబీబీకి ఖానునిపైఁ బ్రేమ మిక్కుటమాయెను. రాచకార్యములందు ఖానునిమాట కడ్డులేదు. చాందబీబీ యేపని జేయఁబూనుకొన్నను ఆతనితో నాలోచించుచు దన యభిప్రాయము నెఱిఁగించుచుండెను. మాలికాంబరు హానేసు మీర్జాల మాటలు దనకేమియు రుచింపవయ్యె. అట్లున్నను వారు రాణిగారి కత్యంత విధేయులై తమ కార్యములను గృతజ్ఞతతోఁ జేయుచుండిరి. ఏదియెట్లున్నను ఖానుఁడుమాత్రము చాందబీబీ నగరులోని వారి నందఱిని తన వలలోఁ బడవేసికొనెను. బహాదరును ఖానునిపైఁ బ్రేమచేఁ "ఖానూ! ఖానూ!" యని పిలుచుచు నాతని వెన్నంటి తిరుగుచుండెను. షాజిబీబీ మాత్రము ఖానుని చర్యను గనిన వెంటనే యాతని మోమునైనఁజూడ నిచ్చలేనిదై యాతని గుఱించి రాణిగారితో నప్పుడప్పు డేదో చెప్పుచుండెను. కాని చాందబీబీ వాటినన్నిటినిఁ బాటింపకుండెను. ఖానుఁ డెద్దియో యామెకు మందు పెట్టినటుల యామె హృదయమున నిప్పు డొక వింతవికార ముదయించినది. స్త్రీలహృదయములు నిగూఢము లైనవి. పరేంగితజ్ఞులగు మహాపురుషులకుఁ గూడ దురవగాహము లైనవి గదా!

ఇట్లుండ నొకనాఁడు చాందబీబీ తన సభామండపమున నెవ్వరు తనవద్ద లేనితఱి నొక రత్నకంబళముపై నాసీనురాలై

యెవనికొఱకో నిరీక్షించు చుండెను. ఇంతలో నచటకొక యౌవన వంతుఁ డరుదెంచెను. వారిద్దరికి నిట్లు సంభాషణము జరిగెను.

చాంద:—మాలోజీఖాన్‌సులే! నీవు నా నగరునకువచ్చి చాలకాల మైనది. ఏమైన క్రొత్తవిషయము లున్నవా?

మాలోజి:—అమ్మా క్రొత్తవిషయము లున్నవని వేఱుగఁ జెప్ప వలయునా! ఆ దుర్మార్గులొనరించు దుండగములనెల్ల నిటీవలఁ గనుగొంటి. వారు తమ కుట్రలను సందులేక జరిగింపవచ్చునని యరణ్యమున వింతగుహ నొకదానిని నిర్మించినారు. విధివశమున నేఁదానిం జొచ్చితి. వారిచర్యల నన్నిటిని గమనించి చూడఁ దుదకు వారు మీ ప్రాణ ములకే యెసరువెట్ట నెంచియున్నారు. వారందఱు మియర్ మంజూ ముఖ్యసేవకులు.

చాంద:—మాలోజీ! చూచితివా మియర్‌మంజూ యొనరించు దుర్మార్గము! వాఁడిట్లు చాటున గుట్రలఁబన్నుట వలన లాభమేమి? ఎట్టయెదుటఁ గత్తి గట్టి నాతోఁ బోరిన గదా వానిపని తెలియఁగలదు, మఱియు గాలమెట్లుం డునో యని సైన్యమంతను జేర్చి యుద్ధమునకు సిద్ధముగ నున్నాను.

మాలోజి:—అమ్మా! మీరు కడు జాగరూకతతో మెలంగ వల యును. ఏలయన, మొన్నటి దినమున నే నొకఫకీరుని గలసికొంటిని. ఆతని కాయము చాల బలిష్ఠమైనది. నల్లని

గడ్డమును, ఒత్తగు మీసములును, బంగారు చాయలఁదిల కించుచున్న యాతని ముఖమండలమునకు విశేషాలంకార ములై యొప్పుచుండెను. అమ్మా! అతని వర్ణనము మన కేల? అతఁడు ప్రశ్నశాస్త్రమున మిగుల సమర్థుఁడు. ఫకీ లకడ మంత్రతంత్రము లుండును. మరియు నోషధులం దద్భుతశక్తులున్నవి. నిరంతర మరణ్యములందే నివసించు యోగులకడ నీ రెండు మహిమలుండును. వారగుపడినట్లె యుండి క్షణమాత్రమున మాయమగుదురు. మరల నొక స్మికముగఁ సాక్షాత్కరింతురు. నేనాతని నా గృహకృత్య ములలోఁ గొన్ని సంగతుల నడిగి తెలిసికొంటిని. వానికి సమమగు నుత్తరముల నాతఁడు చెప్పెను. అంత నతఁడు మఱికొన్ని వాక్యములఁ నాతోఁ బలికెను. అవేవన "మీ యహమ్మదు నగరము నేలు రాణిగారికిఁ గొన్ని దినము లలో గొప్ప సంకటములు గలుగఁబోవుచున్నవి. నూఁడు పాళ్లు ప్రాణములకే హానిగలుగును. అయిన నామె యదృ ష్టవశమున నొక వేళఁ దప్పునేమో యనెను. అంత నెవరు దానికిఁ గారకుఁడని నే నడిగితిని. అందుల కాతఁడవ్యక్త వాక్యముల "రాణీగారి నగరునందు—పురుషుఁడు— దూరదేశస్థుఁడు — ప్రాణములందును, ప్రజలందును, ప్రధానులందును ప్రేమగల యా రాణి, యా పురుషుఁ డెవఁడైనదిగనుఁగొని వాని ప్రాణములను దీయవలయును. అట్లు కానియెడల నామెకే గొప్ప ముప్పువాటిల్లు" నని

చెప్పెను. కావున నమ్మా! అతఁడెవఁడో మీరే కనుఁగొన వలయును.

చాంద:—ఆయ్యా! ఎవరిపరాక్రమము జగద్విదితమై యున్నదో ఎవరికి చాలమంది సామంతరాజులు పాదాక్రాంతులై కప్పములఁ జెల్లించుచుందురో యట్టి చాందబీబీ కించుకైన భయముగలదా? మఱియు మన నగరియందు నాపైఁ గక్షవహించియున్న పురుషుఁడెచ్చటను నగపడఁడు. ఆ ఫకీరునకుఁ బిచ్చియెత్తినట్లున్నది.

మాలోజీ:—అమ్మా! మన యహమ్మదుఖానుఁడు దూరదేశస్థుడుగదా!

చాంద:—ఛీ: ఛీ! ఆతనిపేరైన నెత్తకుము. పాపము సంభవించును. అతనిపై నాకున్న నమ్మక మింకెవ్వరిపై నుండదు. అతఁడీసంగతిని విన్న నేమనుకొనును?

వీ రిట్లు మాట్లాడుచుండగ నచటికి నబ్దుల్ రహిమానుఁ డరుదెంచి “అమ్మా! మియర్ మంజూచేఁ బంపఁబడిన సేన సిద్దీ సర్దారులతోఁ బోరుటకై వచ్చుచున్నది. ఆజ్ఞయిచ్చిన మనసేనలోఁ గొంతభాగమును వారికి సహాయ మొనర్చుటకుఁ బంపెద” ననెను. అందులకుఁ చాందబీబీ “రహిమానూ! జాఫరు మహమ్మదువెంటఁ గొంతసేన నంపి వారికిఁదోడుగ గులామునుగూడఁ బంపుము. వారి నతిజాగ్రత్తగఁ బోరాడ నియమింపుము. అపజయ మనువార్త మనచెవిని బడఁగూడదని వారి కాజ్ఞాపింపుము. మఱియు నీతోఁ గొన్నివిషయములను మాట్లాడవలయును. నీవు నావెంట ర” మ్మని రహిమానుని వెంటఁబెట్టుకొని చాందబీబీ

దన యంతఃపురమునకు వెళ్లెను. మాలోజియును రాణివద్ద సెలవు పుచ్చుకొని తన వీఁటికిం జనియె.

## పంౘ్రెండవ ప్రకరణము

సూర్యుఁ డొకబార పైకి వచ్చునప్పటికి రహిమానుచేఁ బంపఁబడిన సేన యహమ్మదునగరమున కైదుమైళ్ళ దూరములో నున్న యొక యరణ్యమునఁ బోవఁ జొచ్చెను. కొద్దికాలములోనే యాసైన్యమంతయు నాయరణ్యమును దాటఁగలిగి చదునైన యొక బయలున బోవుట కారంభించెను. ఇట్లు శీఘ్రగమనంబున నడుగు రాణిగారిదండున కొక చారుఁడు మియర్ మంజూచేఁ బంపఁ బడిన సేన హసన్‌మియ్యా సేనతోఁగలసి వచ్చుచున్న దని యెఱింగించెను. కాని వారు మూఁడువేలసైనికులే యని నుడువుటచే నంత స్వల్పసంఖ్యాకులు వేలకొలఁదిగ నున్న తమతోఁ బోరుట కసాధ్యమను నమ్మకంబునను, మఱియు మియర్‌మంజూ సేన యచటకిఁ బదునేనుక్రోసుల దూరంబున నుండుటచే నింతలో మించినది లేదనియు వారొక యనుకూలప్రదేశంబున విడిసి తమ యిచ్చవచ్చినట్లు కాలము గడుపుచుండిరి.

ఇట్లుండఁ గొంతవడికి రెండుమూఁడు తుపాకి ప్రేటులు వారికి వినఁబడెను. అంత నచట నున్నవారందఱా ప్రేటు లేదిక్కుననుండి వినవచ్చుచున్నవో యని పరిశీలించుచుండిరి. మరల రెండు ప్రేటులు వారి కుత్తర పుదిక్కుననుండి వినవచ్చెను.

అంత వారిలో నొకఁడు సమీపముననున్న మహోన్నతవృక్షమును బిరబిరనెక్కి యుత్తరపు దిక్కునఁ జూడ్కి నిగిడించెను. అంత నాలుగునిముషములు వాఁడట్లే చూచి చెట్టుదిగి "వచ్చె వచ్చె మియర్ మంజూ సైన్యము వచ్చె" ననుచుఁ గేకలు వేసెను. రాణి గారియొక్కయు, సిద్దీసర్దారులయొక్కయు సైన్యముల సంభ్రమము వర్ణనాతీతము. సైనికులీయెడ కాయెడకుఁ బర్వెత్తసాగిరి. అందఱును శౌర్యచిహ్నములు వెదజల్లున ట్లైవరిగుఱ్ఱములవారెక్కి కత్తుల ఝళిపించుచుఁ బోరాడ సిద్ధపడి యుండిరి. అట్టియెడ సర్వ సైన్యాధిపత్యమును వహించియున్న జాఫరు మహమ్మదు సేనామధ్యమున నున్నతస్థానమున నిల్చి, సేనానాయకుల నుద్దేశించి యెలుఁగెత్తి మేఘగంభీర భాషణంబుల నిట్లనియె.
"యోధులారా! మన మహారాణిగారి ప్రకటనము మీకందఱకును దెలియునుగదా! అపజయ మనువార్త యామెచెవిని సోక గూడదఁట. విరోధి మనకంటబడకమున్నె మీ రిట్లు సిద్ధపడి యుండుట నాకెంతయు సంతస మగుచున్నది. మఱియు మీరందఱును మీ మీ పరాక్రమములను జూపి కీర్తిపాత్రులగుటకు సమయము దటస్థించినది. మనరాణీగారివంటి ధైర్యశాలియు నెచ్చటను లేదు గదా! వారిని మార్కొన మనకు శక్యమగునని గదా యితర యోధవరులను గూడఁ బంపక కొద్దిపాటి సైన్యముతో మసల నంపెను. మన మిప్పుడు శత్రువులనోడించి గెలుపొందిన మన కీర్తి లోకమున వ్యాపింపఁ గలదు. కాన మీశక్తికొలఁదిఁ బోరాడుఁ" డనెను. యోధు లీవాక్యరత్నములను శిరసావ

హించిరి. అందఱు ధైర్యసూచకముగ౯దమ శంఖముల బూరించిరి.

ఇంతలో మియర్ మంజూ సేన రాణీగారిసేనను సమీపించెను. యుద్ధము ప్రారంభింప౯ బడెను. గులాం వెంటనున్న కాల్బలము మియర్ కాల్బలమును దాకెను. తుపాకులు ప్రయోగింపం బడినవి. హసన్ మియా సైన్యమునకు నాయకు౯డైన దస్తగిరి తన గుఱ్ఱపు దళమును జాఫరును దార౯ బంపెను. జాఫరు తన తురగారూఢులను బురికొల్పి హోరాహోరిగ౯ బోరెను. రెండుపక్షములలో ననేకులు మడిసిరి. గులాం క్రోధారుణిత లోచనుండై మియర్ మంజూ సేనానాయకులలో నొకనిని దనకరవాలమున౯ బుడమికి౯ బలివెట్టి మింటరాలు మంటలం బోలు మెఱుంగులు దొఱుంగ నలుదెసల౯ జెలుచెలు లాడుచుండెను. అంత దస్తగిరి తనశిరమున౯ బడు కత్తివ్రేటుల నెల్ల డాలునం దప్పించుకొనుచు౯ దొల౯గిపోయి గులామును హయంబునుండి క్రిందికిలాగ గమనించెను. జాఫరదిచూచి సింహకిశోరముకైవడి చంగున౯ దస్తగిరిపై౯ బడి గులామును దప్పించెను. వీరిట్లు పోరాడుచున్న సమయమున మియర్ మంజూ కాల్బలమున ననేకులు మడిసిరి. కొందఱు పలాయన మగుచుండిరి. మఱికొందఱు మేన౯ బ్రాణము లున్నంతవఱకు౯ బోరాడ నుంకించుచుండిరి. వీ రెంత౯బ్రయత్నించినను బూర్తిగ నిహతులైరి. అశ్వారోహణంబున బ్రవీణుర దగు జాఫరు గులామును దప్పించిన క్షణముననే దస్తగిరికిని జాఫరునకును ఘోరముగ౯ బోరాటము సంప్రాప్తమయ్యె. అట్లున్నను వారొకగడియ సేపు కాల్పులంబున౯ గాయంబులై నశిత

పోరాడుచుండిరి. ఆసమయమున నొకానొక పురుషుఁడు ముఖము సహిత మగుపడకుండునటుల దేహమున కవచమునుధరించి యొక జవనాశ్వము నెక్కి పీనుగులపైనుండి దాటుకొని వచ్చుచుండెను. అతఁ డతిశీఘ్రమున రణరంగమునఁ బ్రవేశించి దస్తగిరిని జంప నుద్యుక్తుఁడైన జాఫరు ఖడ్గంబును దుత్తునియలుగఁ గొట్టి దస్తగిరినిఁ గాపాడెను.

ఈనూతనపురుషుఁడు ఛాందబీబీవద్దఁ గుట్రలఁ బన్ను ఖానుఁడని మియర్ మంజూ సేనానాయకునికిఁ దెలియును. ఖానుఁడు ధన్యగ్రామమునకుఁ బోవలయునను మిష పెట్టి రాణి వద్ద శెలవుఁగైకొని దస్తగిరిసేనను జేరెను. చదువరులారా! ఇట్టి నీచాభిమానులను నమ్మినవారికి షేఁఉగతులు గలవా? మనపూర్వు లట్టివారిని నమ్మి చేలుపోయినందుననే మనస్వాతంత్ర్యము నష్టపడఁగలిగినది. ఖానునికిని, జాఫరునకును ఘోర ఘోరత మాయెను. వీరిట్లుపోరాడఁగడఁగిన క్షణముననే హసన్ మియ్యా సైన్యమున కధిపతియైన ఖాజీ తనగుఱ్ఱమును గులామును దాకఁ బోనిచ్చెను. అంత గులాము కరవాలము బిగాన నెదిరికంఠంబును దాకఁబోవ దానిండప్పించుటకు ఖాజీ అనేక ప్రయత్నములఁ జేసెను గాని యవన్నియు నిష్ఫలంబులగుటఁ దా నాస్థలములనుండి పాఱి పోయెను. నాయకుఁడు పాఱిపోవునది చూచి సైన్యమును బలా యనమాయెను. దస్తగిరియుఁ జేయునది లేక ఖాజీని గలసికొనెను. ఖానుఁడు తన యథాస్థలమును జేర నెంచి తన గుఱ్ఱమును బిర బిరఁ బోనిచ్చెను. సిద్దీసర్దారు లందఱును దమకుఁ గెలుపు దొరికి

నందులకు మిగుల సంతసించుచు రాణిగారి సైన్యముల వేనోళ్ళఁ గొనియాడిరి. ఈసంగరము ముగియునప్పటికిఁ బ్రొద్దును ముగియుటఁ జేసి రాణిగారిసైన్య మత్యుత్సాహంబున నొకపల్లియం జేరఁబోయి యచట బస దిగి తెల్లవాటి మేల్కాంచి తమజయ వార్తను రాణిగారికిఁ దెల్పి సహమ్మదునగరమునకుఁ మరల బయనంబు సాగించెను.

### పదమూడవ ప్రకరణము

అహమ్మదుఖానుని యదృష్టమేమోకాని, యతఁడు రాణిగారికడఁ జేరినవెనుక హమీద్ ఖానుఁ డతనితోఁ గలిసెను. అహమ్మదుఖానుఁడును దాను జేయఁబోవు కుట్రలనెల్ల నతనితోఁ జెప్పి యతఁడు తనకు సహాయమొనర్చిన సహమ్మదు నగరము మియర్ మంజూకు స్వాధీనమైనవెంటనే యతనికిఁ బ్రధానమంత్రిపదవి నిచ్చుటయేకాక యహమ్మదునగర రాజ్యములోఁ గొంతభాగమిప్పించునట్లుగూడ వాగ్దాన మొసంగెను. హమీదుఖానుఁడును దాను రాణిగారికడ సంతమన్నన బడయుచుండుటచే సహమ్మదుఖానుని మాటల కియ్యకొని యతనితోఁజేరి యాతని కన్నివిధముల సాయమొనర్చుచుండెను.

చాందబీబీ తనయంతఃపురమున సింహాసనాసీనురాలై యుండెను. హుసేనుమీర్జాయును హమీద్ ఖానుఁడును రాణిగారి కెడమప్రక్కనఁ గూర్చుండి యుండిరి. చాందబీబీకిఁ గుడిప్రక్క వేరొకయాసనము వేయఁబడియుండెను. సదా దాని నలంకరించు పురుషుఁ డచ్చుటలేదు. ఇంతలో వేషధారియైన అహమ్మదుఖానుఁ డచ్చటికివచ్చి దానిపైఁ గూర్చుండెను. అతనిని జూడఁగనే

చాందబీబీ పట్టరాని సంతసముతో "అహమ్మదుఖానూ! నీవేమి రెండురోజులనుండియు నిచటికి వచ్చుటలేదు."

ఖానుఁడు:—అమ్మా! నేను మాగ్రామమునకు బోవలయు నని మీవద్ద సెలవుదీసికొని యుండలేదా? ఇంతలో మఱచితిరా?

రాణి:— అవును మఱచితిని. మనవారే యుద్ధమున గెల్చినారఁట వింటివా?

ఖానుఁడు:—మన సేనానాయకు లసమానప్రజ్ఞావంతు లగుట చేతను, జాఫరుమహమ్మదు బుద్ధిచాతుర్యముచేతను మన సేనకు జయమే కలుగును.

రాణి:—నాయనా! ఇప్పుడు నామనస్సు గొంతశాంతి పడినది ఈయోటమిచే మియర్ మంజూ తాఁ జేయు దుర్మార్గమును గొంత తగ్గింపఁగలడు. నీవేమందువు?

ఖానుఁడు:—(మనస్సు క్రోధఘూర్ణితమగుచున్నను) నే నేమన గలను? మియర్ మంజూ ప్రస్తుతముగలిగిన దురవస్థకు మిక్కిలి దుఃఖించుచున్నాఁడట. అతఁ డక్బరు చక్రవర్తి గారి సేనలకై యనుదినము నిరీక్షించుచు మరల నెవ్వరినో యటకుఁ బంపినాఁడట.

రాణి:—అక్బరుచక్రవర్తి సేనలను నే లక్ష్యపెట్టుదానను గాను. అయిన నట్టి గొప్పచక్రవర్తియా యిట్టి నీచాభిమానికి సాయమొనర్చుట! అతఁడు సాయమొనర్పఁ డనియే తలంతును.

అంతఁ జేరువనున్న హుసేనుమీర్జా, "అమ్మా! యిఁక వారమురోజుల లోపలనే యక్బరు సేననంతటిని తనపుత్రుఁడైన మురాదువెంటఁ బంపునట్లు తెలియవచ్చినది. మన మతి జాగరూకతతో నుండవలయు" నని చెప్పెను. అంత ఖానుఁడు (నిజమును వెలిఁబుచ్చక) "ఇందు సత్యాసత్యములు నాకుఁ దెలియవు. అక్బరతనికి సాయమొనర్పఁడనియే తలంతును. అయిన నెవరువచ్చినను మనల నేమిచేయఁగలరు? అమ్మా! మీతో నొకటి చెప్పమఱచితి. నిన్న మీ కొక జాబు వచ్చినది. అది నావద్దనే యున్నదని చెప్పుచు దనవద్దనున్న యొక కాగితమును దీసి యీ క్రిందివిధమునఁ జదివెను,

జున్నరు,

చాందబీబీగారికి,

"నే నహమ్మదు నగరమును వదలినది మొదలు మియర్ మంజూ నేయు దుండగములనెల్లఁ గనుగొనుచు, వానికిఁ బ్రతికూలముగ ననేక కార్యముల నొనర్చుచుఁ బ్రస్తుతము కొద్దిపాటి సేవకులతో మన పూర్వపురాజధానియైన జున్నరు గ్రామమువద్ద నున్నాను. మీ రిదివఱలో నాకుఁ జెప్పినటుల మీరీగ్రామమున కిప్పుడు విచ్చేయవలయును. మన రహస్యము లితరులకుం దెలియఁ గూడదు. కాన మీ కాంతర్య మిత్రులలో నొకరిని మాత్రము దీసికొని రావలయును. మీరు వచ్చినప్పటికి నే నన్ని కార్యములను సమకూర్పఁగలను. మీ రాకకై ప్రతినిమేషము నెదురుచూచుచున్నాను,

ఇట్లు మీ ప్రధానమంత్రి,
మాలికాంబరు."

ఈ విషయమంతయు వినుచుండిన హుసేను మీర్జాకు దిక్కుదోపలేదు. మాలికాంబరు వేఱొక కార్యమొనర్పుటకుఁ బోయియుండుటచే నా జాబాతనిచే వ్రాయఁబడినది కాదనియతఁడు దృఢముగ నమ్మెను. రాణిగారికేదో ముప్పుగలిగింపనెంచి యహమ్మదుఖానే స్వయముగ నా జాబును వ్రాసియుండునని యాతఁ డూహించెను. అది యొక కల్పితలేఖ యని రాణిగారి కాతఁ డెఱిగింపసాహసించెను గాని, తుదకామె కేమి కోపము వచ్చునోయని యూరకుండెను. అంతఁ గొంతవడికి చాందబీబీ, "ఖానూ! యిది వఱలో నేను జున్నరుకుఁ బోవలయునని మాలిక్‌తో ముచ్చటించి యుంటిని కాని, యింత త్వరలో నన్నాతఁ డచ్చటికి రమ్మనిన కారణ మిందు వ్రాయలేదు. నే నేల యచటికిఁ బోవలయు" నని చెప్పెను. అందులకు ఖానుఁడు "అమ్మా! ఏదో విపరీతమైన కార్యమందుఁ దటస్థించి యుండవచ్చును. నీవు శూరవనితవనియు, గార్యనిర్వహణచాతుర్యమునం దద్భుతశక్తి గలదానవనియు నెంచి యాతఁడట్లు వ్రాసియుండును. మఱియు మిమ్ముల నొంటరిగ రమ్మని వ్రాసియుండుటచే గొన్ని రహస్యాలోచనల నొనర్పవలసి యుండును. కాబట్టి మీరు బయలుదేరియే తీరవలయు" ననెను. అంతఁ చాందబీబీ హుసేనువంకఁ జూచి "హుసేనూ! నీ యభిప్రాయమే" మని యడిగెను. అందుల కాతఁడు "అమ్మా! మాలికాంబ రిప్పటివఱకును తానేది తమతోఁ జెప్పదలఁచు కొన్నను మీ యంతఃపురమున కరుదెంచి మనవిచేసుకొను చుండెడివాఁడు. అట్టివాఁడు మీ కేల నేఁడిట్టి యుత్తరమును వ్రాయును? మఱియు నాతఁ డిప్పుడు జున్నరుగ్రామమున లేఁడను

సంగతి నాకు దృఢముగఁ దెలియవచ్చెను. దీనిని జూడ నిది యొక కల్పిత లేఖవలె గన్పట్టుచున్న" దనెను. అంత నహామ్మద్ ఖానుఁడు మిక్కిలి కోపముతో "ఓరీ ! రాజద్రోహీ ! ఇది యొక కల్పిత లేఖ యని చెప్పెదవా ? నీ కేమి కన్నులు లేవా ? ఇవెవ్వరి యక్షరములో యించుక వచింపు" మని చెప్పుచు నా జాబును హుసేను మీర్జా కొసంగఁబోయెను. దానిని జేరువనున్న హమీదు ఖానుఁ డందుకొని ఖానుని మాట నిర్ధారణ సేయఁగోరి "అమ్మా ! యీ దస్తూరి మాలికాంబరునిదే ! దానికి సంశయములేదు. మన ఖానుఁడు సెప్పినట్లు మీరు రేపే బయలుదేరి పోవలయును. మీ రిందుకుఁ దప్పవద్దనెను. పిమ్మటఁ చాందబీబీ "హుసేనూ ! మీలో మీరేల యిట్లు జగడమాడెదరు ? ఈ జాబు మాలికాంబరు చేతనే వ్రాయఁబడినది. మఱియొకని కిట్లు వ్రాయుటకు గుండియ లున్నవా ?" యనెను. పిమ్మట హుసేను "అమ్మా ! సత్యాసత్యములు పర్యవసానమునఁ దెలియఁగల" వని చెప్పుచు మాఱు మాటాడక తన తావునుండి లేచిపోయెను. అంత నహామ్మద్ ఖానుఁడు రాణివద్ద సెలవుగైకొని తాఁజేయఁదలఁచుకొనిన కార్యముల నెఱవేర్చుటకుఁ దన నివాసంబున కఱిగెను.

### పదునాల్గవ ప్రకరణము

శుక్లపక్షాష్టమి చంద్రికల రమణీయకాంతు లహామ్మదు నగర ప్రాంతమున మున్న పచ్చిక బయళ్ల కొక వింతల్లావణ్యము నొసఁగుచుండెను. పూర్ణేందు చంద్రికలఁ గడుపారమెక్కి సంతుష్టి

నొందు చకోరదంపతు లానాఁడు సగముకడుపునకైన మేఁత దొరకనందున చిన్నఁబోయి యా పచ్చిక బయళ్ళలో నిటునటు నెగురుచుండినవి. అది వసంతకాలమగుటచేఁ బల్లవాంకురములతో బ్రసూనములతోఁ జేరువనున్న వనములు పొంకములై యుండెను. అందుండి మందమలయానిలుండు చల్లఁగ నాబయళ్ల లోనికి దిగుచుండెను. వనములలోఁ గోయిలలు కంఠమెత్తి పంచమస్వరమున రాగమాలాపన సేయుచుండెను.

అట్టి సమయమున నిద్దఱుబాటసారు లాపచ్చిక బయళ్లలోఁ బోవఁ జొచ్చిరి. వారు మీ కిదివఱలోఁ బరిచితులే. వారిలో నొకఁడు మాత్రము ముందున్న వేషమున నిప్పుడు లేఁడు. వా రెద్దియో యాలోచించుచుఁ బోవుచున్న ట్లా వెన్నెలకాంతి వలనఁ దెలియవచ్చుచుండెను. వారిలో నొకని చేతియందొక చిన్నమూట మాత్రము గాన్పించుచుండెను. మూటను జేతఁబట్టు కొనియున్న పురుషుఁడీ క్రింది విధమునఁ దన సహచరునితో మాట్లాడెను. "మాలికాంబరూ! నీవు ఫకీరు వేషమును ధరించిన వెనుక నేను నిన్నుఁ గలిసికొనుట కిది రెండవతూరి. ప్రథమమున నీవు నాతో మాట్లాడ వచ్చినప్పుడు రాణిగారిచర్య నంతయు నీకు దెల్పితిని. ఇప్పుడు మన మంత్రిపదవియు నష్టేటఁ గలసి పోవనున్నది.

మాలికాంబరు:—హుసేనూ! ఆ దుర్మార్గుఁడగు ఖానుఁడు మన రాణి గారికడఁ జేరి యామెను వలలో వేసుకొనిన సంగతి నాకుఁ దెలియవచ్చినది. ఆ చండాలుఁడు దన గ్రామము

నకుఁ బోవలయునని మిషపెట్టి మియర్‌మంజూ సేనకు సాయమొనర్చిన సంగతియుఁ దెలిసికొంటిని. వాని నెట్లైన మదీయకృపాణమున కెఱగావింప నెంచి యున్నాను. గాని సమయము దొరకకున్నది.

హుసేను:—తొలుదొల్తనే రాణిగారి కీసంగతిఁ దెలియఁజేసితిని. గాని యామె కాతనిపైఁగల ప్రేమచే నన్ను దృణీకరించి నా ముఖముఁగూడఁజూడ నొల్లకున్నది.

మాలికాంబరు:—అక్కారణమును బట్టియే నే నావిషయము నామె యెదుటఁ బ్రస్తావింపక మాలోజికి బ్రశ్న మూలముగ నెఱిఁగించితిని. అతఁ డామెకుఁ దెలియజేసెనో లేదో?

హుసేను:—మన మెన్నియనుకొనిన నేమిలాభము? ధర్మమెప్పటికిని జయించియే తీరును. రాణికి మనయం దభిమాన మున్నను, లేకున్నను మన మామెకుఁ గలుగఁబోవు కష్టములనన్నిటినిఁ దప్పింపవలయును. నాకాకలిమిక్కుట మగుచున్నది. కాన బిరబిరఁ బోయి చేరువనున్న కోనేటి యొద్ద నీ మూటయందుఁగల పెరుగన్నమును తిందము.

వీరిట్లు సంభాషించుకొనుచు నచటికిఁ జేరువగనున్నయొక కోనేటివద్ద కేఁగిరి. ఈ కొలను చాల విశాలమై మిక్కిలిలోతుగ నుండెను. దీనిచుట్టు చినచిన్న గుట్టలు పెరిగియుండెను. వాని వెనుకఁ బొడవైనట్టియు, నెత్తైనట్టియు నొకపర్వతపంక్తికలదు. పర్వతములమీఁదనేకాక క్రిందను జెట్లు దట్టముగఁ బెఱిఁగి యుండుటచే నదియొక యరణ్యప్రదేశ మని తెలియవచ్చు

చుండెను. ఆప్రదేశమునం దెన్ని ఘోరకృత్యములు జరిగినను కనుఁగొనుట యతిదుర్లభము.

మన బాటసారులు గొలను జేరిన తక్షణమె తమచెంతనున్న పెరుగన్నపుమూఁటను విప్పి రెండుమూఁడు కబళముల నోటఁ బెట్టిరో లేదో వెంటనే వారికిఁ గొన్ని మనుష్యవాక్యములు విన వచ్చెను. అట్టి నిర్మానుష్యప్రదేశమున మనుష్యవాక్యములు విన వచ్చుటకుఁ గతంబెయ్యదియని చింతించి యావింతఁ బరిశీలింప నాబాటసారులు దమచెంతనున్న యొక్కగుట్టవద్దకుఁ మెల్లగఁ జేరఁబోయి వినుచుండిరి. ప్రకృతి నిశ్శబ్దముగ నుండుటచే నావాక్యములు వారికి బాగుగ వినవచ్చెను. కంఠస్వరములు వేఱ్వేఱుగా నుండుటంబట్టి యచ్చోనైదాఱుగురు పురుషు లున్నట్లు వారికిఁ దెలియవచ్చెను. ఆమాటాడువారిలో—

ఒకఁడు:—మీకత్తులను బాగుగఁ బదను బెట్టినారా?

మఱియొకఁడు:—కత్తులను బదునుబెట్టి గంటైనది. వారేమింకను రాలేదు?

వేఱొకఁడు:—అవును. చాల నాలస్యమైనది. త్వరలోనే వత్తురు. మీరు కడుజాగ్రత్తగ నుండవలయును. ఒక్కవ్రేటునకే వారితలలు దెగి క్రిందఁబడవలయును. ఇత్తరుణమున నైన మీరు మిక్కిలి శ్రద్ధవహింపవలయును. లేనిచో మనరాజుగారికిఁ గోపమువచ్చును.

ఇంకొకఁడు:—ఏమబ్బా! బండిధ్వనిగూడ వినఁబడలేదు. నేఁటిరాత్రికి వారువత్తురో! రారో! అయిన నేదైన బండి వచ్చుచున్నదేమో చూతము.

వా రట్లు సంభాషించుకొనుచు లేచి వారికి సమీపమునసే యున్న బండిబాటవద్దకు మెల్లగఁ జేరఁబోయిరి. గుట్టచాటున నుండిన బాటసారు లామాటలను వినినతోడనే భయభ్రాంతులైరి. ఇంకను వెన్నెలయుండుటచే వారు తడవుకొనక వెంటనే కొలను జేరి వారు దెచ్చిన యన్నమును నీటఁగల్పి మరల గుట్టనెక్కి సమీపమున నున్న యొక మహీరుహము నధిరోహించి యందుండు గుబురుకొమ్మలలోఁ దాగియుండిరి. పిదపఁ గొంతవడికి రేరాజపరసముద్రమునఁ బ్రవేశించుటచే గాఢాంధకారము నిరాఘాటముగ జగమంతయు నాక్రమించుకొనెను.

వృక్షముపైనెక్కిన బాటసారులలో నొకఁడు "అయ్యో! నేఁ డెవరి ప్రాణములు బోవనున్నవో! వారు 'బండి' యని నుడివిరి. బండి యేయూరునుండి వచ్చును? బండిలో వచ్చువారిని వీరు వధింప నెంచియున్నారు కాఁబోలు" ననెను. అందులకు మఱియొకఁడు "ఎవరయిన మనకేమి! యీదుర్మార్గులను దెగటార్ప నేఁడు సమయము దటస్థించినది. మనమతి జాగరూకతతో నుండవలయు" నని చెప్పెను.

బండికొఱకు నిరీక్షించుచున్న దుండగీంద్రులు బాటవద్ద కేఁగిన యరగంట కాలమునకు వారికొక దీపపుఁగాంతి చాల దూరమునుండి గోచరమాయెను. అంతఁ గొంతవడి కాకాంతి సమీపించుటంబట్టి యావెల్తురు బండికిఁ దగిలించిన దీపపు వెలుఁతురని తలంచి వారటుండక తా మిదివఱలో నిర్ణయించు కొన్న స్థలమున కేఁగిరి. దైవవశముగ నాస్థలముగూడ మన

బాటసారు లెక్కిన చెట్టువద్దనే యగుటచే బాటసారులకుఁగూడ 'రొట్టె విరిగి నేతిలోఁబడిన ' ట్లాయెను. అంత నామనుజులు "బండి వచ్చులోపల మించినదిలే" దని యాచెట్టుక్రిందఁగూర్చుండిరి. రస్తా మీఁది బండి వడివడిగ వచ్చుచుండెను. ఒకస్త్రీరత్నము, యొక బాలుఁడు, మఱియొక కాయపుష్టిగల మనుజుఁ డాబండిలో నుండిరి. అదేమిచిత్రమో గాని వారాశకటము నధిరోహించినది మొదలు దానిలోనున్న స్త్రీరత్నముమాత్ర మెద్దియో యాలోచించుచుండెను. బండి వడివడిగఁ బోవుకొలఁది నామె యాలోచనయు వడివడిగఁ బోవుచుండెను. కొంతవడి కాశకటము రస్తావదలి యొక యరణ్యమునఁ బోవుచుండుటచే బండిలోని యువతి సారధివంకఁ జూచి "ఎవరురా! నీవు! బండి నరణ్యమునఁ బోనిచ్చుచున్నావు! తప్పత్రాగి వచ్చినావా యేమి? (మఱియొకనివంకఁజూచి) ఖానూ! ఇది యరణ్యమని నీకుఁ దెలియదా? దారి తప్పి యేల చెడుదారిని బోనియ్యవలయును? మీరెద్దియో కుత్రను బన్ని నట్లున్నది. లేనిచో మీరు చక్కనిబాటను వదలి యీయరణ్యమునఁ బండినిబోనిచ్చుటకుఁ గారణమేమి?" అని ఘనశల్లునఁ బలికెను. "లేదమ్మా! మనము చేరవలసిన స్థలమును ద్వరలోఁ జేరుట కిట్లు చేసితి" నని ఖానుఁడు చెప్పెను.

ఇట్లుండ గొంతసేపటి కాబండి యాయరణ్యములో నిరువది లేక ముప్పది చదరపుగజములుగల నొకచదును ప్రదేశమున నిల్చిపోయెను. అంత బండిలోనుండి ఖానుఁడు దిగి క్రూర వీక్షణముల బాలుని, చాందబీబీని గ్రిందికి దిగునట్లు బలవంతపెట్టి

వారట్లొనర్చిరి. వెంటనే నల్లని యాకాశముగల పురుషు లాఱుగురు పుట్టగోచులం బెట్టుకొని యాయుధపాణులై చాందబీబీని, బాలుని జుట్టుకొనిరి. చాందబీబీ వారిరూక్షణ వీక్షణములనుఁ జూడఁగనే మాఱుమాటాడలేకపోయెను. శోకభయతరంగము లొక్కసారిగ నామెను ముంచివైచెను. ఆఘాతపాతములచే నామె సర్వాంగము లను గ్రమానువడి పోయెను. ప్రాణము కలతఁజెందెను. అట్లున్నను నామె ధైర్యమవలంబించి "ఓరీ! దుర్మార్గులారా! మీరా! నాముద్దుబాలుని, నన్నుఁ జంపువారలు, ఇదిగో నాశక్తి నించుక చూడుఁ" డనుచు నాడుసింగంబురీతి వారిపై కుఱికెను. ఇంతలో ఖానుఁడు వారి తలలఁ దెగవేయ దనశిష్యుల కాజ్ఞయిచ్చెను. ఇట్లాజ్ఞాపింపఁబడిన శిష్యులలో నిద్దఱు చాందబీబీని బట్టుకొని తల నఱుక సిద్ధపడిరి. వెంటనే చెట్టుపైనున్న మాలికాంబరును, హూసేనుమీర్జాయును గుభాలున క్రిందికి దుమికి రాణిని జంప సుద్యుక్తులైయున్న యిద్దఱి మనుజులను భూమికి బలివెట్టిరి. వారు నేలఁగూలిన క్షణముననే మిగతవారిలో నిద్దఱు పలాయన మైరి. ఇంతలో ఖానుఁడును సారధియు మిగిలినయిద్దఱు మనుజు లును గలిసి ఖడ్గములఁ ద్రిప్పుచుఁ జాందబీబీ, మాలికాంబరు, హూసేనులపైఁబడిరి. వీరట్లు పోరాడుచుండ నొక యువకుఁడు ధవళాశ్వమునెక్కి మెఱపు మెఱసిన రీతి తటాలున నాబాలుని వద్దకుఁ దన హయమును బరుగెత్తించి వానిని దన గుఱ్ఱపు వీపుపైఁ బడవేసికొని మరల నొక మెఱుపు మెఱసినట్లు పలాయనమాయెను. ఇదంతయు రెండు మూఁడు నిముషములలో

జరిగిపోయెను. కావున నితరులతోఁ బోరుచున్న చాందబీబీగాని, మాలిక్‌హూసేనులు గాని యేమియుఁ జేయలేక పోయిరి. చాంద బీబీకి కోపానలంబు దహించుటచే నామె తోఁకద్రొక్కిన నాగు పాముకైవడి ఖానునిపై చెంగున దుమికి వాని హస్తమున నుండు కుఠారమును దీసికొని తలఁదెగవేయఁ బ్రయత్నించెను. ఆతఁ డావ్రేటును దప్పించుకొని పోగా వానికి సహాయులుగ నున్న వారిలో నొకనిని యామె చంపెను. అంత సారథియు, ఖానుఁ డును జెగి యొక కృపాణము నెత్తికొని హూసేను, మాలికులపైఁ బడిరి. మహాయోధవరులతోఁ బోరి గెలుపొంది బిరుదులను వహించిన మాలికాంబరుకు సారథి యొకలెక్కయా! మాలి కాంబరుపై సారథి కత్తివ్రేటు వేయఁబ్రయత్నించ నా క్షణమునకే సారథి శిరమే తెగి ఖానుల పాదములపైఁ బడెను. ఖానుఁ డది చూచి భయభ్రాంతుఁడై పాఱిపోఁ బ్రయత్నించెను. గాని మాలి కాంబరు వానిని బట్టుకొని తల నఱుక సిద్ధపడి 'అమ్మా! నే నీ నీచాత్ముని మా యిష్టదైవమగు భవానికి బలియొసఁగుచున్నాను. చూడు' మని తన కత్తినెత్తెను. వెంటనే ఖానుఁడు "అయ్యా! నా దొక మనవి. నే నిదివఱలోఁ దెలియకచేసిన మోసకృత్యము లను బాటింపక నాకుఁ బ్రాణదానముజేయుఁడు. నే నేదేని యొక దేశమునకుఁబోయి కాలముఁ గడిపెద" నని చెప్పెను. అందు లకుఁ చాందబీబీ "ఈ నీచాత్ముఁడు తన ప్రాణములపై మిక్కిలి యాశగొనియున్నాఁడు. కావున వీని ప్రాణములను దీయవలదు. అయినను మనము వీని విడిచిపెట్టితిమేని మరల మియర్

మంజూతోఁజేరి తన కార్యములను సందులేక జరిగించును. గాన వీనిని మన నగరులో నుత్తరపు మూలనుండు చెఱసాలలోఁబెట్టుఁడని చెప్ప హుసేను ఖానుని బండికిఁ గట్టియున్న త్రాళ్ళతో బంధించి ఖైదీగఁ బట్టుకొనెను. చాందబీబీయు బహువిధముగ మిగుల దుఃఖించుచు మాలికాంబరుతోను, హుసేను మీర్జాతోను నహమ్మదునగరమునకుఁ బోయెను.

## పదునైదవ ప్రకరణము

గత ప్రకరణమునఁ జెప్పఁబడిన రాజద్రోహులు చెల్లాచెదరై పాఱిపోవునప్పటికి రాత్రి మూఁడుగంటలాయెను. పిదప నొక గంట కాలమునకు వీరంద ఱహమ్మదునగరమునకు దక్షిణముననున్న యొక రస్తాలోఁ గలసికొనిరి. ఈ రస్తా నేరుగ బీజపురమునకుఁ బోవును. బీజపురమునకుఁ బోవుమార్గ మతిదుర్ఘటమైనదనియే చెప్పవచ్చును. ఏలనన; నీ బాట కిరుపార్శ్వములందును దట్టమైన యరణ్యము చాలదూరమువఱకు వ్యాపించియుండుటచే నెచటఁ జూచినను భీకరారణ్యమృగసందోహముతే కానవచ్చుచుండును.

ఇట్టి ప్రదేశంబున నా దుష్టు లొకమహోన్నత వృక్షము క్రిందఁ గూర్చుండి యేదో మాటలాడుకొనుచుండ వారిలో నొకఁడు "మన మే రీతిగ మన రాజుగారిని దర్శింపగలము ? ఏ కార్యము జేయఁదలఁచుకొన్నను మనకు విఘ్నములే కలుగు

చున్నవి. ఇదివఱకే మనలఁ బొలియింప సమకట్టిన మియర్ షంజూగారు నేఁడు మనల నూరక విడిచిపెట్టునా?" యని చెప్పెను. అందులకు మఱియొకఁడు బహదరును జెఱపెట్టినందున నాతని మనస్సు కొంత శాంతింపఁగలదు. దానికై మీరు వగవఁ బనిలేదని చెప్పెను.

అంతఁ గొంతవడికి బాగుగఁ దెల్లవాఱుటచే వారావృక్షము క్రిందనుండి లేచి రస్తామీఁదికి వచ్చిరి. వెంటనే వారికి గుఱ్ఱపు డెక్కల సవ్వడి వినవచ్చుటచే దానిం బరీక్షింప వారంద అందే నిరీక్షించుచు బాటకు దక్షిణపుదిక్కున జూడ్కి నిగిడించి యొక మనుజుఁడశ్వారూఢుఁడై వచ్చుటనుగాంచిరి. అతఁడిరువదిసంవత్స రములప్రాయముగలవాఁడై నిండుజవ్వనమున విరాజిల్లుచుండెను. వాని రూపరేఖలు రాజయోగ్యములై యుండెను. విలువగల రత్నన ములుదాపిన బంగారు పిడిగల ఖడ్గ మొకటి జందెమువలె ధరించిన బంగారు పట్టనుండి వ్రేలాడుచుండెను. అతఁ డధిరో హించియుండు గుఱ్ఱమును మిక్కిలి యందముగలదై పంచ కళ్యాణి యను నామమును సార్థక పఱచుచుండెను.

ఆ యశ్వము పైనిజెప్పఁబడిన దుష్టులను సమీపించెను. వారంద ఱొక్కపెట్టునలేచి గుఱ్ఱమును సమీపించి దానిని నిలుపఁ బ్రయత్నించిరి. కాని యది మిక్కిలి తెలివిగల దగుటచే వారిని నిరాకరించి కడువడిగ బరుగిడ మొదలుపెట్టెను. దాని నధిరో హించియున్న యువకుఁడును రాత్రి రెండు యామముల కడనే లేచి యదిమొదలు విరామములేక దీర్ఘసంచారము జేయుచుండిన

వాఁడు గావునఁ దన శరీర మలసియున్నను గొంత తెంపును వహించి తన యశ్వమును మఱింత వడిగ బ్రోనిచ్చుట కారంభించెను. అట్లున్నను ఆ దుష్టులు గుఱ్ఱమును వెంబడించియే వచ్చుచుండిరి. ఈ తరుణమున మఱికొందఱు దుర్మార్గు లాయుధపాణులై వారిని గలిసికొనిరి. వీరిప్పుడు లెక్కకుఁ దొమ్మిది మంది యగుటచే వారికుత్సాహ మధికమగుడు బదినిముషములములోనే వా రా గుఱ్ఱమును గలసికొని, చుట్టును మూఁగి దాని నడకను దగ్గించిరి. పాపమా హయంబును రాత్రియంతయుఁ బ్రయాణము చేయుటచేఁ గలిగిన బడలికచే నొక్కయడుగైనను ముందు బెట్టక నిల్చిపోయెను.

ఇవ్విధముగ నా దుష్ట నవగ్రహకూటము దన్ను జుట్టుకొనగానే యా యువకుఁడు క్రోధఘూర్ణితుఁ డగుచు తన చెంతనున్న కరవాలమును దీసికొని యిద్దఱిని జంపెను. మిగత వారిలో నిద్దఱు తమ ఖడ్గంబులచే హయంబును మిగుల నొవ్వజేయఁగా నది క్రిందఁబడియె. అంతఁ నా తరుణుఁ డుగ్రుఁడై యా దుష్టుల కత్తివ్రేటులనెల్లఁ దప్పించుకొనుచు వారితోఁ బోరుచుండెను.గాని వారిలో నొకఁ డాతని చేతినుండి ఖడ్గమును లాగికొనెను. అంత నతఁడు నేయునది లేక నిశ్చేష్టితుడై నిలువఁబడెను. ఎవఁడు గాని బీజపూరుసకుఁ బోవుమార్గమునఁ బ్రయాణమైవచ్చుచుండిన నట్టివానిని దక్షణమే పట్టుకొని రావలసినదని యా దుష్టు లాజ్ఞాపింపఁబడియున్నందున నిప్పు డీతనిఁబట్టి బంధించిరి. ఇద్దఱు క్రూరు లా గుఱ్ఱమును బట్టుకొనిరి. మిగతవారంద ఱాయువకుని జుట్టుముట్టి నడిపించుచుండిరి. ఆహా ! భగవంతునిమాయ

యెట్టిదని చెప్పవచ్చును. అహమ్మదునగరమునకుఁబోయి తన ప్రియురాలిని దర్శించి వివాహమాడవలయునని యువ్విళ్ళూరుచు బీజపూరునుండి వచ్చుచున్న మహమ్మదుముస్తుఫాగతి యేమైనదో చూడుఁడు !

ఇప్పటికి దాదాపుగఁ బగలు పండ్రెండు గంటలు కావచ్చు చుండుటచే నెండకన్నెఱుఁగని మహమ్మదు ముస్తుఫా దుష్టులచేఁ బడి కాలినడకవలనను, నెండతాపమువలనను గలిగిన బడలికచే నప్పుడప్పుడు స్మృతిదప్పుచుండెను. స్మృతిదప్పినప్పుడెల్ల నాతనిఁ జేతులలో మోసికొని పోవుచుఁ గొంతసేపటి కా దుష్టులు శివనేరి దుర్గమును సమీపించిరి. పిదప మహమ్మదు ముస్తుఫా మియర్ మంజూ యొద్దకుఁ దీసికొని పోఁబడెను.

మియర్ మంజూ సింహాసనాసీనుఁడై యుండెను. ప్రక్కన హసన్ మియ్యా నిలువఁబడియుండెను. ఆతనిచెంత నొక బాలుఁడు బెబ్బులిచేఁ జుట్టఁబడిన లేడిచందమున నిశ్చేష్టితుఁడును దీనవదనుఁడునై యుండెను. అంత మియర్ మంజూ క్రొత్తగా వచ్చిన సేవకులవంకఁజూచి "భటులారా ! మీ రా స్త్రీని జంపి తిరా ? ఖానుఁడెక్కడ" యని యడిగెను. అందులకు భటులలో నొకఁడు "స్వామీ ! మే మందఱమును మా శక్తికొలఁది పోరాడు చుండ నెవరో యిద్దఱు శూరులు చాందబీబీకి సహాయమొనర్చుట కరుదెంచి మాలో నిద్దఱిని జంపి ఖానునితో బోరాడుచుండిరి. అంతఁ చాందబీబీ మూర్ఛఁబడెను. మే మామెతోఁ బోరాడు చుండఁగ ఖానుఁడా వచ్చినవారికి లోఁబడెను. అంతట మేము భయపడి పరుగెత్తి త్రోవలో నీతనిఁ బట్టుకొని మీవద్దకువచ్చితి" మని చెప్పెను.

అంత హసన్ మియ్యా "మిత్రమా! ఖానునివద్ద జీత్తు లకుఁ దగిన ధైర్యములేదు. యజమానుఁడే లోఁబడినప్పుడు సేవకు లేమిచేయఁగలరు? చాందబీబీ మంత్రులు ఖానునితోఁ జోరునపు డతఁడు చాల భయపడియుండినట్లు నేఁగనుఁగొంటిని. అప్పుడేగదా నాహాయమును ఱివ్వనఁ బోనిచ్చి బహదరును జెఱ గొనివచ్చితి. అయినను వీరిప్పుడు ముస్తుఫాను బట్టుకొని వచ్చి నందులకుఁ జాల సంతోషించుచున్నా" ననెను. అంత మియర్ మంజూ ముస్తుఫా వంకఁజూచి "ఓరీ! నీచుఁడా! ఎంతకాలము నకు నీవు మా చేతులలోఁ బడితివి! షాజిబీబీకి నీకు నిప్పుడే వివాహము గాఁగలదు. కొంచె మోర్చుకొనియుండు" మని పరి హాసముగను గోపముగను బలికెను. ఎంత శూరుఁడైనను ముస్తుఫా యేమి చేయఁగలడు? అతఁడేమియుఁ బలుకక నిలు చుండెను. అంత మియర్ మంజూ: "ఓరీ! నీవు నిక్కముగ షాజిబీబీని వివాహమాడఁ దలఁచియేయుండిన నీ వా యాశను ముమ్మాటికిని మానుకొనవలయును. లేనిచో నిన్నిప్పుడే నాకుతా రమున కెరగావింతు" నని చెప్పెను. ఈ మాటలను విన్నతోడనే ముస్తుఫాకుఁ బ్రాణములు గలఁతజెందెను. ఏమి చెప్పుటకును దోఁచలేదు. మరల స్మృతి తప్పిపోవుట కారంభించెను. స్మృతి తప్పిపోయెను. కొంత శీతోదకము వానిమోముతమ్మిపైఁ జల్లఁ బడెను.

పిదప నతనికి గొంతస్మృతి గలుగుటచే మియర్ మంజూ వానివంకఁజూచి "ఓరీ! ఏమి చెప్పెదవు? షాజిబీబీని వివాహ మాడనని ఖురానును నెత్తిపైఁ బెట్టుకొని ప్రమాణము జేసెదవా?

లేక ప్రాణములను వదలెదవా!" యని యడిగెను. అందులకు ముస్తుఫా "దుర్మతీ! నా ప్రాణములనైన గోలుపోవుటకు సిద్ధముగ నున్నాను. గాని, యా త్రిలోకమోహిని యగు షాజిని వివాహమాడక మాన" ననెను. పిమ్మట మియర్ తన సేవకులను బిలిచి ముస్తుఫాయొక్క తల నఱుకవలసిన ట్లాజ్ఞాపించెను. అంత నా సేవకులు ముస్తుఫాను దీసుకొనిపోవుచుండిరి. వెంటనే హసన్ మియ్యా వారి నాటంకపఱచి మియర్ మంజూతో "మిత్రమా! యిపుడుగాకపోయిన నింకఁ గొంతకాలమునకైన నితఁడు షాజిబీబీని వివాహ మాడవలయునను తలంపు విడిచిపెట్టఁగలఁడు. కాఁబట్టి పదునైదురోజు లీతనికి గడువొసంగెదము, ఈ లోపల నా దుర్మార్గుఁడా తలంపును మానఁడేని యంతట వానిని బొలియింత" మని చెప్పెను. మియర్ మంజూ దాని కియ్యకొనెను. వెంటనే ముస్తుఫాచెఱసాలకుఁ గొంపోఁబడెను. ముస్తుఫా నుంచెడు చెఱసాలకుఁ బ్రక్కగనే వేఱొక గదిలో బహదరునుగూడ చెఱబెట్టవలసినట్లు మియర్ మంజూ ఆజ్ఞాపించెను. పిమ్మట నతఁడొక కాగితమునుదీసి తనచెంతనున్న సేవకులలో నొకనిచేతి కొసఁగి వానితో మఱికొన్ని మాటలనుజెప్పి తన యంతఃపురమునకు వెడలిపోయెను.

## పదునాఱవ ప్రకరణము

చాందబీబీ బహదరుపోకకు విలపించుచుండెను. ఆమె కేమియుఁ దోఁచుటలేదు. షాజిబీబీమాత్ర మనేకపర్యాయము

లామె నూరార్చుచుండెను. కాని యామె దుఃఖము తగ్గినదికాదు. కాని యాలస్య మొనర్పక జాగరూకతఁ గలిగి చేయవలసిన కార్యములు మిక్కుటముగ నున్నవని యామెకుఁ దెలియును. అందుచే చాందబీబీ బహదరును గారాగృహమునుండి విడిపించుకొనివచ్చుటయు, నహమ్మదునగరమును గాపాడి, యాతని వశమొసర్చుటయు, షాకిబీబీ నిచ్చి ముస్తుఫాకు వివాహమొనర్చుటయు నను నీ కార్యములను నెఱవేర్చుటకుఁ గంకణము గట్టెను. అందుచే నామె భోజన సమయమునందుఁ దప్పఁ దక్కిన సమయములలో నెల్లప్పుడు నాలోచనామందిరమునందే యుండెను. ఆమె మంత్రులును నామెను వదలక సదా యామె యాజ్ఞ శిరసావహించి నడుచుకొనుచుండిరి. హమీదుఖానుఁడుమాత్ర మహమ్మదుఖానుని దురవస్థకుఁ జింతిల్లుచు నాతనిఁ జెఱనుండి విడిపించుటకుఁ బన్నుగడలఁ బన్నుచుఁ దన యభిప్రాయములను వెలిబుచ్చుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు చాందబీబీ తన ప్రధానమంత్రులతో నేదియో మాట్లాడుచుండ హుసేనుమీర్జా "అమ్మా! నే నెన్నివిధములఁ జెప్పినను మీరు నా మాటలను బాటింపక యా దుష్టునకుఁ జోటిచ్చి యింత యాపదను మీ యంతట మీరే తలపైఁ దెచ్చి పెట్టుకొంటిరి. లేనిచో నా దుర్మార్గుఁడగు మియర్మంజూ పని నేఁటికిఁ దెలిసియే యుండు" ననెను. అందులకుఁ జాందబీబీ "హుసేనూ! ఏ కాలమున కేది కాఁగలదో దానిం దప్పింప బ్రహ్మకైన వశముగాదు. మఱియు నా దుర్మార్గుఁడు లేడిచర్మమును గప్పుకొన్న వ్యాఘ్రమని నాకుఁ దెలియదు. మీరిద్దఱాసమయమున నన్ను రక్షింపనిచో నాగతి యేమిఁ కావలసియుండును?

మాలోజీమాటను సహితము దృఢీకరించితిని. ఆ ఫకీ రెట్టి మహానుభావుఁడో! అతని మాటలనుగూడఁ దృఢీకరించితి ననెను, అంత హునేను "అమ్మా! చెడ్డకాలము సమీపించునపు డమృతము విషమగును. స్నేహితులు విరోధులగుదురు. మంచిమాటలు చెడ్డవై హృదయమును ములుకులవలెఁ బొడుచుచుండు" ననెను.

వీరిట్లు మాట్లాడుకొనుచుండఁగనే యాయిగురు శూరులు సలాము లొనరించుచుఁ జాందబీబీ యెదుట నిల్చిరి. చాందబీబీ వారిని జూడఁగనే మిగుల సంతసించి వారి కుచితాసనంబుల నొసంగెను. వారందఱిలోఁ బ్రధానశూరుఁడగు షహాఅల్లీసిద్దీ రాణి గారినిఁ జూచి యామెతో "అమ్మా! మీరు మా కొనరించిన సాయమున మాపై కంపఁబడిన మియర్ ముంజా సైన్యంబులను వెనుకకుఁ మఱలఁగొట్టి జయము బొందితిమి. మఱియు నక్బరు చక్రవర్తిగారికొమరుఁడగు మురాదు రెండురోజులలో ఢిల్లీని వదలి యావెనుక నహమ్మదునగరముపైఁ బడనెంచి యున్నాఁడను సంగతి మాకు నిన్ననే తెలియవచ్చినది. మా సేనలను మీ రెప్పుడు దీసికొని రమ్మని యుత్తరవు జేసెదరో యప్పుడు తెచ్చుటకు సిద్ధముగ నున్నా" మని చెప్పెను. ఇంతలో నొకానొక పురుషుఁ డొక జాబును దెచ్చి చాందబీబీ కొసంగెను. రాణి యా జాబును హునేనుమీర్జా కొసంగి దానిం జదువ నాజ్ఞాపించెను.

హుసేను దాని నిట్లు చదువ నారంభించెను.

శివనేరి.

"చాందబీబీకి,

నీవు బీజపూరు రాజ్యమును వదలి యహమ్మదునగర రాజ్యమును భ్రష్టపఱుపఁదలఁచి యటవచ్చి చేరినది మొదలు నీవొనర్చు చుండగములన్నియు మాకుఁ దెలియవచ్చినవి. నీచాభిమానురాలా ! నీవు పురుషునికంటె నధికముగఁ బ్రజ్ఞలను బ్రకటించుచున్నావు. ఇంతమాత్రమునకే నీకు భయపడు వారెవ్వరునులేరు. ఎవరికొఱకై నీవిన్నిదినములనుండియు నుపయోగములేని పాట్లు పడుచుంటివో యట్టి బహాదరు మాచేతఁ జిక్కెను. ఇఁక నాతఁడు మీకుఁ జిక్కుట దుర్లభము. బహాదరును దక్కించుకొనుకోరిక నీకున్న యెడల నహమ్మదునగరమును వదలి నామకార్థమై కలిగియున్న హక్కును విడిచిపెట్టి మీరందఱు జున్నరుకుఁ బొండు. లేనిచో నీవు నాతోఁ బోరి జయించి బహాదరును జెఱనుండి విడిపించుకొని నీ హక్కును స్థిరపఱచుకొనుము. ప్రత్యుత్తరమునకై నిరీక్షించుచున్నాను.

ఇట్లు, మియన్ మంజూ."

ఇట్లు హుసేను జాబునుఁ జదివి ముగింపఁగనే చాందబీబీ మితిలేని కోపముతోఁ బ్రధానమంత్రుల నందఱిని దిలకించి "మంత్రులారా ! ఆ దుర్మార్గుఁడు వ్రాసిన యుత్తరమునందుఁగల సంగతులు మీకు బాగుగఁ దెలిసినవి గదా ! అత్తులువకు నే నీ రాజ్యము నంతను ధారవోసి జున్నరుకుఁ బోవలయునట ! సిద్ధి

సర్దారులారా! మీ మీ సేనలను రేపే యహమ్మదునగరమునకుఁ జేర్చుఁడు. పట్టణములోని సేనానాయకుల కందఱకును సైన్యమును సిద్ధము జేయవలసిన ట్లాజ్ఞాపించుడు. బీజపూరు నవాఁబునకును గోలుకొండనవాబునకును వారిసైన్యములను దీసికొని రావలసినట్లు జాబులను వ్రాసిపంపెద. నేహాంగఖానునకు, యితరయోధవరులకును నిప్పుడే వర్తమానముల నంపెద" నని చెప్పి బిరబిరఁ గొన్ని కాగితములను దీసి యప్పుడే జాబుల నన్నిటిని స్వయముగ వ్రాసి తన ముఖ్య సేవకులలో నలువురచేతికి నాలుగు ప్రత్యేక లేఖల నిచ్చి వారి నాయాపట్టణములకుఁ బోవునట్లాజ్ఞాపించెను. శివనేరి దుర్గమునకు వ్రాయఁబడిన మఱియొకజాబు రాణిగారికి వర్తమానమును దెచ్చిన మనుజుని చేతికే యియ్యఁబడెను. ఈ కొద్దిపాటి ప్రయత్నములతో నాఁటిసభ ముగిసెను.

## పదునేఁడవ ప్రకరణము

మహమ్మదు ముస్తుఫా యుంచఁబడిన కారాగార మంధకారబంధురంబై యుండెను. అతనికి నీటికై యొసగఁబడిన యొక మృత్పాత్రయును బరుండుటకై యొక చిన్న కంబళమును దప్ప వేఱువస్తువు లేవియు నాతనివద్ద లేవు. నిశాసమయంబున నాతనికి నిద్దురలేదు. ఆతని కియ్యఁబడు నాహారము నాతఁడు దినుట మానివేసెను. మృత్పాత్రలోని నీరుమాత్ర మప్పుడప్పుడు త్రాగుచుండెను. మియర్ మంజూ నియమించిన గడువు సమీపించినది. పదునాలుగురోజులు గడిచిపోయినవి.

తెల్లవాఱినది. పదునేనవ దినము ప్రారంభమాయెను. ముస్తుఫా కాఁదోళన మధికమైనది. గడువు సమీపించు కొలఁదిని యతఁడు ప్రాణములపై నాశవదలుచుండెను. ఇఁక రెండుజాములు మాత్ర మాతఁడు ప్రాణములపై నాశగలదు. ఈ లోపలఁ దాను షాజీని బెండ్లియాడు ప్రయత్నమునైన మానవలయును. లేదా తన ప్రాణములనైన గోలుపోవలయును. ముస్తుఫా పడకనుండి లేచెను. అతని కేమియుఁదోపలేదు. మరలఁ బరుండెను. కొంత సేపూరక యటు నిటుఁ బొరలుచుండి మరల లేచి కూర్చుండెను. మనస్సతని యధీనమున లేనందున నతఁ డేమేమో మాట్లాడు కొనుచుండెను. " నా గ్రహచార మతిక్రూరంబుగ నున్నది. ఆహా! విపత్పరంపర లొక్కుమ్మడి యీ కారాగృహమందలి యంధ కారమువలెఁ నన్నుఁజుట్టుకొనుచున్నవి. అయ్యో ! యిక రెండు జాములే కదా నాకు గడువున్నది. ఈ కష్టములనుండి దప్పించు కొన నుపాయంబు గానరాదు. సర్వసాక్షియై సర్వాంతర్యామియై పిపీలికాదిబ్రహ్మపర్యంతము నిండినవాఁడై, యాదిమధ్యాంతరహి తుఁడై నెగడు పరమేశ్వరుఁడు నా కష్టమునుండి నన్నుఁదప్పింపఁ దలఁచునా ? కట్టా ! యది యేటిమాట ! నా ప్రాణములను బోగొట్టుకొనియే తీరవలయును. షాజిని వివాహమాడు ప్రయత్న మును మానుదునా ? ఛీ ! ఏమ్మి నా తలంపు ?—హా ! జగన్మో హినీ ! న న్నేల చూడవు ? నా మాట నీకింకను జ్ఞప్తికి రాలేదా ? నే నీ లోకముపై నాశను వదలుచున్నాను. చూడుము. నా యెడ నెట్లు కృశించినదో ? నన్నేలఁజూడవు ? నీ కింతమాత్రము గరుణ లేదా ?—అయ్యో ! దైవమా ! ఆ సుగుణరత్నమును, ఆ సౌందర్య

నిధిని, నే నీ జన్మమునఁ జూడఁగలనా ?—ఏమి నాపిచ్చి! ప్రాణముపోవ సిద్ధముగనుండ మరల నా కేల యీ యాశ! లోకమునందుఁ గేవలము సుఖమునే జన్మాంతమువఱకు ననుభవించు మానవుఁ డుండఁడు. దుఃఖముగూడ నట్లే యెంతటి వానినైన నాపదలు దప్పింపకపోవు. వెల్తురు నాధిక్యమును వెల్లడి జేయుటకై చీఁకటి భగవంతునిచే సృష్టింపఁబడినట్లు సుఖాతి శయమును స్పష్టపఱచుటకే దుఃఖము సంభవించును. అయిన నాకు సుఖమేమైనగలదా ? అది కల్ల-క్రూరదైవమా! నా కేల నీవిపత్తును నెత్తిపైఁబెట్టితివి ? అయ్యో! దైవము నేల నిందింప వలయును ? ఈ ప్రపంచమంతయు నాపత్సముద్రమున మునింగి యున్నది. దృష్టిపథమునఁ బడుచున్న చరాచరములోని ప్రతి వస్తువు నాపదకు గుఱియై యున్నది. ప్రతిజీవుఁడును దాను శరీ రమును ధరించి కష్టముల ననుభవించుచునే యుండును. కష్ట ముల కొక సమయములేదు. అవి యే చోటునందైనను హఠాత్తుగ పిడుగు పడినట్లు మానవులపైఁబడి హింసించుచుండును. ఆ పర మాత్ముఁ డొక్కఁడుదక్కఁ దక్కినవారందఱు గష్టములకు లోఁబడవలసినదే! అయ్యో! షాజిబీబీ! నీ కొఱకై ప్రాణము లను వదలుచున్నాను. నీవు నాకొఱకై చింతించనవసరము లేదు. చిన్నతనమునుండియు నిన్నుఁ దప్ప వేఱొకరిని బెండ్లాడనని ప్రతినపట్టిన నీ శూరుఁడు ప్రాణములనైనఁ గోలుపోవునుగాని నిన్ను వివాహమాడఁ డని ప్రమాణము జేయఁగలఁడా! అయ్యో! గడువు సమీపించుచున్నది. ఇఁక రెండుగంటల కాలములో నా ప్రాణములు పోవును. దుఃఖమా! మరల నన్నావరింపుము.

మోహామా! వజ్రపంజరనిభంబులగు ధైర్యవంతుల హృదయములంగూడ నీరుగఁ గరగించు శక్తిగల నీవు నాకడకుఁరాకుము. షాజిబీబీ! పరలోకమున కేగుటకు నాకు సెలవిమ్ము. నీవు వేఱొకనిని బెండ్లాడి సంసారసుఖము ననుభవింపుము. నీవు నామరణవార్తనువిని ప్రాణములను విడువవద్దు. చాందబీబీ! నీవు నా సహాయమునకై కనిపెట్టి యుండవలదు. అహమ్మదునగరమును జాగ్రత్తగఁ గాపాడుము. అయ్యో! నాలుగుగంటలు కావచ్చినది. ఇఁక నా దుర్మార్గులు నన్నుఁ గడతేర్ప నిటవత్తురు. తప్పించుకొని పోవుటకు వీలున్నదా? అయ్యో! తలుపువద్దఁగూడ నించుకంత సందులేదు. బీగము లతిగూఢముగ వేయఁబడి యున్నవి ఛీ! దొంగవలె పాఱిపోవుటయా! అసంగతము-అసాధ్యము-నాజన్మమున గడపటితూరి "భగవన్నామ మొనర్చెద" ననుచు ముస్తుఫా కండ్లు మూసికొని 'దయానిధీ! పరమేశ్వరా! దీనబంధో! కరుణాపయోనిధీ!' యని పరిపరి విధములుగ భగత్ప్రార్థన జేసెను. మరల నాతనికి స్మృతి తప్పిపోయెను. కొంతసేపటికి నాతనికి మరలఁ గొంత తెలివిగలిగినది. ఇప్పుడు మృత్యుదేవత యాతనిపై నావేశమైన ట్లాతఁడు గనుగొనెను. కన్నులు చీఁకట్లు గ్రమ్మినవి. ఇంతలోఁ జెఱసాల కవాటము 'ఫెళ'లుమని తెఱవఁబడెను. శబ్దమువలన ముస్తుఫాకుఁ గొంత స్మృతిరాఁ గన్నులు గొంచె మగపడుచుండెను. తలుపు దెఱవఁబడిన క్షణముననే యిద్దఱుపురుషు లాగదిలోఁ బ్రవేశించిరి. ఒకని చేతియందొక పెద్ద ఖడ్గమును మఱియొకని చేతియందు మహమ్మదీయ మత గ్రంథమగు ఖురాను నుండినవి. వీ రిద్దఱును ముస్తుఫాచెంత కేఁగ

వీరే యమభటు లని ముస్తుఫా భ్రమపడెను. ఆ వచ్చి యిద్దఱిలో నొకఁడు " ఏమోయి షాజీని వివాహమాడు ప్రయత్నమును వదలితివా ? లేనిచో నిన్నిప్పుడే శిరచ్ఛేదనమొనర్తు" మని చెప్పెను. వారు మియర్ మంజూ సేవకులని ముస్తుఫా కిప్పుడు తెలియవచ్చెను. అతనికి నోటమాటరాక కొంచెము సేపూరక నిలిచి యుండెను. మరల నా యిద్దఱిలో నొకఁడు ముస్తుఫాను ముందడిగినట్లే యడిగెను. అందులకు ముస్తుఫా " ఓరీ! నీచులారా! మనోవాక్కాయ కర్మముల నేనా షాజిబీబీని దప్ప మఱొక్కతెను వివాహమాడనని ప్రతిజ్ఞ పట్టియున్నాను. మీరు నన్నుఁ జంపుడు. ఒక్క స్త్రీ రత్నమునకై యిట్టిపూరుఁడు దన ప్రాణములనువిడిచెనని లోకములోనైన నాపేరు శాశ్వతముగ నుండఁగల" దని తన శిరమును వారి కరవాలమున కందిచ్చెను. అంత వారిలో నొకఁడు దన చేతనున్న కత్తినెత్తి ముస్తుఫా కంఠముపైఁబెట్టి వాటము జూచెను. మరల నతఁడాకత్తినెత్తెనో లేదో వెంటనే యతనివద్దనున్న మఱియొకఁడు మిక్కిలి తత్తరపాటుతో "ఆగుమాగుము మోసమువచ్చె" ననుచుఁ జెఱసాలనుండి పరుగిడి పోయెను. వెంటనే రెండవవాఁడును వాని కేదో జ్ఞాపకమునకు రాగా మొదటివాని ననుసరించి వెడలిపోయెను. ముస్తుఫా ప్రాణము గొంత కుదుటఁబడినది. ఇంతమాత్రమున నాతఁడానందింపలేదు. మరలఁ బ్రాణము గలతఁజెందెను. వెంటనే చెఱసాలతలుపులు మరలఁ దెఱవఁబడినవి. పకీరొకఁడా చెఱసాలను బ్రవేశించి ముస్తుఫాకుఁ గొన్నిస్త్రీలు ధరించెడు నుడుపుల నొసఁగి చెఱసాలనుండి పాఱిపొమ్మని యాజ్ఞయిచ్చి మఱికొన్ని రహస్యము

లను వానిచెవి నూదెను. ఇప్పుడు ముస్తుఫా సంతోషము వర్ణ నాతీతము. అతఁడా యుడుపులను గ్రహించి మెఱపుమెఱసినరీతిఁ జెఱసాలనుండి పాఱిపోయెను. ఆహా! సంతోష మెట్టి బలహీను లను గూడ శౌర్యనిధులఁ జేయుచుండునుగదా! ఫకీరును యదృశ్యుఁ డయ్యెను. ఇదంతయుఁ గూడ నైదు నిముసముల కాలములో జరిగిపోయెను. చదువరులారా! కర్మవిముక్తి కాలము దటస్థించినపుడు భగవంతుఁడే ఫకీరురూపముననో మఱి యే రూప మునవో యగపడి ప్రజల రక్షించుచుండునుగదా!

## పదునెనిమిదవ ప్రకరణము

సతీమణికి రూపవంతుఁడును, సర్వశుభలక్షణ సమన్వితుఁ డును, సత్కళల కాకరమైనవాఁడును నగు సద్భర్త సమకూడినచోఁ గలుగు సంతసమునకు సర్వసౌభాగ్యములవలనఁ గలుగు సమస్త సుఖములును సరిగావు. గుణవతికి భర్తయే లోకము; భర్తయే సుఖము; భర్తయే ప్రాణము. అట్టి పతియందు సర్వకాల సర్వా వస్థలయందు ననురాగముగలిగి యతఁడే దైవమని భావించు స్త్రీకి నిహపరలోక సుఖములు గలుగుననుటకు సందియములేదు. అన్న దమ్ములు, అక్కచెల్లెండ్రెంత గౌరవవంతులైనను, ఎంత ధనవంతు లైనను, దన్నెంత గారాబునాఁ బెంచినను, స్త్రీకి నిజమగు గౌర వము, నిజమగు సంతోషము తన భర్తవలనఁ గలుగును.

షాజిబీబీ యట్టిసంతసము బొందుటను నిరీక్షించుచున్నను దానినింకను బొందఁజాలకుండెను. ఆమె తన శయనమందిరమున

నొంటరిగఁ బరుండియుండెను. ఆ శయ్యాగారము చాల విశాలమై యుండెను. గదిలోఁ దాపఁబడిన జలువరాళ్లపైఁ విలువలేని యొక రత్నకంబళము పఱుపఁబడి యుండెను. దానిపై నొక హంస తూలికాతల్ప మమర్పఁబడి యుండెను. దీనికిఁ బై భాగమున నెఱ్ఱ పట్టుతానులతో నొకచాందిని గట్టఁబడియుండెను. హంస తూలికాతల్పమునకుఁ బ్రక్కగ నెత్తైన రెండు గొప్పబీరువా లుండెను. ఒక బీరువనందు పతివ్రతల మాహాత్మ్యములం దెల్పు కొన్ని గ్రంథరాజములును, మఱియొక బీరువయందు గ్రంథ ద్రవ్యములతో నిండియున్న కొన్ని సీసాలునుండెను.

షాజిబీబీ హంసతూలికా తల్పమునఁ బరుండి యాలోచనా నిమగ్నయై పలుమారు ముస్తుఫా నామమును స్మరించుచుండెను. అతని విషయమైన సంగతుల నెఱుంగవలయు నని యామె యెంత ప్రయత్నించినను బ్రయోజనము లేకుండెను. ఫకీరు నామెకు జాడకట్టలేదు. ముస్తుఫా తన్ను జూచుటకు వచ్చునపుడు శత్రువు లచేఁ జిక్కియుండునని యామె యూహించెను. ఎన్నియూహలు తనకుఁ గలిగిన నవి దుఃఖభావములుగనే పరిణమించెను. ఎచ్చటి నైన నించుక శబ్దము గలిగిన ముస్తుఫా వచ్చుచున్నాఁడనియే యామె భ్రమపడుచుండెను, దాదాపు రెండుజాముల రాత్రికంటె నెక్కుడైనను నామెకు నిద్దుర రాకుండుటచే నామె యెట్లైన ప్రొద్దుపుచ్చుటకై పుస్తకములుండు బీరువ కడకేఁగి యొక పుస్త కమును దీసికొని పడకపై బరుండి యా గ్రంథమును జదువుట కారంభించెను. ఆ పుస్తకమునం దనేకయుద్ధవీరుల చరిత్రములు

ప్రశస్తముగ వర్ణింపఁబడి యుండెను. ఆమె పుస్తకమును గంటితో మాత్రము చూచుచుండెను గాని మనస్సు ముస్తుఫా యందే లీనమై యుండెను. ముస్తుఫా చరిత్ర మా పుస్తకమున వర్ణింపఁబడి యున్నచో దానిని షాజిబీబీ త్రికరణశుద్ధిగఁ జదువునేమో!

ఇట్లు షాజిబీబీ యా పుస్తకములో నొకపుటఁ చదివినదో లేదో యింతలో నా గది తలుపు దెఱువఁ బడెను. ఆమె తటాలున నా పుస్తకమును మూసి ముస్తుఫా వచ్చెనను భ్రమతోఁ దలుపువద్ద కేఁగెను. కాని యామె దలఁచినట్లు ముస్తుఫా యచ్చట లేఁడు. దీనవదనయై మిక్కిలి బడలికతో నున్న యొక యువతి యామె కంటఁబడినది. ఆమెను జూడఁగనే షాజిబీబీ కొక విధమైన ప్రేమ యుత్పన్నమగుటచే నామె యావచ్చిన స్త్రీరత్నమును వెంటనే తన గదిలోనికిఁ బిల్చుకొనిపోయెను. వారి కీ క్రిందివిధమున సంభాషణ జరిగెను.

షాజి:—అమ్మా! నీ వెక్కడనుండి వచ్చుచున్నావు? నీ స్వగ్రామ మెయ్యది? నీవును నావలెనే యింత దుఃఖముతో నుండుటకుఁ గారణమేమి?

స్త్రీ:—అమ్మా! నా పేరు మిరన్ బీ యందురు. నేను నా భర్త యును గ్రొత్తగ జున్నరు గ్రామమునకుఁ గాపుర ముండుటకై వచ్చితిమి. అంత నా దుర్మార్గుఁడగు మియర్ మంజూచేఁ బంపఁబడిన క్రూరులు మీ రాజ్యమునకు సంబంధించిన గ్రామములను గొల్లగొట్టుచు నున్నరు

బడి నా భర్తను జంపి నన్నుఁ జెఱగొనిపోఁ బ్రయత్నించిరి. నే నా నీచుల చేతులలోఁ బడక బరుగిడి యిటు వచ్చితి. వారు నన్నింకను తరుముకొనియే వచ్చుచున్నారు. మియర్ మంజూ యొనర్చు దుండగముల నడంప మీ రాణిగారు సమకట్టి యుండుటచే నామె యండనుండ నిటు వచ్చితి. నా కభయమిచ్చి రక్షింపవలయును.

షాజి:—(స్వగతము) ఆహా ! యీమె ముఖమున ముస్తుఫా మొక్కట్లు కొన్నియున్నట్లున్నవి. (పయికి) మిరన్ బీ ! నీవింక భయపడవలదు. మా రాణిగారు నీకు సహాయ మొనర్తురు. నీవు నావద్దనే సదా యుండగలవు. నేఁటి దినము మొదలు మన కిద్దఱికిని స్నేహము సమకూడినది. అమ్మా ! బీజపురమున నున్న యిబ్రహీం అదిల్ షాహా సోదరుఁడగు మహమ్మదు ముస్తుఫాకును నీకు నేమైన బంధుత్వము కలదా ?

మిరన్ బీ:—(స్వగతము) ఆహా ! యీమె నా యుదంతమును గొంత గ్రహించినట్లున్నదే ! ఫకీరు నాజ్ఞ యగువఱకు నేను దానిని వెలిపుచ్చఁ గూడదుగదా ? (పైకి) అమ్మా ! బీజపురమెక్కడ ? నే నెక్కడ ! ముస్తుఫా యెవరు ! వారికిని మాకును గొంచెమైన బంధుత్వము లేదు. మీరు ప్రత్యేకముగ నీ సంగతి నన్నేల యడిగెదరు ?

షాజి:—అమ్మా ! ముస్తుఫా మొక్కట్లు నీయందు ప్రతిబింబి తములై యుండుటచే నే నట్లడిగితిని గాని వేఱుగాదు.

ఇట్లు వారు కొంత సేపటివఱకు మిరన్‌బీ ప్రయాణమును గుఱించియుఁ జాఁదుబీబీ, షాజీబీబీల ప్రస్తుతావస్థల గుఱించియు మాట్లాడుకొనిరి. మిరన్‌బీ మాటలాడు నప్పుడెల్ల షాజీబీబీ యొక విధమైన ప్రేమను, సిగ్గును జనించుచుండెను. చాఁద్‌బీబీ సిగ్గుచేఁ గొంత సేపటి వఱకును మాటలాడలేదు. వారి మోహంపు సంతోషవృత్తితో నొకటి గలిసికొనెను.

### పందొమ్మిదవ ప్రకరణము

ప్రధానమంత్రు లందఱు తన్ను బరివేష్టించియుండ మియర్‌మంజూ సింహాసనము నధిష్ఠించి యుండెను. ఆతని కేమి చేయుటకును దోఁచలేదు. ఇప్పటికిఁ దనకుఁ గలిగిన కార్యభంగము లన్నియుఁ గ్రోధరూపమున ముఖమునఁ దాండవ మాడుచుండెను. కోపానలముచేఁ గలిగిన తాపము వలనఁ గనులెఱ్ఱనై చింతనిప్పులవలెఁ దేజరిల్లుచుండెను. ఆతఁ డెవరి కొఱకో యెదురు చూచుచున్న వానివలె మాటిమాటికిఁ దిక్కులఁ బరికించుచుండెను.

ఇట్లుండ నిద్దఱు భటులు మియర్‌మంజూ యొద్దకుఁ దీసికొని రాఁబడిరి. వారిం జూడగనే యతఁ డాజ్యమువోసిన యగ్నిహోత్రము వలె మండిపడి తన చెంతనున్న బాకును దీసికొని వారిపైకిఁ దుముక హసన్‌మియా యాతనిఁ గొంత శాంతిపఱచి సింహాసనమునఁ గూర్చుండు నట్లొనర్చెను. అంత మియర్

"ఓరీ! దుర్మార్గులారా! మాటిమాటికిని మీరు సర్వకార్యము లను విఘ్నమొనర్చుచుఁ బొరపడితిమని చెప్పుచున్నారు. నేను మాత్రము మిమ్ములఁ బ్రాణములతో విడువను. మీరు చెఱసాలకు బీగములను వేసికొనక నావద్దకు వచ్చి యా దుర్మార్గుని నిష్కారణముగ విడిచిపుచ్చినందులకు మిమ్ముల నిప్పుడే యురిదీయ నాజ్ఞ యొసంగెద" ననెను. అందులకు భటులలో నొకఁడు "అయ్యా! ఆతనిని శిరచ్ఛేదన మొనర్చుటకు ముందుగ మీతో నొకమాట మాట్లాడవలసినట్లును, మీయుత్తరువును దీసికొనవలసినట్లును మీరాజ్ఞాపింపఁబడి యుండుటచే మీవద్దకుఁ వచ్చితిమి. ఆతొందరరో మేము బీగమును వేసికొనక తాళమును మాత్రము గొళ్లెమునకుఁ దగిలించి మరలఁ ద్వరలోఁ జెఱసాలను జేరఁ గలమను నభిప్రాయముచే మీద్దకుఁ వచ్చితిమి. ఒకపావుగంట లోపలనే మీవద్ద ననుజ్ఞఁ దీసికొని మేమచటికిఁ బోవునప్పటికి ముస్తుఫా యచ్చటలేఁడు. బీగముమాత్రము వేసినది వేసినట్లుండె" నని చెప్పెను. అందులకు మియర్ "ఓరీ! మీమాటలను నేను నమ్మను. మీరేయాతని విడిచిపుచ్చియుండఁగూడదా? ఎటులైన మీరిఁక వారమురోజులలో ముస్తుఫా నైనను లేక చాందబీబీ నైనను నావద్దకుఁ బట్టుకొని రావలయును. మీకిద్దఱికిఁ దోడుగ నిఁకనలుగురు సేవకుల నిచ్చెదను. మీరీ కార్యమును నెఱవేర్చరేని యాక్షణమున మిమ్ముల నుఱిదీయ నాజ్ఞయొసంగెద. మీరిప్పుడే బయలుదేరవలయు" నని కఠినముగ నుత్తరువుచేసెను. అంత నా సేవకులు తమయజమానుని యాజ్ఞగొని యెచ్చటికో వెళ్ళిపోయిరి.

వారట్లుపోయిన క్షణమునకే యొకపురుషుఁ డొక జాబును దీసికొనివచ్చి మియర్‌మంజూచేతి కొసంగెను. మియర్‌మంజూ దానిని జక్కఁగాఁ జదివి చేరువనున్న హసనుతో "మిత్రమా! చాందబీబీ యేమి వ్రాసియున్నదో చూచితివా! తాను ఢిల్లీ చక్రవర్తికిఁగూడ భయపడననియు, మనతో యుద్ధమాడి జయించిన పిమ్మట బహదరను కారాగృహమునుండి విడిపించుకొని పోవుదు ననియు, మఱియు మన మొనర్చు దుండగములన్నిటి మానవలసినట్టును వ్రాసినది. హసన్ ! నేనీ నీచజాతిస్త్రీకి లోఁబడి శివనేరి దుర్గమును వదలి, తనకు భృత్యుఁడనగుదునని యాపె తలంచినది కాఁబోలు! ఈ దుర్మార్గురాలి కించుకైన నేను జంకువాఁడను గాను. నా సేన నంతను సిద్ధముగ నుంచియున్నాను. మురాదుగూడఁ దన సైన్యముతోఁ వచ్చి మనల నేఁడో రేపో కలసి కొనగలఁడు. యుద్ధమాడియే మనము చాందబీబీని జున్నరుకుఁదరుమగొట్టి యహమ్మదున కహమ్మదు నగరరాజ్య మిప్పించగల" మనెను. అందులకు హసన్‌మియ్యా "మిత్రమా! మన పన్నుగడలన్నియు నెఱవేఱి యుండిన నిదివరకే యహమ్మదునగరము మనకుఁ దక్కియుండును. ఇప్పుడు మనసేవకులు చాందబీబీని బట్టుకొని వచ్చిన నామెను దుదముట్టించి మనము సులభముగ రాజ్యమును లోఁబఱచుకొనవచ్చును. మీరు షాజిబీబీని వివాహమాడవచ్చును. ముస్తుఫా బీజపురమునకు వెళ్ళియుండునా?" యనెను. మియర్ మంజూ—"ముస్తుఫా షాజిబీబీని జూడవచ్చెనుగాన నతఁ డహమ్మదు నగరమునకే పోయియుండును. అతఁ డచ్చటనే

యున్న మన సేవకులాతనిఁ బట్టఁగలరు. ఆలోచనామందిరములో నున్న హైటరును, దస్తగిరియును వారికి సహాయ మొనర్పఁగలరు. ఈతూరి మనకేదో యొక గొప్పలాభము గలుగఁగల" దనెను. వీ రిట్లు కొంతసేపు మాట్లాడుకొనిన వెనుక హసన్ మియ్యా యుద్ధసన్నాహము లొనర్చుటకుఁ దన తావునుండి లేచిపోయెను.

## ఇరువది యొకటవ ప్రకరణము

సాయంకాల మైదుగంట లగునప్పటికి మిర్ న్ బీ షాజీ బీబీలు రాణిగారి భవనమునకు సమీపముననున్న యుద్యానవనములో విహరించుచుండిరి. వారు పట్టరాని సంతోషముతో నున్నట్లు వారి వదనారవిందములనుండి తెలియవచ్చుచుండెను. వారు ప్రతి పూలచెట్టువద్దకునుఁ బోయి పూవులఁ గోసికొనుచుండిరి. షాజీబీబీ కొన్ని మల్లెపువ్వులను మిరన్‌బీ సిగయందు దురిమెను. మిరన్‌బీ యును గొన్ని రోజాపుష్పములను దండగఁ గట్టి షాజీబీబీ మెడ యందు వైచెను. షాజి యా దండను దీసివేసి "చెలీ! నీవు పురుషులవలెఁ బూదండలను మెడలో వేయుచున్నావే!"

మిరన్‌బీ :—(తనలో) నాగుట్టింకను బయల్పడలేదు. అయిన దీని నించుక పరీక్షించెద. (పైకి) షాజీ! నీకు వివాహమునం దిచ్ఛకలదా?

షాజీ:—ఏల నన్నీ ప్రశ్న నడిగితివి?

మిరన్‌బీ :—నేను ని—నేను గూడ వివాహము చేసికొనవలయు నని యున్నాను. కాన నట్లంటిని వేఱుగాదు.

షాజీ:—ఏమేమి ! నేను నిన్ను వివాహము చేసికొన వలయునని యన బోవుచుంటివే ! నీవు న న్నెట్లు వివాహ మొనర్చు కొనెదవు ?

మిరన్ బీ:—కాదుకాదు. నీవలెనే యనఁబోయి యట్లంటిని. వే ఱేమియుఁగాదు. నే నడిగిన ప్రశ్న కుత్తరమిమ్ము.

షాజీ:—నీ కాకోరిక యున్నయెడల నాకుఁగూడ నట్లేయున్నదను కొనుము.

మిరన్ బీ:—ఎవరిని వివాహము చేసికొనెదవు ?

షాజీ:—ఎవరినైన నీ కేమి ? నే నాతనిపేరు చెప్పుటలేదు.

మిరన్ బీ:—దయచేసి యాతని నామమును నీ నోటినుండి యుచ్చరింపుము. నేను శ్రవణానందముగ వినెదను. చెప్పుము.

షాజీ:—ము—( సిగ్గుచే నూరకున్నది )

మిరన్ బీ:—అయ్యో ! నామాటను దృణీకరించెదవా ?

షాజీ:—( సిగ్గుతో ) లేదు. ముస్తఫాను వివాహమాడెదను.

మిరన్ బీ:—అతఁ డించుక దుర్మార్గుఁడని వింటిని.

షాజీ:—ఛీ ! ఛీ ! నీ కేమిపిచ్చియా ? నీవు నాయిక్కాంపు సఖివని మన్నించితిని. గాని వేఱొకరినోట నిట్టిమాట వచ్చి యుండిన నప్పుడే వానిని యమసదనమున కంపి యుందును. ఆసుకుమార కోమల గాత్రుఁడైన ముస్తఫా దుర్మార్గుఁడని నుడివి నీవించుక పాపము నొడిగట్టికొంటివి. అమ్మా ! యిప్పుడాతని ప్రశంస మన కెందుకు ? సాయం కాలమైనది మన నగరునకుఁ బోవుదము రమ్ము.

ఇట్లు మాట్లాడుకొనుచు వారు రాణిగారి భవనమును జేరఁబోవుచుండిరి. ముస్తుఫా, షాజి లన్నే బెండ్లాడవలయునని త్రికరణశుద్ధిగ నున్నట్లు కనుగొనెను. షాజిబీబీయు మిరన్‌బీ తన్ని ట్లడుగుటకుఁ గారణమేద్దియని యోచించుచుఁ గొంత సేపటికిఁ దన చెలికత్తియతో నగరు జేరెను. అంత పరిచారిక లరుదెంచి వారిని జలక మాడించి భోజనశాలకుఁ బిలిచికొని పోయిరి. భోజనమైన వెంటనే వారు శయనమందిరమున కరు దెంచిరి. వారు పడకఁజేరుట కింకను యాలస్య ముండుటచే షాజిబీబీ గ్రంధరాజములచే నిండియున్న బీరువకడ కేఁగి యొక పుస్తకమును దీసికొనివచ్చి చదువుట కారంభించెను. మిరన్‌బీ షాజి ప్రక్కనఁ గూర్చుండ యామె చదువువానినంతను వినుచు "షాజీ ! నీనిప్పుడు చదివిన భాగమంతయు నర్థమయనవా ?" యని యడిగెను. అందులకు షాజిబీబీ "ఏవో కొంచబోవపడినవి. నాకంటె నీ వెక్కుడు తెలివిగలదానవు గనుకను పెద్దదానవు గనుకను నీకు బాగుగ నర్థమై యుండవలయు" ననెను.

పిమ్మట మిరన్‌బీ "చెలీ ! చూచితివా ! భగవంతుని మాయ ! తాను ప్రతిజీవ జంతువునందును నివసించుచు నెల్ల జంతువులను దన కుక్షిలో నిడుకొని యున్నాఁడు. మఱియుఁ దా నొక ప్రకాశ మనియు, నా ప్రకాశమునే యెల్లజంతువులకు నొసఁగియున్నాఁడనియు, నందుచేఁ దాను ప్రతిజీవజంతువు నందును నిండియున్నాఁడనియుఁ జెప్పినాఁడు. కావఁ బ్రతిప్రాణియు భగవత్స్వరూపమై యుండుటచే మనము సర్వప్రాణుల యెడలను

దయగలిగి యుండవలయును. దీనినే భూతదయ యని యందురు. చెలీ! నీకిప్పుడు విశదముగఁ దెలిసెనా?" యనెను. అందులకుఁ షాజిబీబీ "మిరన్‌బీ ...పాపమునకుఁ దగినట్లే భగవంతుఁడు నీకుఁ దెలివినిగూడ నొసంగియున్నాఁ" డనెను. అందులకుఁ మిరన్‌బీ "నాదెలివికేమిలే ఒకటి రెండు మూడు....అబ్బా! పదిగంటలరాత్రియైనది. మనమిఁక పరుండవలయు" నని చెప్పెను. షాజిబీబీయుఁ బుస్తకమును మూసి గ్రంధమును బీరువలోనుంచి తన పడకమీఁద గూర్చుండి కొంతసేపు భగవద్ధ్యానమొనర్చి పడకపైఁ బరుండెను.

మిరన్‌బీ పడకగూడ షాజిబీబీయొక్క మంచము ప్రక్కనే వేయఁబడి యుండెను. మిరన్‌బీ శయ్యఁజేరెను గాని యామెకు నిద్రలేదు. ఆమె కొంతసేపు తనమనస్సును షాజిబీబీపై లీనము జేయుచు మఱికొంతసేపు తనకిదివఱలోఁ గలిగిన దురవస్థను గుఱించి తలఁచుకొనుచు నెట్లో యొక గంటకాలమునకు గాఢనిద్రనుఁ బొందెను. షాజిబీబీయు బాగుగ నిద్రించుచుండెను. పడకటింటిలో దీపము వెలుఁగుచునే యుండెను.

ఈసమయమున నలుగురు మనుష్యులు పడకగది ముందు భాగమున నున్న కూటమిలోఁ దిరుగుచుండిరి. వీరి భీకరాకారమైన దృఢగాత్రములను జూచిన నెట్టివారికైన గుండెలు నీరైపోఁగలవు. వారిలోఁ బ్రతియొకఁడును చేతిలో నొక దుడ్డుకఱ్ఱను బట్టుకొని యుండెను. కరుణారస మన్న నెట్టిదో వారికిఁ దెలియదు.

వీరిలో నిద్దఱు పడకగదిని ప్రవేశించిరి. పిమ్మట వారిలో నొకఁడు బయటికి వచ్చి యచ్చట నున్నవారితో "ఓరీ! షాజిబీబీ మాత్రము మాకు చక్కఁగఁ దెలియవచ్చినది. మఱియొక మంచముమీఁద చాందబీబీయో, ముస్తుఫాయో పండుకొని యున్నా" రనెను. పిమ్మట గదికి వెలుపలనున్న వారిలో నొకఁడు "అరే! స్త్రీయో పురుషుఁడో బాగుగఁ జూడు" డనెను.

పిదప వారందఱు గదిలోని కేగి యాపాదమస్తకముగఁ గప్పికొని పరుండి యున్న మిరన్‌బీయొక్క ముసుఁగును మెల్లగఁ దీయుటకుఁ బ్రయత్నింప, నామె యించుక చలించెను. అందుచే వీరు గొంత సేపూరకుండి ముఖమునకుఁ గప్పఁబడియున్న ముసుఁగును దీసిన నామె లేచునను భయముచేఁ గాళ్ళవద్దనున్న ముసుఁగును దీసిచూచిరి. అప్పుడు వారా పరుండియున్న మానిసి చాందబీబీ యనియే నిర్ధారణ చేసిరి. అంత నలుగు రామె పరుండయున్న మంచము నెత్తికొని కూటమును దాటి బయటనున్న బయ్యలులోనికి వచ్చి చేరిరి. వారికి సహాయులుగ బయట నిద్దఱు మనుజు లుండిరి గాన వీరును వారితోఁ గలిసికొని శివనేరి దుర్గమును గూర్చి పోవు దారిలోఁ బోవుచు దెల్లవాఱఁ బోవుసరికి వా రొక యరణ్యమార్గమునఁ బోవుచుండిరి. మంచమును మోయువారుగాక మిగత నిద్దఱు మనుజులును మంచమునకు ముందు భాగమునఁ బోవుచుండిరి. మంచములోని యువతి గాఢనిద్ర నొంది యుండుటచేఁ నించుకైన చలించలేదు.

కొంత సేపటికి వీరందఱా యరణ్యమును దాటి చదును పాటి బయటను బోవుచుండ నున్నట్టుంటి 'నిలు నిలుఁ' డను భీకరారావములతో శూరు లిర్వురు వారిని సమీపించిరి. వెంటనే మంచము వహించియున్న వారిలో నిద్దఱి చేతులు తెగి క్రిందఁ బడుటచే వారు నేలఁగూలిరి. అంత మంచమును గ్రింపఁబడ దానిలోని యువతి దిగ్భ్రమ జెంది మేల్కాంచి యా భయానక రంగమును దిలకించి వెంటనే మూర్ఛిల్లెను. మంచమునకు ముందు భాగముననున్న యిర్వురును మిగలు నిద్దఱితోఁజేరి యా స్త్రీ నెట్లులైన దక్కించు కొనుటకై యా శూరులతోఁబోరిరి. వారట్లు పోరాడఁగ గడిండిన క్షణముననే వారిలో నిద్దఱి తలలు దెగి క్రిందఁబడినవి. అంత మిగిలిన వారందఱదృశ్యులైరి. వారందఱు పలాయనమైన క్షణముననే యా వచ్చిన శూరు లిర్వురును మిరన్‌బీకడ కేఁగిరి. వారిలో నొకనిని మిరన్‌బీ చూడ వందనశతంబు లర్పించి "మహానుభావా! నిన్నేమని పొగడఁ గలను. కారాగారమునుండి నను దప్పించి నా ప్రియురాలిని దర్శించు నట్లొనర్చితివి! ఇప్పట్టున నెటనుండియో నన్ను రక్షింప సాక్షాత్కరించితివి. శూరనిధీ! వేయి జన్మంబులకైన నీఋణంబుఁ దీర్చుకొనఁజాల" ననెను. అంతఁ బకీరు "ముస్తుఫా! ప్రపంచమున నున్న సంకటములన్నియు నీకే తటస్థించుచున్నవి. ఇత్తరుణమున నే నిచ్చట లేకున్న నా దుర్మార్గులు నిన్నేమి చేసి యుందురో" యనుచు. మాలోజిఖాన్సులేతోఁగూడ ముస్తుఫాను వెంటఁబెట్టుకొని తన కుటీరమునకుఁ వెళ్ళిపోయెను.

## ఇరువదియొకటవ ప్రకరణము

తెల్లవాఱఁగనే షాజిబీబీ పడకనుండి లేచి గదినంతయుఁ దిలకించిచూడ మిరన్‌బీ పండుకొనియుండిన మంచమం దగపడకుండెను. వెంటనే యాపె బయటికి వచ్చి మిరన్‌బీని వెదకి చూచెను. గాని యెచ్చటను నగపడలేదు. హజారముల తలుపులన్నియుఁ దెఱువఁబడియుండెను. కావలిగాచు వారందఱు మచ్చు చల్లఁబడిన వారివలె నింకను దేహములు దెలియక నిద్రించుచుండిరి. దీని నంతయుఁ జూచిన షాజిబీబీకిఁ గోపమును, దుఃఖము నొక్కసారిగఁ గలిగెను. వెంటనే యాపె కావలివారి చెంత కేఁగి " ఓరీ! దుర్మార్గులారా! మీరు దేహములు దెలియక నిద్రించుచు నగరులోనికే వచ్చు దొంగలను బట్టలేకపోయితిరా? మిరన్‌బీని చోరులెవరో రాత్రి తస్కరించుకొని వెళ్ళినట్లున్నది. మీకుఁ దెలియదా?" యనిగద్దించి యడిగెను. అందులకు వారు భయభ్రాంతులై "అమ్మా! మాకుఁ దెలియదు. రాత్రి రెండు గంటలకాలము వఱకును మే మతిజాగ్రత్తతో హజారమును గాచియుంటిమి. పిదప నించుక కన్నుగురికితిమి. ఆవలనేమి జరిగినదో మాకుఁదెలియ" దనిరి. అంత షాజిబీబీ చాందబీబీ పరుండియున్న గది కేగెను.

చాందబీబీయు నప్పుడే నిద్రనుండి లేచుచుండెను. ఆమె షాజిబీబీ దురవస్థను జూడగనే "అమ్మా? యే మిది? నీ వేల యిట్లు రోజుచున్నావు! నీత త్తరపాటునకుఁ గారణమే" మని యడిగెను. అంత షాజిబీబీ "ఆయ్యో! యిన్ని దినముల నుండియు

నల్లారుముద్దుగ నన్ను విడనాడక నాకుఁ దోడునీడ యైయున్న మిరన్‌బీ నెవ్వరో చోరు లపహరించుకొని పోయినారు. ఆమెను మంచముతోఁగూడ మన నగరునుండి దాటించినా "రనెను. అంతఁ చాందబీబీ, "అయ్యో! పాపము మిరన్‌బీ మొటట నాద్రోహుల వాతనుండి తప్పించుకొని నే నేమో శూరవనితనని నాయండ నుండ నామెకే యిట్టిదురవస్థ వాటిల్ల మనకెట్టి యిక్కట్లు గలుగ నున్నవో" యని చెప్పుచు మిక్కిలి చింతాక్రాంతయై షాజిబీబీ నూరార్చుచుండెను.

వీరిట్లు మాట్లాడు కొనుచున్న సమయముననే రాణిగారి మూడవమంత్రియైన యబ్దుల్‌రహిమానుఁ డచ్చటకివచ్చి "అమ్మా! రాత్రి మన నగరునందు దొంగలు జొరఁబడినట్లును, మిరన్ బీని గొనిపోయినట్లును ప్రజలెల్ల రనుకొనుచున్నారు. ఇదేమి విపరీత మని నేనిటకుఁ వచ్చితి జరిగిన సంగతి యే" మని యడిగెను. చాందబీబీ జరిగినవిషయము నంతయు రహిమానుకుఁ దెలియఁ బఱచెను. అంతరహిమాను "అమ్మా! మియర్‌మంజూ తన సేవకుల నంపి యామెను బట్టుకొని వచ్చునట్లాజ్ఞాపించియుండును. హజారమునఁ గావలిగాచు ముసలి పందలు వారికి సహాయ మొనర్చియుందురా" యని యడిగెను. అందులకు రాణి "వా రెందుకు సహాయ మొనర్తురు? వారు దేహముదెలియక నిద్రించు చుండినందుననే యింతపని జరిగినది. మిరణ్‌బీని తస్కరించిన దుర్మార్గు లింక నెంతపని జేయుదురో" అనెను. రహిమాను "అదియే నేనును జెప్పఁబోవుచుంటిని. మనమింక నెంతమాత్రము

జాగుచేయక యుద్ధమునకు సిద్ధపడవలయును. మఱియు మీయాజ్ఞయైనచో మిరజాబీని వెదకింప సేవకుల నిప్పుడే పంపవలయును. ఆమె యెచ్చట నున్నను బిలిచికొని వచ్చిన వారికిఁ గొప్ప బహుమాన మిప్పించెదను. శివనేరిదుర్గమునకు మిక్కిలి బలవంతులగు వారిలో నిద్దఱిని బంపుము. ఆమె శివనేరిదుర్గముననే యుండిన నామె మన కబ్బుట దుర్లభము. కాని యామె ప్రాణములతో నుండఁగలదు. మియర్ మంజూ ఆమెను బలవంతముగనైన వివాహమాడనెంచి యుండె నని యామె నాతోఁ జెప్పినది. కాన యుద్ధమాడి యామెను మనము గాపాడవచ్చును. ఆమె శివనేరిదుర్గములో లేక యింక నెచ్చట నుండినను ఆమె మనకుఁ జిక్కుననుటకు సందియము లే" దని చెప్పెను.

అంత రహిమానుఁడు పైఁజెప్పఁబడిన కార్యములను సమకూర్చుటకై తన తావునుండి లేచిపోయెను. షాజిబీబీయు మిరజాబీని దనవద్దఁ జేర్పగల మహానుభావుఁ డెవఁడో యని తలంచుచు దీనవదనయై చాందబీబీ వద్దనుండి లేచిపోయెను. చాందబీబీయు డోలాందోళితమానసయై ప్రాతఃకాల కృత్యముల నెరవేర్ప బయటి కరుదెంచెను.

## ఇరువదిరెండవ ప్రకరణము

మియర్ మంజూ తన సేవకుల కొసఁగిన వారమురోజుల గడువు సమీపించెను. అతని సేవకులు తమకు దారిలోఁ దటస్థిం

మంత్రులతోఁగూడ సభచేయుచు-హసన్‌మియ్యా వంకఁ జూచి "మిత్రమా! వారమురోజులు పూర్తికావచ్చినను మనసేవకులు చాందబీబీనిగాని, ముస్తుఫానుగాని పట్టుకొనివచ్చు సమాచార మింకను దెలియరాలేదు. ఈతూరియైన నాసేవకులు కార్యమును జక్క పెట్టిన నేచిక్కును లేక రాజ్యము మనవశముగాఁగల" దనెను. అంత హసన్‌మియ్యా "మిత్రమా! ముస్తుఫా చిక్కుట దుర్లభము. అతఁడు బీజపురమునకు వెళ్ళియుండును. చాందబీబీని బట్టుకొనుటయుఁ గష్టమే కాని యామె నిద్రించి యుండుతఱి నామెను నపహరింప వారికి యనుజ్ఞ నిచ్చి యుండుటచే నీకార్యమును వారు నెరవేర్పఁగలరనియే నాయభిప్రాయ" మనెను.

ఇంతలో నహమ్మదునగరమునకుఁ బోయిన సేవకులరుదెంచుచున్నారన్న సంగతి మియర్‌మంజూకుఁ దెలియవచ్చెను. పిమ్మటఁ బదినిమిషముల కాలములోనే హస్తములు నఱుకఁబడి నట్టియు, గాయములచే బాధపడునట్టియు నలుగురు సేవకులు మియర్‌మంజూ ఎదుట నిల్చిరి. వీరిని జూడగనే వారి నాయకునకుఁ గోపము మిక్కుటముకాఁగా నాతఁడు వారిమీఁదికి హుమ్మని దుమికి "ఓరీ! మిమ్ములఁ జూడఁగనే కార్యభంగమైనదని తెలియవచ్చెను. తక్కిన యిద్దఱుచండాలు రెచ్చట నున్నారు? మిమ్ములనందఱి నాఖడ్గమున కిప్పుడే బలి యొసంగెద" నని సింగమువలె గర్జించెను. అంత నాసేవకులలో నొకఁడు "అయ్యా! నేను చెప్పుమాటను గొంచె మాలకించి పిమ్మట మమ్ములనందఱను జంపుడు. మేమందరము మీయాజ్ఞ

చొప్పున నహమ్మదు నగరమున కేఁగి నగరున బ్రవేశించి షాజిబీబీ యతఃపురముఁ జొచ్చి ముస్తుఫా కౌఅన్నై నలుప్రక్కలను గలయఁజూచితిమి. ముస్తుఫా యచ్చటలేదు. చాందబీబీ యచ్చటనే శయనించియుండ నామెను మంచముతోఁగూడ నెత్తుకొని బయటికివచ్చి యటనుండక మాదారిఁ బట్టితిమి. త్రోవలో నెవరో యొకఫకీరును మఱియొక యువకుఁడును నామెను రక్షింప నెంచి మంచమును మోసుకొని వచ్చుచున్నవారిలో నిద్దఱి చేతులను నఱికెను. పిదప మంచముక్రిందఁ బడగా మిగిలిన యిద్దఱును మేమును వారిపైబడికి వారితోఁ బోరితిమి. అంత వారు మాలో నిద్దఱను జంపిరి. పిదపఁ బ్రాణములపై నాశగొని పరుగెత్తి వచ్చితిమి. ఇఁక మీ యిష్టమువచ్చినట్లు చేయుఁ" డనెను.

ఈమాటలను వినిన తోడనే మియర్ మంజూరు గోపాన లముచే దేహము మండుకొని పోవఁజొచ్చెను. ఆమంటచేఁ దన దేహము దెలియక "ఓరీ! మీనలుగురు నాయిద్దఱ నీచులతోఁ బోరలేక చేతికి దొరకిన చాందబీబీని నిష్కారణముగ వదలి పెట్టితి" రనుచుఁ దనకత్తితో నాయిద్దఱుకరతలలను నఱికివేసెను. వీరిద్దఱు హస్తవిహీనులగుటచేఁ వీరిపోక కెవ్వరును దుఃఖింప లేదుగాని గాయపడిన మఱియిద్దఱిని గూడ నుఱితీయ వలసి నట్లాతఁ డాజ్ఞాపించుటచేఁ వారిచావునకు బ్రధానులందఱు దుఃఖించిరి.

మియర్‌మంజూ ధరించియుండు నుడుపులును సభా మండపమును రక్తసిక్తమై ముందు జరుగఁబోవు ఘోరసంగ్రామమును సూచించుచుండెను. మియర్‌మంజూకుఁ గొంత కోపము తగ్గినది. పిమ్మట నతఁడు ప్రధానులవంకఁ జూచి "ప్రధానులారా! మన మేకార్యముఁ జేయఁబూనుకొన్నను నది చక్కఁగ నెర వేఱుటలేదు. ఇంక యుద్ధమే కర్తవ్యము. అక్బరుచేఁ బంపఁ బడిన సేన మురాదు నాధిపత్యముక్రింద వచ్చుచున్నదనియు మన గ్రామమునకు రెండామడల దూరమున నున్నదనియు, నిన్ననే మనకు వర్తమానము వచ్చినది. కాన మీరు మీ సేనలను సిద్ధపఱచుకొని యుండవలయును. (హసన్‌మియ్యావంకఁజూచి) "మిత్రమా. మురాదు సేనతో విడియుటకుఁ గొన్ని డేరాల నాటించితివా?" యని యడిగెను. అందులకు హసన్ "మన గ్రామమువద్ద సేనయంతయు విడియుటకుఁ దగిన ప్రదేశంబు లేకపోవుటచే గ్రామమున కుత్తరపు భాగమున రెండుక్రోసుల దూరములోనున్న బయలునందు డేరాల నాటించితి. వారికిఁ గావలసిన భోజనపదార్థముల నన్నిఁటిని జేర్పించితి. ఇంకను దగు యత్నములఁ జేయఁవలయు" ననుచుఁ దన తావునుండి లేచి పోయెను. ప్రధానులును నియమితకార్యముల నొనర్ప వారి వారి ప్రదేశంబులకుఁ బోయిరి.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

పై ప్రకరణమునఁ జెప్పఁబడిన విషయములు జరిగిన మరుసటిదినమే యహమ్మదునగరమునుండి శివనేరికిఁ బోవు

రస్తాలో మన ఫకీరు ప్రయాణము జేయుచుండెను. అప్పటికి దాదాపుగ రెండుగడియల ప్రొద్దెక్కినది. నడుచుచుండిన ఫకీరప్లే నిలిచి తూర్పుదిక్కున దేనినో పరికించి చూచుచుండెను. దిన కరుఁడు నైతం మగుపడకుండ నాదిక్కున నెఱ్ఱని కావు క్రమ్మి యుండెను. మొదట నాఫకీరది మేఘమని భ్రమపడెను గాని కొలది కాలములో నది సమసిపోవుటచే నచ్చట మిక్కుటముగ దుమ్ము రేఁగియుండిన ట్లాతఁ డూహించెను. మరల నొక కర గంట కతనికి సమీపముననే ధూళి రేఁగుటచే నతఁ డప్పుడు దానిని బాగుగఁ జూచుచుండెను. పిమ్మటఁ గొండలోయన నొప్పు కొన్ని యేనుఁగు లాతని కంటఁ బడెను. ఎద్దియో గొప్ప సైన్యము వచ్చుచున్నదని యాతఁ డటుండక యతనికి రెండు ఫర్లాంగుల దూరములో నున్న యొక వృక్షము నధిరోహించి యందు గుబురు కొన్న కొమ్మలలో దాఁగి యుండెను.

సైన్యము సమీపించెను. అక్బరుచక్రవర్తిగారిచేఁ బంపఁ బడిన సైన్య మదే యని యతనికిఁ దెలియవచ్చుటచేఁ దాఁజేయఁ దలఁచుకొనిన కార్యము లన్నియు నెప్పుడునెరవేఱునా యని యతఁ డాలోచించుచు సేననంతను బాగుగఁ బరిశీలించి చూచుచుండెను.

ఈ సేనకు ముందుభాగమున నేఁబదియేనుఁగులు వరుసకుఁ బదివంతున నైదువరుసలుగఁ బోవుచుండెను. వీటివెనుక నైదు వందల యాశ్వికులు బోవుచుండిరి. వీరివెనుక మురాదు సర్వాలం కృతంబైన యొక దిగ్గజము నధిరోహించి దండనాయకులు, మంత్రి, సామంతప్రముఖు లిరుపార్శ్వములఁ గొలువ మహావైభ

వముతోఁ గదలి పోవుచుండెను. వీరి వెనుక నేనుఁగులచే నీడ్వఁ బడుచున్న కొన్ని ఫిరంగుల బండ్లును, దుపాసుల చేతను, మందు గుండ్లు మొదలగు యుద్ధపరికరములచే నిండిన మఱికొన్ని బండ్లును బోవుచుండెను. వీటికిఁ బిరుందఁ బదివేల కాల్బలము హుటాహుటిగ నడుచుచుండెను. వారి వెనుకఁ గొన్ని యొంటెలు సైన్యమునకు భోజనపదార్థములను, మైనపు డేరాగుడ్డలను, గూటములను, బగ్గములను మోసికొని పోవుచు మురాదు సేనలకు నదియే యంత్యమని తెలియఁజేయు చుండినవి.

వృక్షముమీద నున్న ఫకీరు సైన్యాడంబరమును, యోధవరుల బాహుబలమును, వారి ధైర్యమును జూచి విభ్రమము నొందెను. ఈ సైన్యమంతయు శివనేరిదుర్గమును గూర్చి పోవుటచే నాదుర్గమునకుఁ రెండు క్రోసుల దూరమున మియర్ మంజూ ఇదివఱకే నాటించియుండిన డేరాలలో నీసైన్యమంతయుఁ జేరునని ఫకీరనుకొనెను. సైన్యమంతయుఁ నతఁడెక్కియున్న వృక్షమును దాటి రెండు ఫర్లాంగుల దూరము పోయిన వెనుక ఫకీరు చెట్టునుండి దిగి తన స్థానమును జేరుటకు వడివడిగ నడుచుచుండెను.

ఒక గంటకాలములోనే ఫకీరొక పర్వతము క్రిందఁ బోవుచుండెను. ఈతఁ డట్లు సాగిపోఁగా నాదారి రెండుచిన్న గుట్టలకు మధ్య నుండు నొకలోయలోనికిఁ బోయెను. అతఁ డాదారిన కొంతదూరము పోయి రెల్లుతోఁ గప్పఁబడిన యొక కుటీరము లోనికిఁ జొచ్చెను. అతఁడు లోపలఁ బ్రవేశించిన క్షణమునకే

యొక వృద్ధాంగనయు, మఱియొక జవ్వనియు నాతనికిఁ గొన్ని యుపచారములు లొనర్చిరి. పిదప నతఁ డొక దర్భాసనముపైఁ గూర్చుండి సమీపమున నున్న వృద్ధాంగనతో మాటాడఁ దొడఁగెను.

ఫకీరు:—రామాంబగారూ! మాలోజి నేడే మింకను రాలేదు? ఈ దినముననే గదా యతఁడు వచ్చునట్లు మొన్న చెప్పి పోయినది!

రామాంబ:—అవును. అతఁ డింకఁ గొంతసేపటికైన రాఁగలఁడు. మఱియు మిరజాబీ యహమ్మదునగరమునకుఁబోవలయు నని యున్నది. ఎప్పుడుపోయెదరు?

ఫకీరు:—ఎప్పుడో యననేల? రేపుదయమునైన బయలుదేరి పోవలయును. లేనిచో తప్పక ముప్పువచ్చును.

ఇంతలో మాలోజి యచ్చటి కరుదెంచెను. ఫకీ రాతనిని జూచి "నాయనా! నీవుపోయి కార్యమును సమకూర్చుకొని వచ్చితివా?" యనెను. అందులకు మాలోజి "కార్యమును జక్కఁబెట్టుకొనియే యిటు వచ్చితిని. లుఖాజీజాధవరావును గలసికొంటిని. అతనికిఁ గల సైన్యమునంతయు వెంటఁబెట్టుకొని రెండురోజులలో నహమ్మదునగరమును జేరునట్లు చెప్పినాఁడు. ఇంతకుమునుపు నీవు మనకు ముప్పు వచ్చుననుచుంటివే యేమి? నేను దానిని సమగ్రముగ విననైతి" ననెను. ఫకీరు "అయ్యా! నేను రాత్రి నాలుగుగంట లప్పుడే లేచి జున్నరుకుఁ బోవలయు నని ప్రయాణ మైతిని. పోవుచుండగా సూర్యోదయ మగుసరికి దారిలో నక్బరుచేఁ

బంపఁబడిన సేన మురాదు సాధిపత్యముక్రింద వచ్చుచుండెను. వెంటనే మనమిఁక జాగుచేసిన ప్రయోజనము లేదని మరల నిటు వచ్చితి అహమ్మదునగరమునకుఁ రేఁపుదయమున సైనను మనము బయలు దేరవలయు " ననెను.

మాలోజి:—— ఇఁక మన మాలస్యముజేసిన మనకు దప్పక కీడు గలుగును. మిరజాబీతోఁగూడ రామాంబను సైత మహమ్మదు నగరమునకుఁ గొనిపోవుద " మనెను.

రామాంబ:——మిరజాబీ నాచెంతఁజేరి యొక వారము రోజులు మాత్రమే యైనను నాకెకు నాపై నెక్కుడుగఁ బ్రేమ జనించినది. నన్నామె యహమ్మదు నగరమునకుఁ గొంపోయి గొప్పబహుమాన మిప్పించ వలయునని చెప్పినది. నాయనా ఫకీరూ ! ఈమె చాందబీబీగారి మనుమరాలని నాకు మొన్ననే తెలియవచ్చినది. పాప మామె కెంతకష్టము వచ్చినదిరా ! యనెను.

ఈ మాటలకుఁ బకీరు నవ్వెను. అతఁడుగాని మాలోజిగాని మియర్ బీయే ముస్తుఫాయని రామాంబకుఁ దెలియఁ బఱచలేదు. కొంతసేపటికిఁ బకీరు తన స్థానమునుండి లేచి, ప్రయాణ సన్నాహమును జేయఁబోయెను. రామాంబయును వారికందరికిని గావలసిన భోజనపదార్థములను సిద్ధముచేయుటకై వెళ్ళెను. మిరజాబీయును దా నహమ్మదునగరమునకు రేపే పోవచ్చునని సంతోషపడుచుండెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము.

మిరజాబీని వెదకుటకుఁబోయిన సేవకులందఱు వచ్చి యామె యెచ్చటను నగపడలేదని చాందబీబీకిఁ జెప్పిరి. షాజిబీబీ యీమాటను విన్నతోడనే యామెకు గుండె నీరై పోయెను. ఇప్పు డామెకు దుఃఖము మఱింతవృద్ధి యగుటచే వేళకు నన్నపానము లనుగూడఁ దీసికొనుట మానివేసెను. చాలదినముల నుండియుఁ జింతనే వహించియున్న చాందబీబీ యిప్పుడు షాజిబీబీకొఱకుఁ గూడ జింతింపవలసివచ్చెను. ఢిల్లీసైన్య మెప్పుడెప్పు డహమ్మదు నగరముపైఁ బడునోయని యామెకుఁ బెల్లుభయము మఱియొక వంకఁ జనించుచుండెను. ప్రధానమంత్రియైన మాలికాంబ రామెను గాపాడినపిమ్మట నామె కగుపడక యుండెను.

ఇట్టి దురవస్థలోఁ చాందబీబీ సింహాసనమునఁ గూర్చుండి యుండెను. షాజిబీబీ దీనవదనయై యామెప్రక్కన గూర్చుండి యుండెను. షాజిబీబీ "అమ్మా! మిరన్‌బీని వెతికించుటకై మరలఁ గొంతమందిని సేవకుల నంపు" మనెను. అంతఁ చాంద బీబీ "వెతికింపవలసిన చోటులనెల్ల వెతికించితిని. మిరన్‌బీ యగుపడలేదు. దీనికి నేనేమిచేయఁ గల" ననెను.

ఇంతలో హుసేనుమీర్జాయును, అబ్దుల్ రహిమానుఁడును, నచ్చటికివచ్చి వారికిఁగా నియమింపఁబడిన యాసనములపైఁ గూరుచుండిరి. అంత రాణిగారు తన ప్రధానులవంకఁ జూచి "ప్రధానులారా! మిరజాబీ పోకకు షాజి మిగుల దుఃఖించు

చున్నది. శివనేరిదుర్గమునఁగూడ మిరన్‌బీలేదట " యనిచెప్పెను. హుసేనుమీర్జా యామెనుజూచి " అమ్మా ! ఆ దుర్మార్గులు దప్ప మఱెవ్వ రామెను దొంగిలించుకొని వెళ్లుదురు ? మిరన్‌బీ శివనేరి దుర్గముననే తప్పకయుండును. మీచేఁ బంపఁబడిన సేవకులక్క డకిఁ బోయిరో లేదో ! విశ్వాసార్హులగు వారును, బ్రాణములను దప్పించుకొని రాఁగలుగునట్టివారును నగుశూరుల నిద్దఱశివనేరికిఁ బంపవలయును. మీరు దానికై యింత చింతతో నుండ నవసరములే " దనెను. అంతఁ చాందబీబీ " నేను నట్లే తలంచు చున్నాను. ( ఏదో శబ్దమును విని ) హజారమువద్ద జనసమ్మర్ద ముగ నున్నది, వా రెందు కట్టు లూరక యఱచుచున్నా " రనెను.

ఇంతలో నొకసేవకుఁ డచ్చటికిఁ బరుగెత్తుకొనివచ్చి " వచ్చె వచ్చె మిరన్‌బీ వచ్చె " నని చెప్పెను. ఈ మాట షాజి బీబీ చెవిలోఁబడినదో లేదో వెంటనే యామెకుఁ బ్రాణములు లేచి వచ్చినవి. చాందబీబీయు మిక్కిలి సంతసించెను. సభవారందఱు మిరన్‌బీ రాకకు నిరీక్షించుచుండిరి. వెంటనే వారికిఁ ఫకీరు సాక్షా త్కరించెను. ఇతనిఁ జూడగనే షాజిబీబీ చాందబీబీ లాశ్చర్య మగ్న మానసులై యతనికి వందనశతంబు లర్పించిరి. ఫకీరునకు వెనుకనే మిరన్‌బీయును, నామెవెనుక రామాంబయును, నామె ననుసరించి మాలోజీభాన్సులేయును వచ్చుచుండిరి. పిమ్మట వీరందఱు చాందబీబీ గూర్చుండియున్న సింహాసనమును సమీపించిరి. వెంటనే షాజిబీబీయును చాందబీబీయును మిరన్‌బీని కౌఁగిలించుకొనిరి.

మాలికాంబరే ఫకీరు వేషమును ధరించియున్న సంగతి హుసేనుమీర్జాకుఁదప్ప తక్కువవారి కెవ్వరికిని దెలియదు. మాలికాంబరుని యాజ్ఞ యగుటవఱకు నీరహస్యమును వెలిపుచ్చకుండునట్లాతఁడు ప్రమాణము జేసి యుండుటచే నిప్పటివఱకును హుసేనుమీర్జా యీ సంగతి రాణికిఁ దెలియబఱచలేదు. అందుచేఁ జాందబీబీ ఫకీరువంకఁజూచి "మహానుభావా! మీరెవరో నాకుఁ దెలియదు. మాషాజిబీబీ పాలిటి భాగ్యదేవతయే యీరూపమును ధరించి యిచ్చటికి వచ్చినదని తలంచెదను. లేనిచో షాజిబీబీయు నిఁక రెండురోజులలోఁ బ్రాణములను విడిచియుండును. ఈ సహాయ మొనర్చినందులకు మీరు కోరుబహుమాన మొసఁగ సిద్ధముగనున్నా" ననెను. అందులకు ఫకీరు "అమ్మా! మీకటాక్షము నాపైఁ బూర్ణముగనున్నఁ జాలును. నాచెంతనుండు నీమాలోజియు, రామాంబయును మిరజాబీని గాపాడినవారలు. వారు నాకీవలనే పరిచయులైరి. నే నీమిరజాబీ ప్రాణములను రక్షించి వీరిచెంత నిలిపి నాచోటునకు వెళ్ళితిని. ఇంతవఱకును వీరామెను గాపాడుచుండిరి. రామాంబను మీరు ముందుగ గౌరవింపవలయు" ననెను. అంత సభలోని వారందఱు రామాంబ దట్టుఁ జూడ్కి నిగిడించి పరమానందభరితులైరి. చాందబీబీ రామాంబను దన ప్రక్కనే కూర్చుండఁ బెట్టుకొనెను. అంతఁ ఫకీరు చాందబీబీవంకఁజూచి "అమ్మా! వీరినిఁ బిల్చుకొని వచ్చుటకై నిన్నటిదినము వీరున్న తావునకుఁ బ్రయాణమై పోవుచుంటిని. అప్పుడు శివనేరిదుర్గమువైపుఁ గొంతసైన్యము నడచు

చుండెను. అది ఢిల్లీచక్రవర్తిచేఁ బంపఁబడిన సేనయనియు, మిమ్ము నతి జాగరూకతతో యుద్ధసన్నాహములను జేయవలసి నట్లును, త్రోవలో నాకగుపడిన మాలికాంబరు నుడివె " నని చెప్పెను.

అందులకుఁ చాందబీబీ " మహానుభావా! నిన్నేమని పొగడఁగలను ? ముఖ్యమైన వార్తను నాచెవిలో వేసితివి. ఇన్ని దినముల నుండియునాకు గోచరింపని మాలికాంబరు మీ కగ పడెనా ? అతఁ డిక్కడి కెప్పుడు వచ్చును ? " అనియెను. దానిని విన్నఫకీరు " అమ్మా! రేపుమధ్యాహ్నమున కిచటికిఁరాఁగలఁడు. మఱియు నతఁడు మీరాజకార్యములను జక్కఁబెట్టుటకు వేఱొక ప్రదేశమునకుఁ బోవుచుంటి నని చెప్పెను. విశేషములన్నియు మీకు రేపే తెలియఁగల " వనెను.

చాంద:—స్వామీ! నాకుడిభుజమగు మాలికాంబరుని సహాయముచే నిఁక నాదుర్మార్గుఁడగు మియర్‌మంజూ నోడించి బహదరును గాపాడఁగలను.

ఫకీరు:—( షాజిబీబీవంకఁ జూచి ) అమ్మా. నేఁడు మొదలు నీ దుఃఖము తీరినదని తలఁచెద.

షాజి:—స్వామీ! నాదుఃఖము గొంత యుపశమనము గాఁగలదు. నిశ్శేషముగఁ బోఁగలదని నే నెట్లు చెప్పఁగలను ?

ఫకీరు:—రేపు మధ్యాహ్నమున కది నిశ్శేషముగఁ బోవునని నేను దృఢముగఁ జెప్పగలను. నీమనస్సులోని కోరిక నెరవేఱు సమయము వచ్చును.

షాజి:—కరుణాసముద్రా ! రేపుమధ్యాహ్నమునకే నాకోరిక యెట్లు నెరవేఱఁగలదు. అట్లగునని నాకుఁదోఁపలేదు. నాప్రియుఁడిచ్చటి కరుదెంచినగదా నా సంకల్పము సిద్ధించుట.

ఫకీరు:—అమ్మా ! మీరు దానికై చింతింప నవసరములేదు. కానున్న కార్యములు కాకమానవుగదా ?

ఇట్లు చెప్పుచుఁ ఫకీరదృశ్యుఁ డయ్యెను.

## ఇరువదియైదవ ప్రకరణము.

ఫకీరు నుడివిన సంగతులను విన్నదిమొదలు షాజిబీబీ యెప్పుడెప్పుడు తెల్లవాఱునా యని వేచియుండెను. కాని యాతఁడు చెప్పిన మాటలయం దించుకైన నమ్మక మామెకు జనింపలేదు. ముస్తుఫా బీజపురమునుండి యొక దినములో నెట్లు రాఁగలఁ డని యామె తలంచెను.

మఱునాడు తెల్లవాఱీ షాజిబీబీ పడకనుండి లేచి " ముస్తుఫా నేటికి వచ్చియుండునా ? " యని తనవద్దనున్న మిరన్‌బీ నడిగెను. షాజిబీబీ యెంతయాతురతతో నున్నదో మిరన్‌బీయును నంత వేగిరపడుచుండుటచే " ముస్తుఫా వచ్చియేయుండు " నని చెప్పెను. అంత షాజి " చెలీ ! నీవు తెలిసిన దానివలె వచ్చి యుండునని చెప్పుచున్నావు ? నీకెట్లుతెలియు " ననెను. అందులకు మిరన్ " నేనును నీవలెనే యూహచేసి చెప్పుచున్నాను గాని వేఱుగా " దనెను.

పిదప వారు ప్రాతఃకాలకృత్యముల నెరవేర్చి భోజనశాల కరుదెంచిరి. వారు భుజించినపిదపఁ గొంతకాల మేవో మాట్లాడు కొనుచుఁ బ్రొద్దు పుచ్చుకొనుచుండిరి. పిదప వారొక గంటకాలము నకు రాణిగారి యంతఃపురమునకు వెళ్లిరి. చాందబీబీయుఁ దన సింహాసనమునఁ గూర్చుండియుండెను. షాజిబీబీయు మిరన్ బీ యును నామెకుఁ బ్రక్కగనే గూరుచుండి ముందుదినమున జరిగిన విషయములను గూర్చి ముచ్చటించుకొనుచుండిరి.

ఇప్పటికి దాదాపుగఁ బండ్రెండుగంటల ప్రొద్దయినది. చాందబీబీ ఫకీరుకొఱకును, మాలికాంబరుకొరకును నిరీక్షించు చుండెను. షాజిబీబీ ముస్తుఫాకొఱకును, ఫకీరురాకకును వేచి యుండెను. మిరన్ బీ ఫకీరుకొఱకే కనిపెట్టియుండెను. ఎవరి కార్యములు వారు సమకూర్చుకొన నెంచుచుందురుకదా !

ఇంతలో నచ్చటఁ బకీరు సాక్షాత్కరించెను. వారు ముప్వు రును దమ యాసనములనుండి లేచి యతనిని బిలిచికొనివచ్చి యుచితాసనాసీనునిగఁ జేసిరి. వెంటనే చాందబీబీ "స్వామీ ! మీరు చెప్పినట్లు మాలికాంబరింకను రాలేదు. కారణ మేమై యుండునో" యనెను." ఆతఁ డిప్పుడే వచ్చి మిమ్ములఁ దర్శింపఁ గలఁ" డని ఫకీరు ప్రత్యుత్తర మొసంగెను. షాజిబీబీ "స్వామీ! నాకోరిక సఫలముఁ జేయు సమయము ఘటస్థించెనా" యని యడి గెను. "మీ రొక గంటకాలము వేచియుండవలయును" నని యతఁడు బదులుచెప్పెను. అంతఁ జాందబీబీ "అయ్యా !

ముస్తుఫా ఇప్పు డెచ్చటనుండి రాఁగలఁడు ? మీచర్యలన్నియుఁ గడు చోద్యములుగ నున్న" వనెను. అందులకుఁ ఫకీరు "అంతయు మీకే విశదము కాఁగల" దనెను.

ఇంతలోఁ బ్రధానులును, దండనాయకులును సభకు విచ్చేసిరి. షాజిబీబీయు మిరజాబీయును రాణివద్ద సెలవు పుచ్చుకొని తమ యంతఃపురమునకు వెళ్ళిరి. దండనాయకు లందఱు బారులుదీరి రాణియెదుట నిలువఁబడియుండిరి. అంత చాందబీబీ ప్రధానులవంకఁ జూచి "ప్రధానులారా ! మీరందఱు మీమీ సేనలను సిద్ధముజేసి యెప్పుడు కావలయునన్నను నావద్ద హాజరు పఱుపవలయును. మొగలాయి సైన్యము శివనేరిదుర్గముకడఁ దిగియున్నదఁట ! మాలికాంబరుగూడ నేఁడే వచ్చి మనలను గలిసికొనును. చాలాకాలము క్రిందటఁ బరదేశమున కరిగియున్న ప్రధాన సేనానాయకుని దర్శించి నేఁడు మొదలు మీరంద ఱాతని యాధిపత్యముక్రింద నుండవలయును. ఈ సమాచార మంతయు నిచ్చట విచ్చేసియున్న మహామహుఁడగు నీ ఫకీరు వలనఁ దెలిసికొంటి" నని యాతని కొంఱకై సభనంతయు గలయఁ జూచెను. ఫకీరు రాణి కెందు నగపడలేదు. చాందబీబీ విభ్రమముఁ జెందినది. ఆశ్చర్యము భయము నొక్కసారిగ నామె నావరించుకొనెను. అంత రాణి "రహిమానూ ! ఇప్పుడిచ్చటనే యున్న ఫకీరును నీవుచూడలేదా ? అతఁ డెచ్చటికి లేచిపోయెను." "అమ్మా ! నాకుఁ దెలియదు. మీరు మాతో మాటలాడుచుండ

సందఱము మీవంకఁ జూచుచుంటిమి. అతఁ డిచటనుండి లేచి పోయిన సంగతికూడ నాకుఁ దెలియ" దని యతఁ డనెను. ఇతర యోధవరులు సహిత మా మాటనే చెప్పిరి.

ఏమియుఁ దోఁచక వీరిట్లు మాట్లాడుకొనుచున్న సమయముననే మాలికాంబయును, ముస్తుఫాయును సున్నట్లుండి యా సభలోని కరుదెంచిరి. చాందబీబీ యొక్కయు ప్రధానుల యొక్కయు విస్మయము వర్ణనాతీతమయ్యెను. చాందబీబీ పుర కాంకిత శరీరయయ్యెను. ఆనందోద్రేకముచే నామె కొంత సేపు దేహము తెలియక మాటాడకుండెను. అంతఁ గొంత వడికిఁ చాందబీబీ ముస్తుఫా మాలికాంబలను విశేషముగ గౌరవించి తన సింహాసనమునకుఁ బ్రక్కగనే వారి నిద్దఱిని గూర్చుండఁ బెట్టుకొనెను. ముస్తుఫా యొక్కయు నతని బంధువుల యొక్కయు క్షేమములు విచారింపఁ బడినవి. పిమ్మట రాణి మాలికాంబను కుశలముల నడుగుచు "నాయనా! యిప్పుడొక ఫకీ రిచటికి వచ్చియుండెను. అతనిని మీరు చూచితిరా? సభలో నున్నవాఁ డెచ్చట నగపడలేదు. మిమ్ముల నెదుర్కొన మీ వద్దకు వచ్చెనా?" యని యడిగెను. అందులకు మాలికాంబ రించుక సే పూరకుండి చిఱునవ్వునవ్వి తన తావునుండి లేచి రాణివంకను నితర ప్రధానుల వంకను జూచి యిట్లనియె.

"సభ్యులారా! మీ యెదుట నిప్పుడు నిలిచియున్న యీ మాలికాంబరే యిన్నిదినములనుండియుఁ బకీరువేషమును ధరించి యుండెను. మొదట నేను బహాదరును గాపాడి, నాసహా

చరుఁడైన మాలోజివశముఁజేసి యిచ్చటి కంపితిని. పిమ్మట
రాణికే ముప్పుకలుగఁ బోవునపు డచ్చటి కరుదెంచి యామెను
రక్షించితిని. మరల ముస్తుఫా షాజిని దర్శింప నిచటికి వచ్చు
చుండ మియర్ మంజూ అతనిని జెఱఁబెట్టి నచటికి వెళ్ళి ముస్తు
ఫాను రక్షించి యతనిని గొన్ని రోజులు స్త్రీ రూపమున నుండ
నియమించి యహమ్మదు నగరమున కంపితి. పిదప నా దుర్మార్గు
లాతని మరలఁ దస్కరించుకొని శివనేరికి వెళ్లుచుండ వారినిఁ
బొలియించి ముస్తుఫాను గాపాడితి. ఇప్పుడు మీయెదుటఁ
గూర్చుండి యున్న నీకూరుఁడగు ముస్తుఫాయే యిన్నిదినముల
నుండియు రాణిగారి నగరిలో మిరన్ బీయను నామమును
వహించి మెలఁగుచుండెను. మఱియు నిప్పుడు మొగలాయి
సైన్య మహమ్మదు నగరమును సమీపించుచుండుటచే యుద్ధ
సన్నాహ మొనర్చుటకు నేనా ఫకీరువేషమును వదలి రాణిగారిని
దర్శించితి" నని చెప్పి యిదివఱలోఁ దానుసు ముస్తుఫాయును
ధరించియుండిన యుడుపులను వారికిఁజూపెను. అచ్చటనున్న
వారందఱును మిక్కిలి యాశ్చర్యమును జెందిరి. చాందబీబీ
మాలికాంబరానర్చిన యద్భుత కృత్యముల కాతని నెంతయుఁ
గొనియాడి ప్రధానులవంకఁ జూచి "ప్రధానులారా! అక్బరుచేఁ
బంపఁబడిన సైన్యమంతయు నతని పుత్రుఁడైన మురాదు
నాధిపత్యమునవచ్చి మియర్ మంజూ సేనతోఁ గలిసి శివనేరి
సమీపమున నున్నదఁట. ఆ సైన్యమంతయు నొకవారములోఁజు
లలో నహమ్మదు నగరముపైఁ బడనున్నదని నేఁడే వార్త

వచ్చినది. మీరందఱు మీసేనానాయకులను దీసికొని రేపు సభ కరుదేరవలయును. మఱియు నీపట్టణములోని యశేషజనులును రేపు సభకు రావలసిన ట్లాజ్ఞాపింపవలయు " నని చెప్పెను. అందులకుఁ బ్రధానులందఱు సమ్మతించి యామెయొద్ద సెలవు పుచ్చుకొని వారి ప్రదేశంబుల కరిగిరి. మాలికాంబ రొాసర్చిన యద్భుతకృత్యములకుఁ గడు విస్మయ మొందుచుఁ చాందబీబీ మాలికాంబరుసు వెంటఁబెట్టుకొని ముస్తుఫాను షాజిబీబీకిఁ జూపుటకై యామె యంతఃపురమునకు వెళ్లెను.

## ఇరువదియాఱవ ప్రకరణము.

మఱునాడు సూర్యోదయ మగునప్పటి కహమ్మదునగర మంతయు మిక్కిలి జనసమ్మర్దముగ నుండెను. ప్రధానులు, సైనికులు, సేనానాయకులును బట్టణములోని ధనవంతులందఱును రాణిగారి నగరునకు నడుచుచుండిరి. పదిగంటల ప్రొద్దగునప్పటికి రాణిగారి సభామండప మంతయు వేనవేలు జనులతో నియమిత కాలమునకుఁ బూర్వమే నిండియుండెను.

సభామండప మంతయుఁ జక్కగ నలంకరింపఁబడి యుండెను. మండపము స్తంభము లన్నియు ననల్పశిల్ప చాతుర్యమునఁ బెంపెసలారుచుండెను. దిగువ రత్నకంబళ మొకటి పరువఁబడియుండెను. సభ్యులందఱు నుచితస్థానములలోఁ గూర్చుండియుండిరి. చాందబీబీ రత్నఖచిత సింహాసనాసీనయై యుండెను. ఈమెకుఁ దూర్పుభాగమున నామె సమీపబంధువులును,

వారికిఁ బ్రక్కగఁ దన ప్రధానమంత్రులును, వారికిముందు భాగమున మాలికాంబరు, మాలోజీ ఖానులేయును, వీరికిఁ బిరుంద నితరయోధవరులును, వీరి వెనుక వీరులును బౌరులును నిల్చియుండిరి. బహిఃప్రదేశమున నాశ్వికులు తమ బలగముతో సంక్షోభ మేమియుఁ గలుగకుండఁ గావలి గాచుచుండిరి.

అంతఁ చాందబీబీ తన తావునుండి లేచి సభ్యుల నవలోకించి "సభ్యులారా! మిమ్మనందఱిని నేఁడు నాసభకుఁ పిలిపించినందులకుఁ గారణము మీకు దెలిసియే యుండును. అయినను నేను మీకుఁ గొంత తెలుపనెంచి యున్నాను. ఇప్పుడు మన యహమ్మదునగర రాజ్యములో ననేక దుర్మార్గులు ప్రబలి యీరాజ్యము నాశనమొనరింప సమకట్టి యున్నారు. వారిలో ముఖ్యుఁడు మియర్‌మంజూ అని మీకెల్లరకును విదితమే. తర తరములనుండియు నీపట్టణము నేలుచుండిన నైజాంషాహీ వారి వంశమును నాశన మొనర్పనెంచి యీ దుర్మార్గుఁ డెవనినో యొక యుథముని నైజాంషాహీ వంశములోని వాఁడనియు, వానికే మిక్కిలి హక్కుగలదనియుఁ బ్రకటించి పరరాజగు నక్బరు చక్రవర్తిని సహాయమునకుఁ బిల్చినాఁడట. సభ్యులారా! జయ చంద్రుఁడైకమత్యములేక పృథ్వీరాజుపైఁ గక్షవహించి, మహ మ్మదు గోరీని సహాయమునకుఁ బిలిచి యేమిలాభమును బొందెను? అట్లే యైకమత్యము లేక నాపైఁ గక్షవహించియున్న మియర్‌మంజూ నాశము కాఁగలడు. మీ రెంతమాత్రము భయ పడవలదు. మనరాజ్య మెప్పటికి నాశనము కానేరదు. నాకంత

మునఁ బ్రాణ ముండునంతవఱకును, నైజాంషాహీ వంశపువారి రక్తము నానరములలోఁ బ్రవహించుచున్నంత కాలమును నేను ధైర్యమును వీడను. మొగలాయి సైన్యమును జించి చెండాడుటకు నేను సిద్ధముగ నున్నాను. మీరు మీ ప్రాణములపై నించుకైన నాశఁగొనక మీశక్తికొలఁదిఁ బోరాడి మీరాజభక్తిని వెదజల్లుఁడు. జీవకోటులకు జన్మము గలిగినప్పుడే మరణమున కొక్కప్పుడు లోఁబడవలసి యున్నది. అది విధాయకమైయున్నది. మనము నొకప్పుడు దేహవియోగమును బొందగలవారమే. అప్పుడుపుట్టిన పసికూనలను భూమి కర్పించి యముని యాజ్ఞకు లోఁబడినవా రెంటఱున్నారు ? ఇదంతయు భగవన్మాయ. మీరందఱు మీశక్తికొలఁదిఁ బోరాడి మీశౌర్యమును జూప సమయము దటస్థించినది. యుద్ధముఁజేయలేని వారంద ఱిచ్చటనే యాఁగిపొండు. వారిని నేను బలవంతపెట్టను. ప్రధానులారా ! మీరందఱును నీ దినము మొదలు యుద్ధసన్నాహమును జేయ వలయును. కోట గోడలు, బురుజులు మొదలగునవి బాగుచేయింప వలయును. చందఱ వందఱ, లోహగడము మొదలుగాఁగల దుర్గములలోనున్న ఫిరంగులను మనకోటఁకు జేర్పవలయును. భోజనపదార్థముల నన్నిటిని నేఁడే కోటకుఁ జేర్పుఁడు. యుద్ధములో గాయములు తగిలినవారికిఁ జికిత్సఁ జేయుటకు వైద్యులను సిద్ధముగ నుండున ట్లాజ్ఞాపింపుడు. యోధులారా ! మీకుఁ గడపట నొకమాటఁ జెప్పెదను. మీరందఱు నైకమత్యము గలిగి మీపట్టణమును బరరాజుచేఁ బడనీయక ధీరత్వముగఁ

బోట్లాడవలయును. మనకే జయము గలుగవలయునని సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని ప్రార్థించు చుండవలయును. సర్వాత్మకా ! భగవంతుడా ! దయానిధీ నాకు స్థైర్యమునిమ్ము. నా రాజ్యమునకును, నా వంశమునకును గళంకము గలుగకుండు నట్లు నన్నాశీర్వదింపు " మని తన వాక్యజాలమును ముగించెను.

ఇంతదనుకను సభలోని వారందఱు చాందబీబీని తదేక ధ్యానముతోఁ జూచుచుండిరి. అత్యంతమనోహరమై, ధైర్య సూచకమై యలరారు చాందబీబీ యాకారము, దివ్యమగు నామె నిశ్చలత్వము సభవారి నందఱి నద్భుతసాగరమున ముంచివైచెను. సభలోఁ గొందఱు చాందబీబీ సాక్షాద్భగవత్స్వరూపిణి యని భావించిరి. మఱికొందఱు " మనము పూర్వజన్మమున నెంత పుణ మొనర్చితిమో ! యిట్టి శూరవనిత యార్యావర్తనమున జన్మించి మన రాజ్యమునకే రాణియయ్యె " నని చెప్పుకొనిరి. అంతఁ గొంతవడికి " రాణిగారికి జయమగు గాక ! ఆమె కీ లోకమున శాశ్వతకీర్తి ఘటిల్లుగాక ! " యను ఘోషములు సభయంతయు నిండిపోయెను. పిమ్మట యోధవరులందఱు జయసూచకముగఁ దమశంఖములఁ బూరించిరి. వెంటనే చాందబీబీ మాలికాంబరును వెంటఁబెట్టుకొని తన యంతఃపురమునకుఁ బోయెను. సభ వారందఱును లేచి రాణిగారిని వేనోళ్ళఁ గొనియాడుచుఁ దమ నివాసంబుల కరిగిరి.

## ఇరువదియేడవ ప్రకరణము.

ముస్తుఫా షాజిబీబీని చూచిన పిమ్మట నామెకుఁ గలిగిన సంతోషము వర్ణనాతీతము. మాలికాంబరే ముస్తుఫాను కష్టముల నుండి దక్కించి తనకుఁ జూపినందులకు షాజిబీబీ మిక్కిలి విస్మయ మొందెను. ఆమె తన వివాహకాలమున నతని కేదో యొక గొప్పబహుమాన మొసగఁ దలఁచియుండెను. ప్రస్తుతము రాణిగారు మొగలులతో సంగర మొనర్పవలసియుండుటచే యుద్ధానంతరమున షాజిబీబీ ముస్తుఫాలకు వివాహ మొనర్ప వలసినట్లు మాలికాంబ లేర్పాటు చేసెను. అందుచే షాజిబీబీ తన ప్రియుని దర్శనమువలనఁ గలిగిన సుఖమునే కొంతకాలము వఱకు ననుభవింప వలసియుండెను. ఎప్పుడెప్పుడు యుద్ధము ప్రారంభింపఁబడి త్వరలో పరిసమాప్తినొంది రాణిగారికి జయము గలుగునా యని యామె వేచియుండెను. చాందబీబీరే యుద్ధము నందు దప్పక జయము గలుగఁ గలదని యామెకు దృఢమైన నమ్మకముండుటచేఁ దన వివాహమునుగూడ మిక్కిలి వైభవముతోఁ జరుగఁ గలదని యామె యువ్విళ్ళూరుచుండెను. కష్టములనుండి బ్రతికి వచ్చినందులకే సంతసించుచున్న ముస్తుఫా షాజబీబీవలెఁ బెండ్లికై తొందరపడక యున్నను యుద్ధానంతరమున నామెను బెండ్లాడ వచ్చునని సంతసించుచు యుద్ధసన్నాహమునకై కొంత పాటు పడుచుండెను.

చాందబీబీ తన సింహాసనమునఁ గూర్చుండియుండెను. హమీదుఖానుఁడు దక్క మిగిలిన ప్రధానులందఱు నామె చుట్టుఁ గూర్చుండి రాణిగారితో నీక్రింది విధమున మాట్లాడ దొడంగిరి:

చాంద:— మాలికాంబరూ! ఇఁక రెండురోజులలోనైన దప్పక యుద్ధము దటస్థింపఁ గలదు. మీరందఱు సిద్ధముగ నున్నారు గదా?

మాలికాంబరు:—సిద్ధముగ లేకేమి? కావలసిన పనులన్నియుఁ జక్కగ నెరవేఱుచున్నవి. బీజపూరుసుల్తాను వద్దనుండి మరల వర్తమాన మెద్దియు వచ్చినట్లులేదు.

చాంద:—నేఁడే వర్తమానము వచ్చినది. ఇబ్రహింఅదిల్‌షాహా తన సైన్యముతో వచ్చి మనలను గలసికొను నట్లును, నతనికై మనము వేచియుండ నవసరము లేనట్లును వర్తమానమును బంపినాఁడు. అతఁడు మనలఁ దప్పక కలసికొనఁగలఁడు.

మాలి:—అమ్మా! నాఁటి దినమున నేఁ జూచిన మొగలాయి సైన్యమును వర్ణింపనలవికాదు. సైనిక భటులందఱు దృఢగాత్రులై శౌర్యచిహ్నములచేఁ దాండవమాడు చుండిరి. ఏనుగులును, గుఱ్ఱములును మిక్కలి బలిష్ఠములై యప్పుడే యుద్ధమునకు దూకువానివలె హుంకరించుచు నుండినవి. ఫిరంగులును, దుపాకులును, మందుగుండ్లు మొదలగునవి వారియొద్దఁ బెక్కులుండినవి. అయినను

మనమిప్పు డొనర్చు సన్నాహములు వాని నిసుమడించి యుండుటచే నాకించుకైన భయములేదు.

చాంద:—ఇంతకంటె రెండు రెట్లు మొగలాయి సైన్యము మన పైకి వచ్చినను నేను జంకను. మనసైన్య మటుండనిమ్ము బీజపూరు సేనలకున్న ధైర్యసాహసములను వేఱుగఁ జెప్పవలయునా ? మఱచితి గోలుకొండ నుండి యేల వర్తమాన మింకను రాకున్నది ? అతఁడు మనకు సాయ మొనర్చునో లేదో తెలియకున్నది.

మాలి:—నేను నట్లే సందేహపడుచున్నాను. అమ్మా ! యొకటి చెప్పఁమఱచితిని. దక్షిణీ తురకలుగొందఱు గొప్పసైన్యములతో మియర్‌మంజూను గలిసికొన వచ్చుచున్నారట. త్రోవలోనే వారి నెదరించి తరుమఁ గొట్టుఁటకై యబ్దుల్ రహిమానుచెంతఁ గొంత సైన్యము నంపవలయును. లేనిచో మనము వారిని జయించుట దుర్లభము.

చాంద:—రహిమానూ ! నీవిప్పుడే కొంతసేనను దీసికొని వారి నెదిరించుట కేగవలయును. మరలఁ ద్వరలో మమ్ములను గలిసికొన వలయును.

రహిమాను:—అమ్మా ! అట్లే వర్తించెదను. కాని నాప్రయత్నముల కన్నిఁటికిని హమీదుఖానుఁ డడ్డము వచ్చుచు రాజకార్యములలో నించుకయైన శ్రద్ధవహింప కున్నాఁడు.

మఱియు నతఁడప్పుడు శత్రుపక్షమువారిఁ గొనియాడుచు మిమ్ములఁ దృణీకరించుచున్నట్లు వింటిని.

చాంద:—— నేను నట్లే వింటిని. అహమ్మదుఖానుని కారాగారము నందుంచినది మొదలు హమీదుఖానుని చర్య యొక విధముగ నున్నది. చక్కఁగ నిజమును బరిశీలించనిదే మన మేపనిని చేయఁగూడదు.

మాలి:——అమ్మా! అహమ్మదుఖానుఁడు చెఱసాలనుండి యెట్లయిననఁ దప్పించుకొని పోవుటకై యనేక సదుపాయములఁ జూచుకొన్నాఁడట. కాన మన మతిజాగ్రతతో నుండవలయును. లేకున్న ముప్పు తప్పదు.

వీరిట్లు మాట్లాడుకొనుచుండ సేవకుఁ డొకఁ డరుదెంచి "అమ్మా! సిద్దీసర్దారులందఱు వారి సేనలను దీసికొని వచ్చి హజారమునఁ గాచుకొని యున్నా" రని చెప్పెను. చాందబీబీ "హాసేనూ! నీ వీక్షణముననే సిద్దీ సర్దారుల సేనలు విడియుట కనుకూల ప్రదేశముల నేర్పాటు చేయు" మనుచు సింహాసనము నుండి లేచెను. వెంటనే ప్రధానులందఱును లేచి వారికి నియమింపఁబడిన కార్యముల నొనర్చుటకై రాణివద్ద సెలవు దీసికొని తమ నెలవుల కరిగిరి.

ఇరువదియొనిమిదవ ప్రకరణము.

ప్రధానులును, దండనాయకులును యుద్ధసన్నాహము లను జేయుచుండిరి. సైన్యములకు వసతులు గావింపఁ బడెను. చాల దినములవఱకు సరిపోయెడు నాహారపదార్థమును బండ్లమీఁద తీసికొనిరాఁబడి కోటలోఁ జేర్పఁబడినవి. సైన్యాధిపతులందఱు సేనలకు యుద్ధశిక్షణ బాగుగఁ గఱపుచుండిరి. ఖడ్గములు, భిండివాలములు, కుఠారములు మొదలగు నాయుధము లన్నియుఁ జక్కఁగఁ బదనుబెట్టఁబడుచుఁ గ్రొత్తవిగూడ సిద్ధము జేయఁబడుచుండెను. యుద్ధమునం దుపయోగపడు గజములు, హయములు మొదలగు వానికి యజమానులు శిక్షణచక్కఁగఁ గఱపుచుండిరి. సహాయమునకై వచ్చిన క్రొత్తసైనికులకు గుడారములు నాటింపఁ బడుచుండెను. సేనానాయకులందఱును వారి వారి సేనలను జేర్చుకొని యందు యుద్ధమున కర్హులెవ్వరో యని పరీక్షించు చుండిరి. ఫిరంగులకును, దుపాకులకును గావలసిన నాళములు, మందు గుండ్లు మొదలగునవి కోటలోనికిఁ జేర్పఁబడు చుండెను. 'చందన్ పందన్' లోహగడము మున్నగు దుర్గములనుండి ఫిరంగులన్నియుఁ దేఁబడి కోటలోఁ జేర్పఁబడినవి. సైనికులలోఁ గొందఱు కోట గోడలను బురుజులను బరిశోధించి శిథిలముత్తైన భాగములను మాగుచేయుచుండిరి.

చదువరులారా! ఈ యహ్మదునగరము కోట చాలా ప్రసిద్ధమైనది. ఈకోట యుత్తరపు దిక్కున సింహద్వారమును గలిగియుండెను. దీనిచుట్టుకొలత రమారమి యెనిమిది

మైళ్లుండెను. తూర్పు, దక్షిణము, పడమర - యీభాగములలో గచ్చు, బలురక్కసి, బొమ్మజెముడుచెట్లు దట్టముగఁ బెఱిగి యుండుటచే నాప్రక్కల ముట్టడించుటకు వీలు లేకుండెను. ఈ కోటగోడలు నేలమట్టమున నాలుగున్నర గజములు వెడల్పును, నగ్రమున రెండుగజములు వెడల్పును గలిగి నిలువున పదునాలు గడుగుల యెత్తుగలిగి యుండెను. ఈ గోడల చుట్టును సదా నీటిచేఁ నింపఁబడినట్టియు నిరువది గజముల వెడల్పు గలిగి నట్టియుఁ గందక మొకటినిర్మింపఁ బడియుండెను. గోడలకు లోపల భాగమున జుట్టు ఫిరంగుల నుంచుటకుగాను బదియడుగుల నెత్తుగల పిట్టగోడ యొకటి కట్టఁబడి యుండెను. ఈపిట్టగోడ మీఁద ఫిరంగులనుంచి శత్రువులఁ గాల్చుచుందురు. అందువలన వానికి సమముగ రెండడుగుల దూరమున కొక చిన్నరంధ్రము వంతున కోటగోడల కన్నివైపుల రంధ్రము లొనర్పఁబడి యుండెను. ఈ రంధ్రము లన్నియు ఫిరంగుల మూతులయొక్క చుట్టుకొలతల ననుసరించి చేయబడియుండెను. భటులందఱు పిట్టగోడమీఁద నిలుచుండి ఫిరంగులను గాల్తురు. మొదట గోడ మీఁద నిలుచుండి తుపాకులతో యుద్ధము చేయువార లలసిపోయి నపు డీ చిన్నగోడమీఁదికి వచ్చి ఫిరంగుల గాల్చువారినిఁ బైకి బంపి వారచట యుద్ధము జేయుచుందురు. కోటగోడలకు లోపలి భాగమున నొక ఫర్లాంగు దూరమున కొక్కొక్క బురుజు గలదు. కొన్ని బురుజులు క్రొత్తగ మరమ్మతు చేయింపఁ బడియుండెను.

ఈ బురుజులలో యుద్ధమునకుఁ గావలసిన పరికరములన్నియు సిద్ధముగఁ బెట్టఁబడియుండుటచే సైనికులు సర్వకాలసర్వావస్థల యందు వానిని గనిపెట్టుకొని యుందురు. మఱియుఁ గోట సింహ ద్వారమున కిరుప్రక్కలను రెండేసి దృఢములైన బురుజులు గలవు. వీనియందుఁ బూర్వపు నైజాంషాహీలు వాడెడు ఫిరంగు లన్నియుఁ బెట్టఁబడి యుండెను.

పైఁ జెప్పఁబడిన సింహద్వార మింత విస్తీర్ణము గలదని చెప్పుటకు వీలులేదు గాని యా ద్వారమునుండి యోదాలుగట్టఁబడిన మూఁడు బలిష్ఠములైన యేనుఁగులు బరాబాటకముగ నొకచే కాలమున దాటిపోఁగలవు. ద్వారముయొక్క కవాటము లుక్కుతోఁ జేయఁబడి యతితీక్ష్ణమగు గుబ్బమేకులతోఁ దాపఁబడి యుండెను. వీటికి బీగములు లోపలిభాగముననే వేయఁబడి యుండెను. విశ్వాసపాత్రులును, యుద్ధములయం దారితేరిన వారును, సదాజాగ్రత్తనే వహించి యుండువారును నగు ముసలి భంట్లు పైఁ జెప్పిన బురుజులలో నెల్లప్పుడును గాచుకొని యుండి సింహద్వారమును గాపాడుచుందురు. ఈ వృద్ధరక్షకభటులకు శీఘ్రమైన సహాయము గావలసి యుండినఁ గోటలోనుండు నితర సైనికులు వారికి సహాయ మొనర్చుచుందురు. యుద్ధసమయము లట్లుఁ దప్ప నితర కాలములయందుఁ బగటిపూటమాత్రము కోట సింహద్వారము తెరువఁబడి యుండును.

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

సూర్యోదయమైనది. అహమ్మదు నగరమంతయు జన సమ్మర్దముగ నుండెను. ఏప్రక్కఁజూచిన నిటునటుఁ బరుగెత్తు వారును, నొకరితో నొకరు మాటాడుకొనువారును, నేమియుఁ దోఁచక వడివడిగ నడచువారునై వీథులలో జనులు నిండిరి. కొందఱు స్త్రీలు తమభర్తలు యుద్ధమున నిహతు లగుదురేమో యని దుఃఖించుచుండిరి. మఱికొందఱు తమప్రియులకు యుద్ధమున జయము గలుగునట్లు భగవంతుని ప్రార్థించుచుండిరి. కోటకు ముందు భాగమున నున్న వీధియంతయు సేనలచే నిండి పోయెను. సామంతరాజులచేఁ దీసికొని రాఁబడిన సైన్యములును, రాణిగారి సైన్యములును సింహద్వారముకడ నిల్చి యుండెను. ఒక్కొక్క సేనయొద్ద నొక్కొక్క సేనానాయకుఁడు ఠీవిగఁ దన హయముపైఁ గూర్చుండి సేననంతను బరికించి చూచుచుండెను.

ఇంతలో రణభేరి మ్రోయింపఁబడినది. దానిని విన్నసైనికు లమితోత్సాహులై ధైర్యసూచకముగ శంఖములను బూరించిరి. పిమ్మట సైన్యమంతయుఁ గోటఁ జేరవలసినట్లుత్తరువగుడు సేనా నాయకులు తమ సేనలను బారులుదీర్చి కోటలోనికిఁ గొనిపోవు చుండిరి. వీరి కందఱకును బ్రధానన్యాయకుఁ డగు మాలికాంబరు ముందు నడచుచుండెను. వీరిట్లు కోటఁ జొచ్చుచుండగనే ప్రళయ కాలమునందువలె గగనమండలము బ్రద్దలగునట్లు భేరీ నినాద ములు రాణిగారి సేనకు వినవచ్చెను. "ఘుర్రాదు సైన్యము

సమీపించుచున్నది. కోటలోనికిఁ ద్వారగ రం" దని సేనా నాయకులంద ఱేకగ్రీవముగఁ దమ సేనల కుత్తరువిచ్చిరి. సైన్య మంతయుఁ గోటలోని కేఁగినది. సింహద్వారపు కవాటములు బంధింపఁబడినవి. కోటలోనున్న సైనికు లందఱును వారివారికి నియమింపఁ బడియున్న స్థలములలో నిలుచుండి యుద్ధమునకుఁ సిద్ధపడి యుండిరి.

ఇంతలో మురాదు సైన్యము గోటవద్దఁ జేరఁ గోట ముట్టడి ప్రారంభమాయెను. మురాదు సైన్యములో సగముమంది కోటకుఁ జుట్టునున్న యగడ్తనీది గోడలను సమీపించి వానికి రంధ్రములను జేయఁ బ్రయత్నించుచుండిరి. క్రిందనున్న సైన్యము గోడలమీఁద నున్నవారిపైఁ దుపాకులను, ఫిరంగులను గాల్చుచుండిరి. గోడలపైనున్న రాణిగారిసేన ప్రయోగించు శతఘ్నులయుఁ దుపాకులయుఁ గుండ్లవలనఁ గ్రిందనున్నవా రనేకులు నిహతులగుచుండిరి. ఇట్లుండ మురాదు సేనలోఁ గొంత మంది రాళ్ళను జెట్లకొమ్మలను దీసికొనివచ్చి కందకములను బూడ్చుటకై యత్నించుచుండిరి. పైనున్నవారు శత్రువులొనర్చు పనుల కనేకవిఘ్నములను గలుగఁజేయుచుండిరి. మురాదు సేనలోఁ గొంతమంది బాణవర్షమును గురిపించుచు ఘోరముగఁ బోరుచుండిరి. కోటలోని సైనికులలోఁ గూడఁజాలమంది నిహతు లగుటచేఁ చాందబీబీ పురుషవేషమును ధరించి, కవచమును దొడిగి చేతఖడ్గమును ధరించి కోటగోడమీఁద బిరబిర నడచుచు సైనికు లను బ్రోత్సాహ పెట్టుచుండెను. రాణిగారి దర్శనమైన వెంటనే

సైనికులందఱు మిక్కిలి యుత్సాహముతోఁ బోరాడుచుండిరి. కోటగోడలను సమీపించియున్న మురాదుసైన్యము బురుజులను బయటనుండి త్రవ్వి గూఁడుచేసి యా గూటిలోఁ దుపాకిమందు నుంచి దానికి నగ్ని రగుల్కొలు ప్రయత్నించుచుండిరి. వెంటనే చాతుర్యవతియగు చాందబీబీ దానిని జూచి యావైపునకుఁ బరుగెత్తి లోపలనుండి బయటవఱకును రంధ్రములను బొడిపించి వారు గూటిలోనుంచు మందును బయటకుఁ దీయించుచుండెను. మియర్ మంజూ సేనలో ననేకులు మురాదుసేనతోఁ గలిసి సింహద్వారమును స్వాధీనము జేసికొని లోపలఁ బ్రవేశించుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఆవైపునన్న రాణిగారి సైన్యము శత్రువులను లోపలకు రానీయక వారితో హోరాహోరిగఁ బోరాడుచుండెను.

వీరి ట్లొండొరులతోఁ బోరునప్పుడు వేఱొకసేన రాణిగారికి సహాయ మొనర్చుట కరుదెంచి మురాదు సైన్యముతోఁ బోరాడ మొదలు పెట్టెను. ఈ సైన్యమే బీజపూరునుండి వచ్చిన క్రొత్త సైన్యము. ఇబ్రహింఆదిల్‌షాహీ యీ సేనకు నాయకుఁడు. ఇతనిక్రింద నితర సేనానాయకులుగూడ నుండిరి. ఈ సైన్యమును జూడఁగనే రాణిగారిసేన విజృంభించి పోరాడ మొదలుపెట్టెను. నిముసములో రక్తము కాల్వలుగట్టి పాఱుచుండెను. భటుల తలలు, కాళ్ళు, చేతులు నెత్తురులోఁ దేలుచుండెను. కొంద ఱాశ్వికులు లీలలం గైకొని రౌతులఁ బొడుచుచుండిరి. మహావీరుల నేత్రములు రక్తసిక్తములై క్రూరాకారులఁ జేయుచుండెను. కొంద ఱాయుధములఁ బాఱవైచి గ్రుద్దుకొనుచుండిరి. కొందఱు

పర్వెత్తుచుండిరి. మఱికొందఱు వారినిఁ దరుముచుండిరి. కొందఱు స్మృతిదప్పి వారంతటవారే నేలం బడిపోవుచుండిరి. కోటగోడలపై నున్నసైన్య మలసిపోవునపుడెల్లఁ జిన్న గోడలపైఁ బిరంగులను గాల్చువారు పెద్దగోడలమీఁదికి వచ్చి తుపాకులతో యుద్ధ మొనర్చుచుండిరి. మొగలాయి సైన్యము సింహద్వారముపైఁబడి కవాటములను బ్రద్దలు చేయుచుండెను. వెనుకనుండు బీజపూరు సైన్యము వీరి ప్రయత్నముల నించుకైన కొనసాగనీయలేదు చాందబీబీయు చాలమంది మొగలాయి వీరులను భూమికి బలి పెట్టుచుండెను. ఆమె శౌర్యమునకుఁ దాళఁజాలక వారందఱు తహతహ పడుచుండిరి. ఇరుపక్షములలోఁ బడిపోవు సైనికులను జూడలేక కాఁబోలు సూర్యుఁ డపర సముద్రమునఁ గ్రుంకెను. ఇరుతెగలవారును నాఁడు యుద్ధమును నిలిపిరి.

### ముప్పదియవ ప్రకరణము

మఱునాఁ డుదయమున రణభేరి మ్రోగింపఁబడెను. శత్రు సైన్యములు కోటను ముట్టడించినవి. ఉఱుము మెఱుము పిడుగులతోటి మేఘంబు వడువునఁ దుపాకులు ప్రయోగింపఁ బడినవి. వానివలనం బొడమిన ధూమంబు లుభయ సైన్యంబులం గప్పివైచెను. బీజపూరు సైన్యములోఁ గొంత భాగము ముందే కోటలోనికి రప్పింపఁబడి యుండుటచేఁ రాణిగారి సైన్యము పూర్వమునకంటె నిప్పు డధికోత్సాహంబునఁ బోరాడఁదొడంగెను. మియర్ మంజూ నేన బయట శేషించియుండిన బీజపూరు సేనతోఁ

బోరాడుచుండెను. చాలసేపిట్లు పోరు ఘోరమగుడు మురాదు సేనలో ననేకులు నిహతులైరి. మురా దిదిగని కోపోద్దీపితుఁడై రాణిగారి సేనలపై నగ్నివర్షమును గురియించెను. వెంటనే మఱి యొక క్రొత్తసైన్య మరుదెంచి మియర్ మంజూ సేనతో గలిసెను. వీరే మియర్ మంజూ సహాయమునకు వచ్చిన దక్షిణీతురకలు. అబ్దుల్ రహిమానుఁడు వీరిని త్రోవలోగలిసికొని తరుమఁగొట్టుటకు వీలు లేకపోయెను. ఈతఁడు వచ్చుచున్నాఁడనుసంగతి తెలియగనే దక్షిణీతురకలు మఱియొక మార్గమునవచ్చి మియర్ మంజూను గలిసికొనిరి. అబ్దుల్ రహిమానుఁడును జేయునది లేక రాణిగారి సైన్యమును గలిసికొనెను.

ఇప్పుడు మియర్ మంజూ సైన్యమును మొగలాయి సైన్యమును నతిఘోరముగఁ బోట్లాడుటకు మొదలుపెట్టెను. కాని చాందబీబీ వారిపై నిప్పులవర్షమును గురియించుటచే వారందఱు నిరుత్సాహులైరి. కాని మురాదు వారినందఱినిఁ బ్రోత్సాహపెట్టి సింహద్వారమును ఛేదింప నాజ్ఞయిచ్చెను. అంత సైనికులంద ఱట్లొనర్పఁ బ్రయత్నించిరి. కాని ప్రయోజన మగపడకుండెను. అంత మురాదు కోపావేశుఁడై తనవద్ద నున్న యేనుఁగుల నన్నిఁటిని వరుసగ నిలువఁబెట్టి కోటతలుపులను దాకఁ బురి కొల్పెను. కవాటము లించుకైనఁ జలింప లేదు. ఇనుపగుబ్బలు గజయూథముల మస్తకములలో గ్రుచ్చుకొనుటచే రక్తము ప్రవాహమై పాఱుచుండెను. అంత మురాదు చేయునదిలేక కోట బురుజులకు నిప్పంటింప నాజ్ఞయిచ్చెను. అంత నతని సైనికులు

బురుజులను గాల్చ యత్నించుచుండిరి. మాలికాంబరు శక్తికొలది వారితోఁ బోరాడుచుండెను. చాందబీబీ కోటగోడపై యుద్ధము జేయుచుండెను. మొగలాయి సైన్యము విజృంభించి పోరుటచేఁ గోటలోని యుత్తరపుతట్టు బురుజు నిప్పంటింపఁబడెను. ఆ భాగమున నున్న మఱియొక బురుజు గూడ నిప్పంటుకొని రెండు బురుజులును పెళ పెళారావములతోఁ గ్రిందఁ బడిపోవుచుండెను. ఆ త్రోవను మొగలులు కోటలోఁ బ్రవేశింప మొదలుపెట్టుచుండిరి. రాణిగారి సైనికులలో ననేకులు నిరుత్సాహులై పాఱిపోవుచుండిరి. చాందబీబీ యీ విపద్దశను జూచి రోషావేషముతో వెనుకకు మఱలు సైనికులను బిలిచి "పిఱికిపందలారా! యిట్లు భీతిఁజెంది పరుగిడ వచ్చునా? లెక్కకు మిక్కిలి యెక్కువ యని నిక్కుచున్న మొగలాయి వీరుల నుక్కడింపశక్తిలేక మీరిట్లు నిరుత్సాహులై పరుగిడుటకుఁ గారణమేమి? నాశరీరములోఁ బ్రాణముబుండఁ బట్టణమును బగవారి చేఁజిక్కనియ్య" నని చెప్పుచు, జేతఖడ్గమును ధరించి కూలిన బురుజులవైపుఁ బరుగెత్తెను. ఆమె మాటలను విన్నతోడనే వెనుకకు మరలిన సైనికులు మరలరాణిగారి సేనను జేరిరి. చాందబీబీ బురుజులకడఁ ఘోరముగఁ బోరాడుచు మొగలులను గోటలోని కొక్కయుడుగైన బెట్టకుండఁ జేయుచుండెను. రాక్షససంహార కాలమున శక్తిస్వరూపమును గైకొన్న పార్వతీదేవివలె నామెయప్పుడు విరాజిల్లుచుండెను. ఆమెతోఁ బోరుటకు మురాదుచటికరుదెంచెను గాని యామె రౌద్రాకారమును జూచి మిక్కిలి వెఱగొందె దూరమున నిలిచెను

యచ్చటనుండి యామెపై బాణవర్షమును గురియింపఁ దొడఁగెను. ఆమె యాభాణములనన్నిటిని ఖండించుచుండెను. కాని యందొక బాణమామె శిరస్సున గ్రుచ్చుకొనగా నామె మరింత క్రోధావిష్ట మానసయై యా బాణమును దానే పెఱికివైచి మఱింత రౌద్రముతో యుద్ధము చేయసాగెను. మాలికాంబరును, అదిల్‌షాహీయును మియర్‌మంజూ హసన్‌మియ్యాలతోఁ బోరాడుచుండిరి. అదిల్ షాహీ తనకరవాలంబును గైకొని కదళీకాంతారమును భేధించు నట్లు సైనికుల కంఠములను విలుంఠనము గావించుచుండెను. అంత మియర్‌మంజూ రోష కషాయిత నేత్రుఁడై యిబ్రహీంపైఁ బడి యతనిఁ దెగటాఱ్చుటకుఁ దనకత్తి నెత్తెను. ఇంతలోఁ దరుణవయస్కుఁడగు నొక రాకొమరుఁ డెచ్చటినుండియో తన గుఱ్ఱమును వాయువేగమున బరుగెత్తించికొని వచ్చి యా పురుష సింహునికిఁ దోడుగ మియర్‌మంజూపైఁబడెను. మియర్‌మంజూ యిబ్రహీముతోఁ బోరాడుటమాని యా వచ్చిన నూతన పురుషునితోఁ బోరాడుచుండెను. వీరిద్దఱికిని పోరు ఘోరమాయెను. ఈ నూతనపురుషుఁడు ముస్తుఫాయని మియర్‌మంజూకుఁ దెలియఁగానే యతనికిఁ గ్రోధ మూరకపొంగి వచ్చుచుండెను. ముస్తుఫాయును నాస్థితిలోనే యుండెను. మియర్‌మంజూ సేనలో ననేకులు మడిసిరి. ముస్తుఫా, మాలికాంబరు, అదిల్‌షాహీలకు జంకి హతశేషులగు సైనికులు పరుగెత్తి పోవుచుండిరి. అంత మియర్‌మంజూ ముస్తుఫాతోఁ బోరుటమాని మిగిలియున్న

సైన్యమును దీసికొని మురాదుకుఁ దోడ్పడ వచ్చెను. ముస్తుఫా మాలికాంబరులు చాందబీబీకిఁ దోడ్పడవచ్చిరి. ఇప్పటివఱకును చాందబీబీ సాయముచే నామెసైన్యములు మహానదిప్రవాహము నకుఁ జంకుఁగొనని పర్వతముల క్రియసుస్థిరులై నిల్చి యుద్ధ మాడుచుండినవి. చాందబీబీయు శత్రుసైన్యంబు నొచ్చితుంగ మడువుజొచ్చిన మదేభేంద్రంబు చందంబున సైనికులను జించి చెండాడుచుండెను. మురాదుసేనలో ననేకులు మడియుటయేకాక కాలుచేతులు నఱుకఁబడిన వారును, గొనయూపిరితో నుండు వారును, లెక్కకు మిక్కుటమైయుండిరి. వీరిలో నొకఁడు చాందబీబీ శౌర్యమునుగని "ఆహా! దక్షిణహిందూ దేశమున నిట్టివీరమాత యెచ్చటను జన్మించియుండలేదు. ఇఁక మీఁదట నైన నీమెవంటి స్త్రీరత్నము లుద్భవించుటయరుదు. ఆహా! ఏమి యీమెశౌర్యము! ఎంతపోరిన నామె కించుకైన నలసట జనింపకున్నది. కొద్దికాలములోనే శత్రుసైన్యము నంతటిని ధ్వంసముచేసినది. ఇట్టి దేశాభిమానముగల యీ శూరవనిత పవిత్ర చరిత్రము లోకమున శాశ్వతముగ నుండుఁగాక" యని తన ప్రాణములను విడిచెను.

పోరాటము జరుగుకొలఁది మురాదు మియర్‌మంజూ సేనలలో ననేకులు మడియుటచేతను, సాయంకాల మగుటం బట్టియు నాఁటిదినము యుద్ధమునాపి మురాదు మియర్‌మంజూలు శేషించిన సైన్యములను దీసికొని తమ గుడారముల కరిగిరి.

## ముప్పదియొకటవ ప్రకరణము.

గుడారముల కేగిన మురాదు సైన్యములలో ననేకులు గాయములచే మిక్కిలి బాధపడుచుండిరి. వ్రణవైద్యులు వారికిఁ జికిత్సచేయుచుండిరి. కొంతమంది సైనికులు వంటలువండు చుండిరి. కొంతమంది సేవకులు మురాదు మియర్ మంజూలకుఁ బ్రత్యేకముగ భోజనపదార్థములను దయారు చేయుచుండిరి. సైనికులు నివసించియుండు గుడారములకుఁ బ్రక్కఁగనే వేఱొక డేరాయందు మురా దొక కుర్చీపైఁ గూర్చుండి యూరక యాలోచించుచుండెను. మియర్ మంజూ మిక్కిలి దీనవదనుఁడై యతని ప్రక్కన వేఱొకకుర్చీపైఁ గూర్చుండియుండెను. అంత మురాదు "మియర్ మంజూ! మనకిఁక జయముదొరకుట దుర్లభమనియే తలఁచెదను. ఇంతటితో సంధి గావించుకొనుట యుచితమని నాయభిప్రాయ" మనెను. అందులకు మియర్ "ఇప్పుడు సంధియొనర్చుటవలన మనకేమిలాభము? మనయిష్ట ప్రకారము రాణి యొప్పుకొనునా? ఆమె సైనికులలోఁ గూడ ననేకులు మడిసిరి. రాణిగారి సైన్యములకంటె మనసేనలు గొప్పవి· అయినను మనసేనలలో ననేకులు మృతిబొందుట వలన నిప్పుడు వాండబీబీ కెంతసైన్యముగలదో యంతసేన మనకున్నది. ఇంకొక తూరి కోటను ముట్టడించి చూతము. పిదపమన ప్రాప్తికొలఁది జరగఁగల"దనెను. అందులకు మురాదు "ఇంకొకతూరి కోటను ముట్టడించిన మనకిప్పుడున్న సైన్యములను గూడ మనము

పోఁగొట్టుకొనఁగలము. అబ్బా! చాందబీబీశౌర్య మేమని చెప్పఁ గలను! అట్టి రణశూర్ణియగు స్త్రీని నేనెచ్చటను జూడలేదు. ఏమి యామె శౌర్యము! యుద్ధము ప్రారంభింపఁబడినది మొదలు కొని తుదివఱకు నెవరికిని వెఱువక పోరాడినది. నాబోటివానికి సహిత మామె యెదుటనిల్చి పోరాడుటకు గుండియలు లేవు. కాఁబట్టి యిప్పుడెట్లయినను నామెతో సమాధానమొనర్చు కొన వలయు" ననెను. అందులకు మియర్ "మన కేదో లాభకర మగునట్లుగదా సంధి యొనర్చుకొనవలయును. ఇప్పటికి మన కపజయము గలుగలేదు. కాన సమాధానములో మన మొనర్చు నేర్పాటుల కామె యొప్పుకొనుననియే నా యభిప్రాయ" మనెను. అంత మురాదు బీరారుదేశమును మనకిచ్చిన నామెతో యుద్ధ మొనర్చుట లేదని యామెకు వర్తమాన మంపుదము. దీని కామె సమ్మతించినచో మన మా దేశమునుజేరి యచ్చటి జనులను లోఁబఱచుకొని సైన్యమును బలపఱచి మరల మాతండ్రికిఁ గొంతసేన నంపునట్లు జాబువ్రాసి యా సైన్యముతో మరల నహమ్మదునగరముపై బడి యామెను రాజ్యభ్రష్ట గావింతము. ఇంతకంటె మంచి యాలోచనము నాకేదియుఁ దోఁచకున్న" దనెను. అందులకు మియర్ "మురాదూ! నీతెలివితేటలకు మిక్కిలి సంతసమాయెను. ఈ సమాధానముచే మనము బహ దరును గారాగృహమునుండి విడుదల చేయవలసియుండు" ననెను.

వీ రిట్లు మాటాడుకొనుచున్న సమయమునందే హసన్ మియ్యా యచ్చటికరుదెంచి "మిత్రులారా! రాణిగారు ప్రస్తుతము

యుద్ధము నిలుపుదలచేసిన బాగుండునని తలంచుచున్నదఁట. మనము ముందుఁ గోటను ముట్టడించిన నామె యుద్ధమునకు సిద్ధముగ యున్నదని నా యాంతర్యమిత్రుఁడగు హమీదుఖానుఁడు చెప్పెను. మీ యభిప్రాయమేమో నాకుఁ దెలియకున్న " దనెను. అంత మురాదు " మిత్రమా ! ఇంతవఱకును మేమావిషయమునే యాలోచించుచుంటిమి. ప్రస్తుతము సమాధాన మొనర్చుటయే యుక్తమని భావించితిమి. ( మియర్ వంకఁ జూచి ) మనమను కొనినట్లు చాందబీబీ మన యేర్పాటున కొప్పుకొనును. కాఁబట్టి యిప్పుడామె కొకజాబు వ్రాసి పంపవలయు " నని చెప్పుచు నొక కాగితమును దీసికొని వారి యభిప్రాయములన్నిటిని యందు విశదముగ వ్రాసెను. వెంటనే మియర్ మంజూ యొక సేవకుని బిలిచి యతనిచేతి కాజాబు నొసఁగి " అతిత్వరితముగఁ బోయి నీవీలేఖను చాందబీబీయొద్ద నొసఁగి జవాబును గొని తేవలయు " నని చెప్పెను. అంత సేవకుఁడు జాబును దీసికొని మురాదు మంజూలయొద్ద సెలవుబుచ్చుకొని గుడారమునువదలి బయటికి వచ్చెను. పిమ్మట మియర్ " హసనూ ! హమీదుఖానుఁడే మన కిప్పుడు కొంచెము సాయమొనర్చుచున్నాఁడు. మిగిలినవారందఱు నిష్ప్రయోజకు లనియే నాయభిప్రాయ " మనెను. అంత హసను " కొంచెము సహాయమననేల ? అతఁడిప్పుడు ఖానుని జెఱనుండి విడిపించుట కెంతో ప్రయత్నించుచున్నాఁడట. మఱియు నాపని పూర్తికాగానే ప్రజలకును, బ్రధానులకును, రాణికిని యాంతర్య కలహములను గలుగఁజేసి వారి యైకమత్యమును నష్టపఱచు

నెంచి యున్నాఁడట. ఇంతకంటె మనకు వేఱుపాయము గావనెనా ?" యనెను. ఈ మాటను విన్నతోడనే మురాదు మియర్ మంజూలు మిగుల సంతసించిరి. రెండవమారు జరుగు యుద్ధమునఁ దమకు జయము గలుగఁ గలదని వారు దృఢముగ నమ్మిరి.

### ముప్పదిరెండవ ప్రకరణము.

సంగరమాపఁబడిన మఱుసటిదినము మరల యుద్ధము ప్రారంభింపఁబడనందునఁ బ్రధానులును దండనాయకులును రాణిని దర్శించుటకై యామె యంతఃపురమునకు వెళ్ళిరి. చాందబీబీ తన సింహాసనమునఁ గూర్చుండియుండెను. ఆమెకుఁ బ్రక్కన నిబ్రహీంఅదిల్‌షాహీయును, ముస్తుఫాయును, వీరికి ముందుభాగ మున మాలికాంబరును, హుసేనుమీర్జాయును గూర్చుండియుండిరి. ప్రధానమంత్రులును దండనాయకులును 'శాత్రవ భయంకరి' యని పేరువడసిన చాందబీబీ తట్టేచూచుచుండిరి. అంత నామె వారితో "ప్రధానులారా ! మీరందఱు మీ సేనలను యుద్ధమునఁ జక్కఁగ నడిపి శత్రువులతోఁ బోరి పట్టణమును బరరాజులచేతఁ బడనీయక కాపాడినందులకు నేనెంతయు సంతసించుచున్నాను. మఱియు నిప్పుడు మనయొద్దఁ గూర్చుండియున్న తేజోమూర్తి యిబ్రహీం అదిల్‌షాహీ మనకొఱకై మిక్కిలి పాటుపడి యుద్ధ మొనర్చినందులకు నతనికి మన మనేక వందనము లర్పింప వలయును. మఱియు నాతని పినతండ్రి కొమరుఁడైన ముస్తుఫా

యును దన సామర్థ్యమును జూపినందులకు నేను మిక్కిలి సంతసించుచున్నా" ననెను. అంత నిబ్రహీం "అమ్మా! ముస్తుఫాపడిన కష్టములను గుఱించి నాకిదివఱకే తెలిసియుండిన యుద్ధమునందు మియర్ మంజూను ప్రాణములతో విడిచి యుండను. ఆహా! ముస్తుఫా యెట్టివిపత్తునకు లోనయ్యెను. మాలికాంబరూ! నేను నీకేమి సహాయ మొనర్పఁగల" ననెను. అంత మాలికాంబరు తన తావునుండి లేచి "నాకు మీరేమి సాయ మొనర్పవలయును? బీజపురమునుండి మీ రిచ్చటికివచ్చి మా పట్టణమును గాపాడుటకై మీరు మా రాణిగారి కొనర్చిన సహాయమే చాలు" ననెను. అంత నిబ్రహీం "నాయనా! నే నేమి సాయ మొనర్చితిని? ఈ జగదేక వీరమాతయగు చాందబీబీ లేనిచో మన మిదివఱ కహమ్మదునగర రాజ్యమునుండి వెళ్ళ వలసినవారమే యగుదు" మనెను. అంత మాలికాంబరు "చక్కఁగ వక్కాణించితిరి. మేమెన్నియో పుణ్యములొనర్చి యుండుటచే నిట్టి యప్రతిమ శౌర్యనిధి మాకు రాణియయ్యెను. మఱియు నామె పగవారికి భయపడి పరుగెత్తిపోవు సైనికులనందఱి నొక టిగఁజేర్చి వారి కుత్సాహమును గలుగఁజేసి శత్రువులను బట్టణము లోనికిఁ జొరనియ్యక శౌర్యమును వెదజల్లుచు మొగలాయీ సైన్యములను దునుమాడి మమ్ములను మా పట్టణమును గాపాడి నేటికిని నైజాంషాహివారివంశమే యహ్మదునగర రాజ్యము నేలుచున్నదను ఖ్యాతిని నిల్పిన యీ వీరమాతకు మా కృతజ్ఞతను జూపుటకై "సుల్తానా" యను బిరుదము నొసఁగుచున్నా"

మని యిప్పుడే నూతనముగఁ దీసికొని రాఁబడిన వెలలేని ఖడ్గమును, నొక కవచమును భక్తితో నామెకు సమర్పించెను. వెంటనే సభాస్థాన మంతయుఁ గరతాళములతో 'చాందసుల్తానా' గారికి "జయము గలుగుగాఁక" యను వాక్యములతో నిండిపోయెను.

ఈ సమయమునసే యొక పురుషుఁడు సభలోని కరుదెంచి రాణిగారికి వంగివంగి సలాములొనర్చి యోమె చేతికొక జాబు నొసంగెను. అంత చాందసుల్తానా దానిలోని విషయముల నరయఁ గోరి దానిని మాలికాంబరు చేతి కొసంగెను. అతఁ డీ విధమున దానిని జదివెను.

"చాందబీబీగారికి

మేము నీతో యుద్ధమొనర్చుట మానుకొంటిమి. లేనిపోని కారణములవల్లఁ గలహామును బెంపుఁ జేసికొని సంగర మొనర్చుటచే జనులు నశించెదరు గాని వేఱులాభము గానరాదు. దేశములను జయించి మొగలాయి రాజ్యమును వ్యాపింపఁ జేయ మాయభిప్రాయము గాని మీకు వెఱచి పాఱిపోవుటకాదు. మీతోఁ బోరలేక యిట్లు వ్రాసితిమని తలంపవద్దు. మీ క్షేమమునకై యిట్లు వ్రాసితిమి. మీకు సంబంధించియుండు బీరారు రాజ్యమున మాకిచ్చిన మా పట్టణమునకు వెళ్లెదము. లేనిచో కయ్యమునకుఁ గాలుద్రవ్వియున్నాము. జవాబునకు నిరీక్షించుచున్నాము.

ఇట్లు

మురాదు."

మాలికాంబ రిట్లు చదివి ముగించి "అమ్మా! మీ యభిప్రాయ మేమి" యని యడిగెను. అంతఁ జాందసుల్తానా "ప్రస్తుతము మనము సంధిగావించుటయే యుక్తము. మన సైన్యములలో మేలైన యోధవరులందఱును నిహతులైరి. గోలుకొండ సైన్యము సాయమొనర్చుటకు రాలేదు. మఱియుఁ బిరంగులకును దుపాకులకును గావలసిన మందుగుండు సామానులుగూడఁ గొంచెముగ నున్నవి. కావున బీరారు పట్టణమును మురాదునకిచ్చి సంధి చేసికొనుటయే మంచి" దని చెప్పెను. మాలికాంబయు నితర ప్రధానులును నందులకు సమ్మతించిరి. పిమ్మట బీరారుపట్టణమును మురాదున కిచ్చినట్లును, మియర్ మంజూ బహదరును జెఱనుంచి విడిపించవలసినట్లును, ఏర్పాటు గావించి యా విషయము నంతయు రాణిగారొక జాబువ్రాసి యా వచ్చిన మియర్ మంజూ సేవకున కొసఁగి, మురాదున కియ్యవలసిన ట్లాజ్ఞాపించెను.

చాందసుల్తానాచేఁ బంపఁబడిన వర్తమానమును విన్న మురాదు మియర్ మంజూల సంతోషమునకు మేరయేలేదు. వెంటనే బీరారునకుఁ బోవుటకుఁ బ్రయాణ సన్నాహములు గావింపఁబడెను. బహదరును జెఱనుండి విడిపించుటకు మియర్ మంజూ తక్షణమే సేవకులను శివనేరి కంపెను. మురాదు తన సేనను దీసికొని బీరారునకుఁ బ్రయాణమయ్యెను. మురాదు గొప్ప సహాయ మొనర్పఁ గలఁడని కొండంత యాశతో నున్న మియర్ మంజూ మురాదు ననుసరించి బీరారునకుఁ బోయెను. హాషన్ ఖియ్యా శేషించిన సేనలతో శివనేరిదుర్గమును జేరెను.

## ముప్పదిమూఁడవ ప్రకరణము.

కాలము రెక్కలుగల యొక వింతపక్షి. అది యొకరి కొఱకై నిలిచియుండదు. దానికి బడలిక లేదు. అది నిద్రాహారములఁ గొనక నిరంతరము ప్రయాణము జేయుచునే యుండును. అది తనరెక్కలను విదల్చి పరుగిడుకొలఁది లోక మెన్నోమార్పులను జెందుచుండును. ఇట్టిమార్పులలో మానవులకు సంతోషము విచారముగాను, విచారము సంతసముగాను బరిణమించును. కాలముయొక్క వేగము సహింప నరునకు శక్తిలేదు. మానవునికిఁ గాలము జరుగుకొలఁదిని సుఖ దుఃఖములు గలుగుచుండును. రారాజుగ నుండువాఁడునైన నొకప్పుడు భిక్షమెత్తుకొనును. భిక్షుకుఁడు నొకప్పుడు రాజై వెలయుచుండును. క్షణములో జరుగు మేలునుగాని కీడునుగాని యెఱుంగుట కా పరమేశ్వరునకుఁ దప్ప తక్కిన వారి కెవ్వరికిని సాధ్యముగాదు. కాఁబట్టి చాందసుల్తానా తనకికిఁ గలుగఁబోవు దుర్దవస్థను గుఱించి తెలిసికొనలేకయున్న దని వ్రాయుట యొక వింతగాదు.

ఆమెకు కాలము మాఱినది. ఆమె ముఖములోని కాంతి క్రమముగఁ దగ్గిపోవుకొలది యామె ధైర్యమును క్షీణించిపోవుచుండెను. ఒక వింత విచార మామె కిప్పుడు జనించినది. ఏదోయొక గొప్పభయ మామెకుఁ గలిగెను. దానికిఁ గారణం బామె యూహింపఁ జాలకుండెను. అదేమి చిత్రమో యామె [illegible]నుల మాటలను గూడఁ దృణీకరించుచుండెను. ఈ సమ

యమునవే యామె విషయమునఁ గుట్రలు పన్ను ఖానుఁడు చెఱ నుండి తప్పించుకొనెను. ఈ వార్తను విన్న బాందసుల్తానా స్థితి యెట్లుండునో వేఱుగఁ జెప్పవలయునా? ప్రధాను లందఱేకమై యతనిని కారాగారము నుండి విడిపించిరని యామె తలంచెను. చెడుకాలము సమీపించునపుడు న్యాయాన్యాయములను, మంచి చెడ్డలను విచారించుట యరుదు గదా!

అహమ్మదుఖానుఁడు చెఱనుండి తప్పించుకొనిన వెనుక నాలోచనామందిరముఁజేరి యెవ్వరికంటఁ బడకుండెను. హమీదు ఖానుఁడు వానితోఁ జేరి రాణీగారిని జంపుటకై పన్నుగడలఁ బన్నుచు నగరున కప్పుడప్పుడు మాత్రమే పోవుచు ప్రధానుల యెడ ద్వేషమును వహించి పైకిమాత్రము మంచిగ నుండునట్లు నటించుచు నగరుతో జరుగు రహస్యముల నన్నిటిని గనుగొని యెప్పటి కప్పటికి మియరోషుంబాకుఁ దెలియఁజేయు చుండెను. మఱియు నతఁడు పట్టణములోని జనుల నందఱిని రహస్యముగఁ నొకటిగఁ జేర్చుకొని వారందఱికిని దుర్బోధ మొనర్చి తన పక్షము గావించుకొను చుండెను.

ఇట్లుండ నొకదినమున మాలికాంబరు రాణిని దర్శించి "అమ్మా! మురాదు బీరారు జేరిన వెంటనే దక్షిణరాజ్యమున నుండు రాజులలో గొంద ఱేకమై యతనిని బీరారునుండి తరుమఁ గొట్టవలయు నని యతనితోఁ బోర నతఁడు యుద్ధము నందు గొన్ని బలమైనగాయములను బొందుటచే నతఁడచట మృతి బొందినట్లును, బర్హాణపురములో నున్న యక్బరు చక్రవర్తి

కీసంగతి తెలియరాఁగ నతఁడు కోపోద్దీపితుఁడై ముందుగ నహమ్మదునగరముపైఁ బడి పిమ్మట నితరరాజ్యములతోఁ బోరఁ గడంగినట్లును నొక చారుండు నాతోఁ జెప్పెను. గోలుకొండ రాజుకూడ నీతూరి మనకు సాయమొనర్చునట్లు వర్తమాన మంపియున్నాఁడు. అదిల్‌షాహోయును మనకు సాయమొనర్ప సిద్ధముగ నున్నాఁడు. నేఁడో రేపో వారు మనలను దప్పక కలిసికొనగలరు. మనము జాగుసేయక యుద్ధసన్నాహ మొనర్ప వలయు" ననెను. ఈ మాటలను విన్నతోడనే చాందసుల్తానా కేమిచేయుటకును దోఁచలేదు. అంత నామె "మాలికాంబరూ! ప్రస్తుతము యుద్ధమన్న నాగుండియ లవియుచున్నవి. ఇటీవలనే యుద్ధ మొనర్చినవా రగుటచే సైనికులు గాసిజెంది యున్నారు. మఱియు ఖానుఁడు చెఱనుండి తప్పించుకొనిపోయి యెవరి సాయముననో ప్రజలను తన పక్షమునకుఁ దీసికొనుచున్నాఁడు. మంత్రులును నామాటను దృఢీకరించుచున్నా" రనెను. మాలి కాంబరు "అమ్మా! యిదంతయు హామీదుఖానుఁ డొనరించు దుర్మార్గమే! అతఁడు మనకు మంచిగ నుండునట్లు నటించుచు లోలోపలఁ గుత్రలను బన్ని ఖాను నెట్లో చెఱనుండి తప్పించిన సంగతి నాకుఁ దెలియవచ్చినది. అతనిని ముందుగఁ జెఱయం దుంచవలయును. ఇతని దుర్బోధముచేఁ గాఁబోలు నౌకరులు సైతము నామాటను బాటించుటలేదు. అమ్మా! ఏది యెట్లున్నను మనమిప్పట్టున ధైర్యము వీడరాదు. యుద్ధ మొనరించియే తీర వలయును. నేఁడే యుద్ధసన్నాహమున కనుజ్ఞ యొసంగెద" నని

చెప్పుచు రాణిగారి యాజ్ఞఁగొని తన తావునుండి లేచిపోయెను. చాందసుల్తానాయును ధైర్యము వీడక తగు యత్నములఁ జేయుచుండెను.

## ముప్పదినాల్గవ ప్రకరణము.

మఱునాఁడు భానుండుదయాద్రి నలంకరించు నప్పటికి రాణీగారి సైన్యంబులు ప్రకాశమానంబులగు కత్తళంబులందాల్చి బారులుదీర్చి కోటయెదుట నిలిచియుండెను. దుర్నివారంబులగు గజయూధముల కంచుగంటలు 'ఖంగు ఖంగు' మని మ్రోగుచుండెను. యుద్ధవీరుల దారుణారావంబులును, హయహేషలును మిన్ను ముట్టుచుండెను. కొంతమంది వీరమాతలు తమ కుమారులకు జయము గలుగు నట్లాశీర్వదించుచుండిరి. ఆవీరులును విరోధి సైన్యములతోఁ బోరి గెల్పొంది చక్రవర్తిని ప్రాణంబులతోఁ బట్టుకొని తెచ్చి యిచ్చుటో లేక యుద్ధరంగమున ప్రాణముల విడిచి వీరస్వర్గమును బొందుటో కావింతు మని వారి మాతలకు నిర్భయముగను, త్రికరణశుద్ధిగను వాగ్దానము గావించుచుండిరి.

ఇట్లుండ నక్బరుచక్రవర్తి తన సైన్యమును దీసికొనివచ్చి కోటను ముట్టడించెను. లోపలనున్న రాణిగారిసైన్యములు చెలరేఁగి కొంద ఱెడతెఱపిలేకుండ ఫిరంగులను దుపాకులను గాల్చుచు గొందఱు బాణములను శత్రువులపైఁ బ్రయోగించుచునుండిరి. ఇట్లు విధివిరామము లేకుండ వచ్చుచున్న బందూకులగుండ్లవలనఁ బెక్కుమంది మరణించుట నవలోకించి యక్బరు తన సైన్యమును

ముందునకు నడిపించి ఫిరంగులను బెట్టి కోటద్వారములను బగులఁ గొట్టించుచుండెను. ఒక్కొక్క ఫిరంగిదెబ్బకు పిడుగు పడినభంగిఁ గొంతసేపటివఱకును హోరుమను మ్రోఁత మ్రోఁగు చుండెను. గాని తలుపులు మాత్రము స్వాధీనము కాకుండెను. దక్షిణ దిశయందున్న సేన కోటగోడలపై కెక్క సాహసము జేసి లోతుగనున్న కందకమును మనుజాశ్వ కళేబరములచేఁబూడ్చి గోడలపై కెగఁ బ్రాకసాగెను. లోపల నున్నవారు వారి నట్లు చేయ నీక నిప్పులవర్షమును గురిపింపఁజొచ్చిరి. వీరిచ్చట నిట్లు పోరాడు చుండ మియర్‌మంజూ తన సైన్యమును దీసికొని తూర్పు భాగమున నుండు కోటగోడలు బ్రద్దలగునట్లు ఫిరంగులను గాల్పించుచుండెను. అందుచే నా భాగము గొంత ధ్వంసము కాఁజొచ్చెను. ఇట్లుండ నక్బరు సేనానాయకుఁడగు నబుల్‌ఫజలు పడమట వైపునున్న కోటగోడల యడుగు భాగమున సొరంగ ములఁ జేయించి మందుగూరి కాల్ప నాజ్ఞనొసఁగెను. ఈసంగతి లోపలివారు కనుగొని వారిపైనగ్ని వర్షమును గురియింపఁ దొడఁగిరి. ఇంతలో రాణిగారికి సహాయముగ వచ్చిన బీజపూరు సైన్యము మియర్‌మంజూసేనను దాఁకెను. మియర్‌మంజూసేన కోటముట్టడిని మాని, అదిల్‌షాహీ సైన్యముపైఁబడెను. అదిల్‌ షాహీ తన సేనను బ్రోత్సాహపెట్టి తాను ధీరముగఁ బోట్లాడు చుండెను. పిమ్మట మియర్‌మంజూ దీర్ఘమగు కరవాలంబును గైకొని యదిల్‌షాహీను సమీపించి యాతని కంఠమునకు గుఱి చూచి కొట్టెను. ఇబ్రహీం దానిం దప్పించుకొని కోపోద్దీపితుఁడై

మియర్‌మంజూఁపైబడి కంఠమును దెగవేయఁ దనకత్తిని విసరుటచే నాదెబ్బ కంఠమును దప్పి భుజముకడఁ దగిలి మెడ వఱకుఁ దెగెను. వెంటనే మియర్‌మంజూ తన గుఱ్ఱముపై వ్రాలెను. హసన్‌మియ్యా దానిని గని మియర్‌మంజూను శత్రువులచేఁ జిక్కనివ్వక దూరమునకుఁ గొంపోయెను, అంత మియర్‌మంజూ కంఠగత ప్రాణుఁడై హసన్‌మియ్యావంకఁ జూచి "నాయనా! నేను పరలోకమునకుఁ బోవుచున్నాను. నీవా నీచురాలినిఁ బ్రాణములతోఁ వదలిపెట్టవలదు. ఆమెను గడతేర్చి అక్బరు శరణుజొచ్చుము. నీకోరిక సఫలము కాఁగల" దని దీనస్వరముతోఁ బలికి తన ప్రాణములను వదలెను.

ఇట్లుండఁ బడమటిదిశయందలి వారెట్లో తమ పనిని బూర్తిచేసి మందునకు నిప్పంటింపగా సంవర్తకాలమందలి పిడుగులవలె భయంకరధ్వానంబులు మిన్నుముట్టి గోడరాళ్ళు కొన్ని కూలెనేగాని పూర్తిగఁ బడవయ్యె. అంత గాతములఁ దీసి మందుఁగూర నారంభించిరి. కోటగోడ లీపర్యాయంబున గూలునను భయంబునఁ చాందసుల్తానా యెచ్చటనుండియో పరుగెత్తుకొనివచ్చి వారిపై దుపాకులను, ఫిరంగులను గాల్చుచు శత్రువులను దగ్గఱకు రానీయకుండెను. ద్వారమును భేదించుచుండిన వారు మిక్కిలి విజృంభించి పనిచేయుటవలన ద్వారపు తలుపులలో నొకటి ఫెళఫెళారావములచేఁ గ్రిందఁబడెను. వెంటనే శత్రువులు గోటలోనికి రాఁసాగిరి. ఆవార్త విని చాందసుల్తానా తనపనిని హుసేనుమీర్జా కప్పగించి రెండుచేతుల రెండుకత్తులఁబూని

యాడుసింగంబురీతి ద్వారముకడ కుఱికి లెక్కలేని భటులను జంపుచు శత్రువులను ద్వారముదాటి యీవలికి రానీయకుండ నాపుచుండెను. పశ్చిమదిశయందలి వారును నెట్లో గోడలను బగులఁగొట్టి లోపలకు వచ్చుచుండిరి. మాలికాంబరు వెంటనే యచటికివెళ్ళి హూసేనుమీర్జాకు సాయపడెను. చాందసుల్తానా ద్వారముకడ ధీరముగఁ బోట్లాడుచున్నను ననేకులుమడిసిరి. అందుచే బీజపూరుసేనలోఁ గొంత భాగము లోపలికిఁ గొని రాఁబడెను.

పడమటి దిక్కునసున్న మొగలాయి వీరులతో మాలి కాంబరు హూసేనుమీర్జాలు పోరుచున్నను సైనికులు పెక్కురు లోపలఁ బ్రవేశించుచునే యుండిరి. అందుచే రాణిగారి సైని కులలోఁ గొందఱు ధైర్యముచెడి పాఱిపోవుచుండిరి. రాణిగారు పాఱిపోవువారిని మరలఁ బిలుచుచు యుద్ధముజేయఁ బురికొల్పు చుండెను. కాని వినువారెవ్వరును లేకపోయిరి. ధైర్యవంతులగు వారు కొలదిమంది మాత్రము పోరాడుచుండిరి. అట్లున్నను గోట లోనికిఁ జొచ్చిన మొగలాయి సైన్యములో మూడు భాగముల కంటె నెక్కుడుగ హతులైరి. వెంటనే యక్బరు బయటనున్న ఫిరంగీలను గోటలోనికిఁ దెప్పించుచుండెను. వీరిట్లొనర్చుటచేఁ చాందసుల్తానా తన యొద్దనున్న ఫిరంగీల నన్నిటిని కోటద్వారము నకు సమముగఁ బట్టించి మొగలులను గోటలోనికి రానీయక వారిపై నిప్పుగోళములను విడుచుచుండెను. కోటలోశేషించి యున్న మొగలులతో మాలికాంబరును అదిల్‌షాహోయును

బోరుచుండిరి. బయటనుండు మొగలాయీలు గాల్చు ఫిరంగి గుండ్లు కోటద్వారము రెండవతలుపును బ్రద్దలుచేసెను. చాంద సుల్తానా కేమియుఁ దోఁచలేదు. ఎడతెరపిలేక ఫిరంగులను గాల్చెదమన్న వాని కుపయోగించెడు మందుగుండు సామానులు ఖర్చయిపోయినవి. మందుమాత్రము గొంచెము మిగిలియుండెను. ఇట్టిదురవస్థలో నామె యేమిచేయఁగలదు? ఆమె కేయుపాయ మును దోఁచలేదు. ఆలోచన కదితరుణముగాదు. శత్రువులు కోట లోనికిఁ జొచ్చుచుండిరి. వెంటనే చాందసుల్తానా తన ఖజానాలో నున్న రాగినాణెములను వెండినాణెములను దీసికొని వచ్చునట్లు మాలికాంబరున కాజ్ఞ నొసంగెను. పిమ్మట లెక్కలేని సంచులు రాగి, వెండి నాణెములతో నింపఁబడి తీసికొని రాఁబడెను. సైని కులు రాగినాణెములను ఫిరంగులలోఁ బోసి శత్రువులపై గాల్చిరి. నిప్పుపండ్లనే లక్ష్యపెట్టని మొగలాయీలు వీనిని సరకుఁగొనక కోటలోనికి వచ్చుచునే యుండిరి. కాల్పఁబడు నాణెములన్నియు నిప్పుకణికలవలె శత్రువులపైఁ బడుచుననేకులఁబాధపెట్టుచుండెను. ఎడతెఱపిలేక నీవిధముగ ఫిరంగులను గాల్చుటవలన రాగినాణెము లన్నియు నయిపోయినవి. చాందసుల్తానా కిప్పుడొక మఱింత వీరా వేశము పెరుగుటచే వెండినాణెములను గూడ ఫిరంగులకు వాడ వలసినట్లామెయుత్తరువు చేసెను. సైనికు లట్లేయొనర్చిరి. ఒక్కొక్క ఫిరంగులోఁబోసి కాల్పఁబడు నాణెములు పెక్కు శత్రువుల శరీరములలో దూరి వారిని బాధించుచుండెను. ఇట్లు ఫిరంగులన్నియు నీవిధముగఁ గాల్పింపఁబడినందున శత్రువులు ఇంకుగొని కోటలోనికి యడుగుబెట్టకుండిరి. ఎట్లోతప్పించుకొని

కోటఁజొచ్చిన శత్రువులను చాందసుల్తానా యమపురికంపు చుండెను. మరల నక్బరు ప్రోత్సాహముచే శత్రుసైన్యంబులు తండ తండంబులుగఁ గోటలోనికి రా మొదలుపెట్టెను. మిగిలి యున్న రాణిగారి సైనికులు పాఱిపోవుటకుఁ బ్రయత్నించుచుండిరి. చాందసుల్తానా యెంత సేపు పోరాడినను బ్రయోజనమగపడలేదు. ఆమె యేదోయొక సదుపాయమున నక్బరుచక్రవర్తిని సమాధాన పెట్టి యుద్ధము నాపవలయు నని ప్రయత్నపడుచుండెను. ఇట్లుండ నొక సేవకుఁ డక్బరుచక్రవర్తికడ కరుదెంచి "స్వామీ ! పడమటి దిక్కునఁ బోరాడుచున్న నబుల్ఫజలునకు ఫిరంగిగుండుదెబ్బ వలన గొప్పగాయము దగిలియున్నది. ఆ బాధకుఁ దాళజాల కున్నాఁడు. మీతోఁ గొన్ని రహస్యములను మాట్లాడుటకై మిమ్ముమల నతిశీఘ్రముగఁ బిలిచికొనిరమ్మని చెప్పిపంపె" ననెను. వెంటనే యక్బరు అబుల్ ఫజులువద్ద కేగి యాతనిఁజూడ నతఁడు స్మృతిదప్పి పడియుండెను. సైనికులంద అతనిని జుట్టుకొనిరి. ఇంతలో రాజవైద్యు లచ్చటి కరుదెంచి యతనిని జక్కఁగఁ బరీక్షించి చూచి యది ప్రాణాపాయమగు దెబ్బకాదని యెంచి యతనిని గుడారమునకుఁ దీసికొనిపోవున ట్లాజ్ఞాపించిరి. అక్బరుచక్రవర్తి కేమియుఁదోఁపక నాటిదినమునకు యుద్ధము జాలింపవలసిన దని యాజ్ఞాపించి యబుల్ ఫజులుతోఁగూడ గుడారమునకు వెళ్లెను.

## ముప్పది యైదవ ప్రకరణము

అక్బరుచక్రవర్తి తనగుడారమున కేగినపిదప నా రాత్రి యంతయు నతఁ డబుల్ ఫజల్ వద్దనే కూరుచుండి యతనికిఁ జేయవలసిన శైత్యోపచారములఁ జేయించుచుండెను. ఇంతలోఁ దెల్లవాఱినది. అక్బరు యుద్ధమునకు సిద్ధపడియుండలేదు. అబుల్ ఫజ లక్బరును యుద్ధమొనర్ప పురికొల్పుచుండెను, కాని యక్బ రందులకొప్పుకొనక "అబుల్ ఫజులా ! నీ బోటిమిత్రుఁడును, విద్వాంసుఁడును, లౌకికవ్యవహారదక్షుఁడును నగు వానిని పేఱొకనిని జూచియెఱుఁగను. మీరు నాకు జ్ఞానోదయమును గలుగఁ జేసిన గురువులు. మీ యుపదేశములవలన సకలమతముల యందును నాకు సమభావము గలిగినది. మీరు లేకున్న నాకు లోకమే లేదు. మీకు శరీరము స్వస్థతపడువఱకును నేను యుద్ధ మాడుట లే"దని చెప్పెను. అందుల కబుల్ ఫజల్ "నాయనా ! మనమిప్పుడు యుద్ధమును నిలిపితిమేని యక్బరు చక్రవర్తి చాందసుల్తానాకు వెఱచి పాఱిపోయెనని లోకులు దలంతురు. నీవు కలలోనైన నెఱుంగని యపకీర్తిని నిష్కారణముగఁ బొందవలయును. మఱియుఁ జాంధసుల్తానా ధీరురాలు. అట్టి స్త్రీని మన మిప్పుడు లొంగదీసికొనకున్న మనరాజ్యమునకే ముప్పువాటిల్లునేమో ! మఱియు మన మనుకొనినట్లు దక్కనులో మొగలాయిరాజ్యమును స్థాపింప వీలులేకుండును. మీరు నాకై చింతింపనవసరములేదు. నా దేహము స్వస్థపడగలదు. రాణికి మందుగుండు సామాను లెవ్వియును లేవు. సైనికులలోఁ జాల మంది నిహతులైరి. మనకు జయము తప్పక కలుగఁ గలదు.

నిన్నటి దినమే పట్టణము మనచేఁ జిక్కియుండవలసినది. కాని మీరే యుద్ధము నాపి వేసితిరి. రేపుదయమున మీరు తప్పక కోటను ముట్టడింపవలయు" ననెను. పిమ్మట నక్బరు "మిత్రమా! నీవు చెప్పినట్లే చేసెదను. ఆ స్త్రీ యిఁక మన చేతులలోఁ బడిన దనియే నీవు భావింపవలయును. అహమ్మదు నగరము మనకుఁ జిక్కిన వెంటనే మురాదు మరణమునకు హేతుభూతులైన బీజపూరు గోలుకొండ నవాబుల పెంచ మార్ప వలయును. రేపటియుదయమున గోటను ముట్టడించుటకుఁ దగు యత్నములను జేయించెద" నని చెప్పి తన తావునుండి లేచి వేఱొక గుడారమునకుఁ బోయెను.

ఆ నాఁడు రాత్రి పదిగంట లగునప్పటికి నెవరో పట్టణ వాసులు ముగ్గు రహమ్మదు నగరకోటకు దక్షిణమున రెండు మైళ్ళ దూరమునుండి వచ్చుచుండిరి. వారి కీ క్రింది సంభాషణము జరిగెను.

మొదటివాఁడు:—అయ్యలారా! మన రాణిగారి గ్రహచార మేమోగాని పట్టణమునకుఁ బూర్వముండిన కళయే మాఱిపోయినది. గుడ్లగూబలును రాత్రులలోఁ బట్టణ మంతయుఁ జేరి యఱచుచున్నవి. ఏదోయొక గొప్ప విపత్తు జరుగఁగలదు.

రెండవవాఁడు:—మిత్రమా! నిన్నటిరేయి మఱియొక గొప్ప వింత జరిగినది. పండ్రెండు గంటల రాత్రిలో నెవఁడో యొక యౌవనపురుషుఁ డొక గుఱ్ఱము నెక్కిపోవుచు గొప్ప ధనవంతులగు వారి యిండ్లకడ నిలిచి తాను లోనికి బోయెను

అయ్యా ! చాంద సుల్తానా శౌర్యముగలదైనను నక్బరుచక్రవర్తితో బోరాడలేక బహదరును వెంటఁబెట్టుకొని జున్నరు పట్టణమునకుఁ బాఱిపోఁ దలఁచి యున్నది. పట్టణము శత్రువులచేఁ జిక్కునేని మీహింసఁ జెప్పనక్కరలేదు. మొగలాయీ లతి క్రూరులు. ఇన్ని దినముల నుండియు మీ రా దుర్మార్గురాలిని నమ్మినందుల కెంతపనియైనదో చూడుడు. ఇప్పటికైనను మీరందఱు మా పక్షమునఁజేరి హసన్ మియ్యాకు సహాయ మొనర్పఁ దొడ్పడుఁడు. రాజ్యము మొగలుల చేతిలోఁ బడకుండ యుక్తిచేసెద నని చెప్పెను. ఆ దుర్మార్గు డెవడైనది నాకుఁ దెలియదు.

మూడవవాఁడు:—మిత్రమా ? ఎవఁడో యనెద వేల ? దుర్మార్గుఁడగు హమీదుఖానుఁడే యతఁడు. సైనికులకును, చాందాసుల్తానాకును లేనిపోని మిషలుపెట్టి వారికుండిన యైకమత్యమును జెఱచివేసెను. మఱియు నా నీచుఁడే ఖానుని దొంగతనముగఁ జెఱనుండి వదలిపెట్టెను. ఇప్పు డీహమీదుఖానుఁడును నహమ్మదుఖానుఁడును గలిసి రాణి నెప్పు డెప్పుడు చంపుదుమా యని వేచియున్నారు. మఱియు నీ దుర్మార్గు లబ్దుల్ రహిమానుని దమ వలలో వేసికొని రాణికి విరోధిగఁజేసిరి. ఇట్టి వారమ్మదు నగరమునను న్న, రాజ్యము చెడకుండునే !

మొదటివాఁడు:—మిత్రులారా ! ఇప్పు డక్బ రేమి చేయ నున్నాఁడు ?

రెండవవాఁడు:—అబుల్ ఫజలు యొక్క ప్రోత్సాహముచే నక్బరు యుద్ధ మొనర్చుటకుఁ సిద్ధముగ నున్నాడు. కాని యబుల్ ఫజల్ వ్రణబాధచే బాధపడుచుండినను, నతని

యారోగ్యము చెడినను నక్బరు యుద్ధమొనర్పఁ డని నా నమ్మకము.

మొదటివాఁడు:— మొగలాయి చక్రవర్తి యొకవేళ యుద్ధ మొనర్చిన చాందసుల్తానా సంధి చేసికొనునా!

రెండవవాఁడు:— రాణీ గారెన్నటికిని సంధి యొనర్పదు. ఆమె ప్రాణమున్నంతవరకును బోట్లాడియే తీరును. ఆమెవంటి ధీరురా లెవరైన నున్నారా? ఏమి యా వీరావేశము! ఆ ధైర్యము! నిన్నటిదిన మక్బరు సహిత మామె పరాక్రమమును జూచి యాశ్చర్యపడెను. అట్టి తేజోనిధి మొగలాయీలకు వెఱచి పాటి పోవునా?

మొదటివాఁడు:— మిత్రమా! అది యటుండనిమ్ము. ఆ దుర్మార్గుఁడగు మియర్ మంజూ మరణించినను హసన్ మియ్యాకింకను నహమ్మదును రాజుగాఁజేయు పిచ్చి వదలలేదా!

రెండవవాఁడు:— వదల లేదనియా? అయ్యో! యిప్పు డది మెండైనది. మియర్ మంజూ మృతిఁ బొందునపుడు హసన్ మియ్యాను బిలిచి "మిత్రమా! ఆ దుర్మార్గురాలిని నీవింకఁ బ్రాణములతోఁ నుంచవలదు. ఆమెను జంపి నీ వక్బరు శరణు జొచ్చుము. అహమ్మదు రాజు కాఁగలఁ" డని చెప్పెను. అప్పటినుండియు హసన్ మియ్యా మిక్కిలి వినయముతో నక్బరును గొల్చుచున్నాఁడట. మఱియు చాందసుల్తానాను గ్రూరముగ వధించుటకై యెన్నో పన్నుగడలఁ బన్నుచున్నాఁడట మఱియు నతఁడు గ్రామములలోఁ జాటించినవిషయములు

వినినది మొదలు దక్షిణోత్తరక లందఱు హమీదుఖానుని జేరి రాణిగారి ప్రాణములనుదీయు నతి ప్రయత్నమున నున్నారు.

మొదటివాఁడు:— మిత్రులారా! ఆ వంకఁ జూడుడు. ఆ చెట్ల గుంపులలో నేవో రెండుమూఁడు దీపములు వెలుఁగు చున్నట్లున్నవి. ఈ యర్ధరాత్రమున నచట దీపములు వెలుఁగుటకు కారణమేమి? మన మచటికి వెళ్ళి దానిం బరిశీలింపవలయును.

రెండవవాఁడు:— మిత్రమా! మనకు వానితోఁ బనియేమి? అచ్చటికి మనము పోఁగూడదు. మనదారిని మనము వెళ్ళుదము రండు.

మూడవవాఁడు:— నీవు భయపడితివా? అట్లయిన మనము వాని చెంతకేగక దూరమునుండియే చూతమురమ్ము.

వీ రిట్లు మాట్లాడుకొనుచు దీపములు వెలుగుచున్న ప్రక్కకు నడుచుచుండిరి. వీరు దీపములున్న స్థలమున కొక యరఫర్లాంగు దూరముననిల్చి బదిమంది స్థూలకాయులచ్చట గుంపుగఁ గూడి యుండుటను జూచిరి. ఆ గుంపులోనివాఁ డొకడైన నా ముగ్గురిని జూడకుండుటచే వారాచెంతనున్న జెట్లలోదాగి యా గుంపులోనివా రొనర్చు కృత్యములను జూచుచుండిరి. ఇంతలో నెవరో యిద్దఱు మనుజులు సారాయితో నింపఁబడిన రెండు పెద్ద జాడీలను మోసికొనివచ్చి యా గుంపువద్దఁజేర్చిరి. వెంటనే వారంద అత్యుల్లాసంబునఁ జిన్నపాత్రలలోనికి సారాయమును వంచి కొని త్రాగుటకారంభించిరి. కొన్నినిముసములలోనే జాడీలన్నియుఁ

గాళీచేయఁబడెను. సారాయము ద్రాగిన మత్తుచే వారిలోఁ గొందఱు క్రిందఁబడి పొరలుచుండిరి. మఱికొందఱు చంపుటకు వాటము జూచుచు కత్తులను విసరుచుండిరి. మఱికొందఱు "ఆ స్త్రీనిజంపుటకు మేమే చాలుదుము. మీ రంద అక్కఱలే" దని చెప్పుచుండిరి.

వీ రిట్లొకరితో నొకరు మాట్లాడుకొనుచుండ మఱియొక దీర్ఘకాయుఁ డచ్చటి జరుదెంచి "ఓరీ! యింకను మీరిక్కడనే జాగుచేయుచున్నారా! రండు. రండు హమీదుఖానుఁడును సిద్ధముగ నున్నాఁడు. ఇదే మంచితరుణమని మిమ్ముల నందఱను బిలిచికొని వచ్చుటకు నన్నంపినాఁడు. త్వరగా బయలుదేరు" డని యచ్చట నున్నవారిని తొందరపెట్టెను. చదువరులారా! ప్రథమమునుండియు రాణిని జెఱపఁదలచిన యహమ్మదుఖానుఁడే యిప్పుడు వచ్చిన నూతన పురుషుఁడు.

ఖానుని మాటలనువిన్న యా దుష్టులందఱు వెంటనే లేచి పట్టణమువైపు నడుచుచుండిరి. వారు కొంతదూరము నడిచి పోగానే చెట్లచాటున దాగియుండిన ముప్పురు బాటసారులును లేచిరి. అంత వారిలో నొకఁడు "మిత్రమా! నాకు భయమగుచున్నది. వీ రేదో ఘోరకృత్యముఁ జేయఁబూని నట్లున్నది. ఆ వచ్చిన మనుజుఁడు ఖానువలె నున్నాఁ" డనెను. అంత మఱియొకఁడు "ఖానుఁడే. అందుకు సందేహములేదు. వీ రీ రాత్రికే రాణిని దుదముట్టింతు రేమో! లేక మఱేపనికైన పోవుచున్నారా?" యనెను. అందులకు వేఱొకఁడు "మిత్రమా! వారికంతకంటె ముఖ్యమైన కార్యము మఱియొకటి గలదా? అహా! దైవము నేమనవలయును? నేటిలో యహమ్మదు నగరరాజ్య మంత్రియొద్ద

చున్నదిగదా! ఇంక మన మెట్టికష్టములకుఁ బాల్పడవలసి యున్నదో భగవంతుని కెఱుక" యనెను. అంత వారు మువ్వురును గలిసి పట్టణమువైపు నడచిపోయిరి.

## ముప్పదియాఱవ ప్రకరణము

తెల్లవాఱుటకు ముందే యహమ్మదు నగరమంతయు నల్లకల్లోలముగ నుండెను. తప్పఁద్రాగిన క్రూరులెవరో యర్ధరాత్రమునఁ జాందసుల్తానా నంతఃపురమున వధించిరను వార్త బాగుగఁ దెల్లవాఱుసరికిఁ బట్టణమంతయు వ్యాపించెను. పురవాసుల యాందోళనము వర్ణనాతీతము. కొందఱా యెడ కీ యెడకుం బర్వెత్తుచు నెట్లో నగరిహజారముకడఁ జేరుచుండిరి. మఱి కొందఱు వారిగృహములందే ఘొల్లుమని యేడ్చుచుండిరి. కొందఱు తురకలు మాత్రము వీథులలోఁ బరుగెత్తుచుఁ దమ హితుల నందఱి నొకచోటికిఁ బిలుచుచు నహమ్మదునగర రాజ్యము దమవశమైనట్లే దలంచుచుఁ గావలసిన కార్యముల నెల్ల నెరవేర్ప నత్యుత్సాహంబునఁ బనిచేయుచుండిరి. నగరు హజారముకడఁ జేరినవా రంతఃపురములోనుండి వచ్చువారిని రాణిగారి మరణమునకు నిజమైన కారణము నడుగుచుండిరి. ఎవరు వారికిఁ దోచినట్లెల్లఁ జెప్పుచుండిరి. కాని యెవరో కొందఱు క్రూరు లర్ధరాత్రమున నగరిలోఁ బ్రవేశించి రాణిని వధించి రనుటమాత్ర మందఱినోటనుండి వెడలుచుండెను.

అంతఃపురమున షాజిబీబీ ముస్తుఫాల దుఃఖమునకు మేరయేలేదు. అంతఃపుర పరిచారిక లందఱొకవంక భోరుమని యేడ్చుచుండిరి. చాందసుల్తానా మరణవార్త షాజిబీబీ చెవిసోఁక గనే యామె మూర్ఛిల్లి నేలఁగూలెను. బహదరును దుఃఖాతి శయముచే నేలఁబడి దొరలుచుండెను. మాలికాంబరు బహదరు నెట్లో యూరార్చి యతని దుఃఖమును గొంత యుపశమింపఁ జేసెను. ముస్తుఫా షాజిబీబీకిఁ కొంత శైత్యోపచార మొనర్చి యామెను స్మృతికిఁ గొనివచ్చెను. గాని యామె దుఃఖ మించు కైన తగ్గలేదు. అంత నాతఁ డామెకడఁజేరి "ప్రియసఖీ! మించినదానికి వగచినఁ బ్రయోజనమేమి? మరల మనరాణి బ్రతికివచ్చునా? శాంతింపు" మనెను. అందులకు షాజిబీబీ దుఃఖము నాపఁజాలక "ఏ కరుణాసముద్ర నన్నుఁ బసితనము నుండియు గన్నబిడ్డవలెఁ గాపాడెనో, ఏ వీరవనిత తన నిరుప మానపరాక్రమంబున శాత్రవభయంకరి యని పేరువడసెనో, ఏ ధీర యహమ్మదునగర బీరారు దేశములందు సమస్త శాత్రవ వర్గ ప్రముఖుల గర్వంబును భంగమొనరించెనో, ఏ మహాపతివ్రత మియర్‌మంజూ సైన్యంబుల ననన్యసామాన్యంబుగ నుగ్గునుగ్గుగఁ జేసెనో, ఏ యువతీలలామ తనకుఁగల పరాక్రమంబున 'సుల్తానా' యను బిరుదమును బొందెనో-యట్టి జగదేకవీరమాతయగు చాందసుల్తానా యీ లోకమును వదలిన పిదప నేను మాత్రము జీవించియుండిన నేమి ప్రయోజన"మని చెప్పి దుఃఖాతిశయంబున నేలపైఁబొరలుచు నేవేవో పిచ్చి మాటలను మాటాడుచుండెను. అంత మాలికాంబ రామెను గొంత శాంతింపఁజేయఁ దలఁచి

యామెచెంతఁజేరి "అమ్మా ! విధివశమును దప్పింప నెవరికిని సాధ్యముగాదు. ప్రపంచమున జీవరాసులకెల్ల 'జాతస్య మరణం ధ్రువ' మ్మను న్యాయరీతిగ మరణము సహజమైయున్నది. విధి వ్రాత ననుసరించి నరుఁ డెంతకాలము జీవింపవలయునో యంత వఱకే జీవించి పిమ్మట మరణమునొందును. 'నింద లేనిదే బొందెపో' దను సామెతచొప్పున మృత్యు వనేకవిధములఁ దన పనిని జేయుచుండును. అది కొన్ని సమయములలో ఘోరమృగ సర్ప వృశ్చిక రోగరూపంబులను, గొన్ని సమయములలో ఘోర కృత్యము లొనరించు వారి హృదయంబులం జొచ్చియు వారిచే దాఁజేయఁబూనుకొనిన కార్యములం జేయించుచు మానవులను గ్రమింగుచుండును. ఆయువుగలవారిని జంపువారును, ఆయువులేని వారిని బ్రతికించువారును గలరా ! కావున శాంతింపుము. జ్ఞాన వంతురాల వగు నీ విట్లజ్ఞానులభంగి వగవఁదగునా ?" యని కొంత జ్ఞానోపదేశముజేసి యామె దుఃఖమును గొంత శాంతింపఁ జేసెను. అంత నాతఁడు రాణిపోకకై విలపించుచున్న ప్రధానుల వంకఁ జూచి "గతించిన విషయమునకై మీరిట్లు వాపోవుటవలనఁ బ్రయోజనమేమియుఁ గానరాదు. ప్రస్తుతము జరుగవలసిన కార్య ములను ద్వరగ నెర వేర్పుడు. నేటిసాయంకాలముననకే మూర్తిజా యిచ్చటికి వచ్చునట్లు వర్తమానము నంపుడు. మఱియుఁ బట్టణములోని జనులెల్లరు రేపు మధ్యాహ్నము మూఁడుగంటలకు నగరుహజారముకడఁ జేరవలసినట్లు జాటఁబంపు" డని వారితోఁ జెప్పెను.

అబుల్ ఫజలునకు గ్రమముగ వ్యాధియభివృద్ధి బొందు టచే నక్బరు చింతనొంది కోటముట్టడిని మాని ఢిల్లీకరుగ

యత్నించుచుండెను. చాందసుల్తానా మరణించెనని వినినవెంటనే యతఁడు ప్రధాన సేనానాయకులను గొందఱను వెంటఁ బెట్టు కొని కోటలోనికిఁ బ్రవేశించి బహదరును జెఱఁబెట్టెను. ప్రస్తుతావస్థలో మాలికాంబరు చేయునది లేక యక్బరు చక్రవర్తికి లోఁబడవలసి వచ్చెను. అంత నక్బరు చక్రవర్తి బహదరుషాహాను వెంటనే యాగ్రాపట్టణమునకుఁ దీసికొనిపోయి యచ్చటఁ జెఱలోఁ బెట్టవలసిన ట్లాజ్ఞయొనర్చి మరల నొకతూరి యహమ్మదు నగరముపైఁ బడి దానిని సంపూర్ణముగ స్వాధీన మొనర్చుకొన వచ్చు నని యెంచి ఢిల్లీకిఁ బ్రయాణమాయెను.

## ముప్పది యేఁడవ ప్రకరణము

పదునాఱవశతాబ్ద మంతమొందినది. మన చరిత్రయు నంతమొందుచున్నది. బహదరుషాహా చెఱఁగొని పోఁబడిన మఱు చటి దినమున మధ్యాహ్నము మూఁడుగంటల కహమ్మదు నగరములోని జనులలోఁ గొందఱు వీథులలో గుంపులు గుంపు లుగా నడచుచు రాణిగారి హజారముకడ నిలిచిపోవుచుండిరి. ఇట్లు నడచు జనులలోఁ గొందఱు "అయ్యో! మన మెట్లైనఁ బట్టణమును శత్రువుల వశముగాకుండఁ జేయవలయునని ప్రతి రణశుద్ధిగ నుంటిమే! దైవఘటన యెట్లున్నదో చూడుఁడు. ఆ దుర్మార్గు లామెను వధింపకయేయుండిన నీవఱ కగ్బరు చక్రవర్తి బహదరును జెఱగొనక పలాయనమై యుండునుగదా?

అహమ్మదునగరరాజ్య మంతరించెననియే జెప్పవలసి యున్న" దని చెప్పుకొనుచుండిరి. ఆ మాటలను విన్న మఱి కొందఱు "మీరేల యిట్లు విచారపడెదరు? మాలికాంబరు మనల నందఱ నొకటిగఁ జేరునట్లు మనకుత్తరువు జేసినందువలన నేదో యింకను గొంతయాశ గలదు. అతనివంటి ధైర్యవంతు లెవ్వరును లేరు. మరల నతఁడక్బరు చక్రవర్తితో యుద్ధమాడి బహదరును జెఱనుండి విడిపించు నేమో? అన్నివిషయములును మన కిప్పుడు విశదముగఁ దెలియగలవు రండు. బిరబిరఁ బోవుదమని" చెప్పుచు హజారముకడఁ జేరిరి. వీరంద రచ్చటఁ జేరుటకుమున్నె యా ప్రదేశమున రాణిగారి ప్రధానసేనానాయకులును నితరయోధవరులును నిండియుండిరి. అంత మాలికాంబరును, మాలోజీ ఖాన్సులేయును నచ్చటి కరుదెంచిరి. వీరిరాకకై నిరీక్షించుచుండిన జనులు వీరిని జూఁడగనే నిశ్శబ్దముగ గూర్చుండి మాలికాంబరు వంకఁ జూడ్కి నిగిడించిరి.

అంత మాలికాంబ రచ్చటనున్న జనసమూహము నవలోకించి "మిత్రులారా! మనలను, మనరాజ్యములోని ప్రజలను గన్నబిడ్డలవలెఁ బోషించుచుండిన చాందసుల్తానాగారికి దుర్మరణము ప్రాప్తించినందులకు మనమందఱము చింతింపవలసి యున్నది. కాని కాలముతీరినవా రేదో యొక కారణమువలన మృతిఁబొందక మానరు. అందువలన మనము నిరుత్సాహులమై యికమీద జరుగవలసిన కార్యములను జేయక విడిచిపెట్టరాదు. ఇప్పు డక్బరు చక్రవర్తి బహదరును జెఱబెట్టగానే యహమ్మదు నగరరాజ్య మాతని వశమైన దని మీరు తలంపవలదు. మఱియు

నైజాం షాహీవంశములోనివాఁ డగు మూర్తిజా రాజ్యమున కర్హుఁడు. అతనికిఁ బట్టముగట్టి యతని నండగ నుంచుకొని మనము మొగలులతోఁ బోటి స్వాతంత్ర్యమును బొందగలము. నాకు లెక్కలేని మరాటి వీరులు సహాయము జేయుటకు సిద్ధముగ నున్నారు. మీరందఱును రాజభక్తిని దేశాభిమానమును గలిగి నాకు సహాయ మొనర్పుఁడు. మఱియు రాణిగారు మృతిబొందు నపుడు నన్ను దగ్గఱకుఁ బిలిచి "నాయనా! మొగలులు బహాదరును జెఱఁబట్టినచో మూర్తిజా నైజాంషాహీకిఁ బట్టముగట్టి యహమ్మదు నగరరాజ్యమును మొగలుల వశముగాకుండునట్లు నీ యావచ్ఛక్తిని వినియోగపఱుపుము. మఱియు షాజిబీబీ ముస్తఫాలకు వివాహ మొనర్పు" మని నాతోనొక్కి వక్కాణించెను. నేను సర్లే యని యామెకు వాగ్దానము గావించితిని. కావున మీరందఱును రాజభక్తి దేశాభిమాన మను రెండు మంచి మార్గముల ననుసరించి నాకు సాయ మొనర్పుఁడు. మీరందఱు నాకు నిక్కముగ సహాయమొనర్తురను నమ్మకముతోను, ముస్తఫాగారి సాయమువలనను నహమ్మదునగర రాజ్యమును రక్షింప నేఁడే మీ యెదుటఁ గంకణము గట్టుకొనుచున్నా" నని వారి యెదుట ధీరముగఁ బ్రతిజ్ఞ యొనర్చెను.

ఈ మాటను వినుచుండిన జనులందఱు పరమానంద భరితులై "శౌర్యనిధియగు మాలికాంబరూ! మేమందఱము యుద్ధమునకు సిద్ధముగ నున్నాము. మీరు భయపడవలదు. రాజ్యము నెప్పటికిఁ బరులకుఁ దక్కనియ్య" మని యేకగ్రీవముగఁ దమ యుత్సాహమును వెల్లడిపఱచిరి. అంత మాలికాంబరు

మిత్రులారా! పరలోకమున సంపూర్ణసుఖముల ననుభవించు చున్న చాందసుల్తానాగారు దేశాభిమాన మను వింతవస్తువును మీ కంపినదా? లేక యా వీరమాతయే పరలోకమునుండి వచ్చి యిచ్చటఁ దాండవమాఁడుచున్నదా? కానిచో మీరందఱిట్లు సంతోషమున మీకుఁగల రాజభక్తి దేశాభిమానములను వెల్లడి జేయుదురా? కాదు కాదు చాందసుల్తానాగారి శరీరము మాత్రము నశించిపోయినది. కాని యామె తేజస్సింకను మన రాజ్యము నుండి వదలిపోలేదు. ఆ ప్రకాశమే మీ కిట్టి యుత్సాహమును గలుగఁ జేయుచున్నది. ఆ దివ్యతేజస్సు మీకు యావచ్ఛక్తిని గలుగఁజేయఁగలదు. ఆ ప్రకాశమింకను గొప్ప యోధవరుల హృదయములలోఁ జొచ్చి సంగర మొనర్చుటకుఁ బ్రోత్సాహము పెట్టుచున్నది. అందువలన మనకుఁ దప్పక జయమే కలుగఁ గలదు. ఏ యువతీమణి దేశాభిమానమునందే తన యావజ్జీవమును ధారవోయనెంచి తన మఱఁది కొమరుఁడగు నిబ్రహీమియదిల్ షాహా బాలుఁడుగ నున్నతఱి నతనికొఱకు బీజపురమును రక్షించెనో—ఏ వీరమాత యహమ్మదునగర రాజ్యమునఁ దన దమ్ముని మనుమఁడగు బహదరుకొఱకు రాజ్యసంరక్షణమును మిగులఁ గుశలతతో నొనర్చి మొగలాయి సైన్యంబుల నవక్ర విక్రమంబునఁ జించి చెండాడెనో—ఏ పతివ్రతాశిరోమణి పసితన మననే భర్తృవియోగదుఃఖము ప్రాప్తించినను మరణమువఱకుఁ బవిత్రాచరణమునందే దృష్టిగలిగి యుండెనో యట్టి చాంద సుల్తానాగారికి దేవుఁడు పరలోకసుఖముల నొసఁగుగాక! ఆమె చరిత్రము లోకమున్నంతకాలము స్థిరముగ నిల్చుగాక! ఆమె

జీవితమును విన్న ప్రతిమానవుఁడును నామెను సమ్మానపూర్వకముగ స్మరించుచుండుఁగాక! మఱియు నచిరకాలముననే మూర్తిజానై జాంషాహీకిఁ బట్టాభిషేకమును షాజిబీబీ ముస్తుఫాలకు వివాహమహోత్సవమును జరుగవలసిన ఏర్పాటు గావింపఁబడుటచే నక్కార్యముల నొనర్ప మీరెల్లరు నాకు సాయపడెదరుగాక! ఏతత్కృత్యంబుల నొనర్చి యహమ్మదునగర రాజ్యమును గొంత కాలమువఱకైన రక్షింపయత్నించెద" నని గంభీరోపన్యాసమునొసఁగి తన స్థలమునుండి వెడలిపోయెను. జనులెల్లరును మాలికాంబరును వేనోళ్ళఁ గొనియాడుచుఁ దమ నివాసంబుల కరిగిరి.

## ముప్పదియొనిమిదవ ప్రకరణము

చాందసుల్తానా పరలోకమున కేగి దాదాపు రెండు మాసములు కావచ్చుచుండెను. షాజిబీబీ ముస్తుఫాలు తమ దుఃఖమునెల్లో మఱచిపోయి కాఁబోలు వివాహమహోత్సవమునకై యువ్విళ్ళూరుచుండిరి. పురవాసులందఱును మూర్తిజా పట్టాభిషేకమునకును షాజిబీబీ ముస్తుఫాల వివాహమహోత్సవమునకును బట్టణమంతయుఁ జక్కగ నలంకరించి కావలసిన కార్యములనెల్ల నెఱవేర్చుచుండిరి. హూసేనుమీర్జా రావలసిన బంధువులకెల్ల శుభలేఖలనంపి వచ్చిన చుట్టములు విడియుటకై వసతిగనుండు గృహములు కాళీచేయుచుండెను. మాలికాంబరును మాలోజిభాన్సలేయును వివాహమహోత్సవమునకు కావలసినవన్నియు సిద్ధము

జేయుచుండిరి. ఇతర ప్రధానులందఱు పట్టాభిషేక సంభారము లను గూర్చుచు వారివారికి నియమింపఁబడిన పనులయం దప్ర మత్తులై యుండిరి.

ఇఁక రెండు రోజులనాటికిఁ బట్టాభిషేకమును వివాహ మును జరుగవలసియుండెను. ఒక దినమంతయు సన్నాహము లచేఁ గడిచిపోయెను. తెల్లవాఱినది. ప్రొద్దెక్కుకొలఁదిని బట్టణ మంతయు జనసమ్మర్ధముగ నుండెను. ఎచ్చటఁ జూచినను బంధువు లెక్కివచ్చిన గుఱ్ఱపుబండ్లే నిండియుండెను. కొంతమంది జనులు నూతనముగ విచ్చేసిన బంధువులయొక్కయు, మిత్రులయొక్కయు క్షేమములను విచారించుచుండిరి. నూతన వస్త్రములను నాభరణ ములను ధరించి దాసీజనంబులు లీయెడకా యెడకుం బర్వెత్తు చుండిరి. హూసేనుమీర్జా వచ్చుచున్న బంధువులను మంగళ వాద్యంబులతో నెదుర్కొని వారినందఱిని బిలిచికొనిపోయి వారి వారికి నియమింపఁబడియున్న గృహములలో విడిచిపెట్టు చుండెను. ముస్తుఫా కొనంగఁబడు గజాశ్వరత్న హేమంబులును, కళింగరాష్ట్రమున మాత్రమే దొరకు మేలిమైన దంతపు సామా గ్రులును, పవడపుకోళ్ళ మంచములును, సువర్ణపాత్రములును, షాజీబీబీ కియ్యఁబడు వివిధ రత్నాభరణములు, ఫలములు, వస్త్రములు మొదలగు కానుకలను భృత్యులు సిద్ధముజేయుచుండిరి. ఈ విధంబుగఁ బగలంతయు గడిచిపోయెను. ఆ నాఁటిరాత్రి పట్టణములోని యశేషజనంబులు నెప్పుడెప్పుడు తెల్లవాఱునా, యెప్పుడెప్పుడు షాజీబీబీ వివాహమును, మూర్తిజా పట్టాభి షేకమును గన్నులారఁ గాంచెదమా యని వేచియుండిరి.

తెల్లవాఱినది. నగరమంతయు మంగళ వాద్యములచే నిండిపోయెను. సభామండపమంతయుఁ జక్కఁగ నలంకరింపఁ బడియుండెను. బంధుమిత్రులును, సకల సామంతరాజులును సభ నలంకరించియుండిరి. అనుపమోజ్వల రత్నసింహాసన మొకటి వీరి సమీపముననే వేయఁబడియుండెను. సభామండపమునకు ముందుభాగమునఁ జక్కఁగ నలంకరింపఁబడిన గుఱ్ఱములును, వీటి వెనుక బాగుగ శృంగారింపఁబడిన యేనుఁగులును బారులు దీరి నిలిచియుండెను. ప్రతియేనుఁగుపైని మావటి వాఁడొకఁ డంకుశమును జేతధరించి ఠీవిగఁ గూర్చుండియుండెను. ఈ వరుసల కిరుపార్శ్వములను సేవకబృందము నిలిచి యుండెను. వీరికిఁ బ్రక్కఁగనే మంగళవాద్యము లొనర్చువారు నిలిచియుండిరి.

పిదప మాలికాంబరు మూర్తిజాను జక్కఁగ నలంకరించి తన ప్రధానమంత్రులతోఁగూడ బిలిచికొని సభాస్థానమున కరుదెంచెను. వెంటనే యతఁడు ప్రధానులయొక్కయు, సభాసదుల యొక్కయు, ననుజ్ఞఁ దీసికొని మూర్తిజాను సింహాసనముపై గూర్చుండఁ బెట్టెను. మంగళ వాద్యములు మ్రోగుచుండెను. పిమ్మట మాలికాంబరు నిజాంషాహీ వంశమువారు తరతరముల నుండియు ధరించుచున్న కిరీటమును దీసికొనివచ్చి మూర్తిజా శిరస్సుపై నునిచి, పచ్చలతోఁ దాపఁబడిన పిడిగల యొక ఖడ్గమును నతని చేతి కొసంగెను. ఈ ఖడ్గమును బూర్వపు నైజాం షాహీవారు పట్టాభిషేక కాలమున వాడుచుండిరి. పిమ్మట నబ్దుల్ రహిమానుఁడును, హుసేనుమీర్జాయును, శ్వేతాతపత్రంబులం బట్టుకొని మూర్తిజాకు నిరుగడల నిల్చిరి. పిమ్మట హుసేను

మీర్జా మాలికాంబరుని యాజ్ఞఁగొని సభలోనివారి కందఱికిని వారివారికిఁ దగినట్లు బహుమతు లిచ్చుచుండెను. పట్టాభిషేకము నిర్విఘ్నముగను, మిక్కిలి వైభవముగను జరిగినందులకు సభ వారందఱు మిక్కిలి సంతసించిరి.

అంతఁ గొంతవడికి మూర్తిజా సింహాసనమునుండి లేచెను. సభవారందఱును దమ తావులనుండి లేచిరి. పిదప మాలికాంబరు "ఇప్పుడే షాజీబీబీ ముస్తుఫాలకు వివాహము జరుగఁబోవు చున్నది. కాన మీ రంద అప్పటికి విచ్చేయవలయు" నని సభ వారితోఁ జెప్పి ప్రధానమంత్రులతోడను మూర్తిజాతోను వివాహ మంటపమున కరుదెంచెను.

ఈ పెండ్లి మంటపమునకు మధ్యప్రదేశమున రత్నకంబళ మొకటి పరుపఁబడియుండెను. దానిపై రమణీయములైన దంతపు బనితనముగల యాసనములు వేయఁబడియుండినవి. ఈ యాసన ములపై సామంతరాజులును నితరబంధువులును గూర్చుండి సరస ముగ సల్లాపించుకొనుచుండిరి. సౌందర్యమునఁ బ్రఖ్యాతిగాంచిన లేఁబ్రాయపుఁ జిగురుఁబోడులు గుంపులు గుంపులుగ నచటఁ జేరిరి. ఆ యువతీవతంసములలోఁ గొందఱు సంతోషముగ సల్లా పించుచును, గొందఱు గానరసాధిదైవతములవలెఁ బాడుచు నేత్రపర్వముగ నర్తనములు సలుపుచుండిరి.

ఇంతలో ముస్తుఫా సర్వాభరణభూషితుఁడై యచ్చటి కరు దెంచి ప్రత్యేకముగ నమర్పఁబడి దేదీప్యమానమైన పీఠముపైఁ గూరుచుండెను. ఇంతలో నా మండపమునకు మధ్యభాగమున నొక తెరగట్టఁబడెను. మంగళవాద్యముల నినాదములు మిన్ను

ముట్టుచుండెను. కొందఱు దాసీలటిగి షాజిబీబీని జక్కఁగ నలంక రించి వివాహమండపమునకు బిలిచికొనివచ్చి తెర కావలిప్రక్కన గూర్చుండఁబెట్టిరి. ఈవలి ప్రక్కన ముస్తుఫా గూర్చుండి యుండెను. పిమ్మట వారి మతగురువగు 'ఖాజీ' కొన్ని మంత్ర ముల నుచ్చరించుచు వారి మతానుసారముగ వారిరువురికిని బెండ్లి జేయించెను. షాజిబీబీ ముస్తుఫాల యానందము వర్ణనా తీతము. వివాహము పూర్తియైనది. వెంటనే ముస్తుఫా యొక బంగారు పళ్లెమునిండుగఁ గొన్ని బంగారు నాణెములను బోసి కొని మాలికాంబరుకడ కరుదెంచి "మహానుభావా! మీరు మితి లేని కరుణారసమును నాపైఁజిలికి నాకు రానున్న మహావిపత్తు లన్నిఁటిని దొలగించి నా క్షేమముల నారసి నన్నుఁ గాపాడి నందులకు మీ కిదే నే నొసంగు బహుమాన" మని చెప్పుచుఁ బళ్లెర మాతని కొసంగెను. మాలికాంబరు దానిఁగ్రైకొనెను. ముస్తుఫా రామాంబను మరచినవాఁడుకాఁడు. కుటీరమునఁ దన్ను మిక్కిలి ప్రేమతోఁ గాపాడినందున కాతఁ డామెకు వెలలేని వస్త్రాభరణముల నొసంగెను. షాజిబీబీయు మాలికాంబరున కమూల్యాభరణములను బహుమతిగ నొసంగెను.

ఇట్లు వివాహము పూర్తియగునప్పటికి మధ్యాహ్నము రెండు గంటలాయెను. ప్రధానమంత్రులును దండనాయకులును మూర్తిజా ముస్తుఫాలకుఁ బట్టణమంతయు మహోత్సవమును జనపుటకై తగు సన్నాహముల నొనర్చుచుండిరి. మాలికాంబరు వచ్చిన బంధువుల కందఱికిని భోజనాదికృత్యములను గావించు

చుండెను. మూర్తిజా ముస్తుఫాల యుత్సవమును జూచుటకై పట్టణములోని జనులంట ఱును వారికిఁ గల పనులను పెందల కడనే పూర్తిచేసు కొనుచుండిరి.

సాయంకాల మాఱుగంటలు కావచ్చెను. పురమందెక్కడఁ జూచినను లెక్కలేని గులోబులును, లస్టరుదీపములును వెలుగు చుండెను. ఎచ్చటఁ జూచినను జెవులు గింగురు మనునట్లు మంగళ వాద్యములే మ్రోఁగుచుండెను. ఇంతలో దివాణముకడ జనులు గుంపులు గుంపులుగాఁ గూడిరి. లెక్కలేని దివ్విటీలును, మతాబు లును వెలిగింపఁబడినవి. దండనాయకులు చేతులలో బెత్తములను బట్టుకొని జనులనీ యెడ కాయెడకు నెట్టుచుండిరి. అంతఁ గొంత వడికి మూర్తిజా పట్టపేనుఁగుపైఁ గట్టఁబడియున్న బంగా రంబా రీలోఁ గూరుచుండెను. ఈతని వెనుక మాలికాంబరు గూరు చుండెను. వేఱొక దిగ్గజముపైఁ గట్టఁబడిన యంబారీలో ముస్తు ఫాయును నతని వెనుక హుసేనుమీర్జాయును గూరుచుండిరి. అబ్దుల్ రహిమాసుఁడును మఱియొక యుత్తమకుంజర మధిరో హించి వీరికి బ్రక్కగ వచ్చుచుండెను. మంత్రులును, దండనాయ కులును యుత్తమాశ్వములనెక్కి పట్టపేనుఁగకుముందు బోవు చుండిరి.

వీరికి ముందు భాగమునఁ బ్రఖ్యాతివహించిన మేళగాండ్రు తమవిద్యయందుఁ దమకుఁగల చాతుర్యమంతయుఁ జూపుచుండిరి. వీరికి దగ్గఱనే నాట్య గాన చాతుర్యమునఁ బేరుపొందిన వేశ్య వనితలు దమ నిపుణతను జూపుచుండిరి. వీరిచుట్టును జనులు గుంపులు గుంపులుగఁగూడి యత్యుల్లాసంబునఁ జూచుచుండిరి.

35

ఇట్లీయుత్సవము నాలుగు వీధులును జరుగునప్పటికి రాత్రి పదునొకండు గంటలాయెను. ముర్తిజా ముస్తుఫాలు వారి యంతఃపురములఁ బ్రవేశించిరి. పిదప జనులందఱును దమకుఁ గలిగిన యానందమునకు సంతసించుచుఁ దమ నివాసంబులఁ కరిగిరి.

మాలికాంబరు చాందసుల్తానా మరణమున శోకవంకఁ జింత నొందియున్నను దానసుకొనిన కార్యములు గొన్నియైనను నిర్విఘ్నముగ జరుగుటచే నించుక సంతసించుచుఁ బట్టణమును మొగలుల వాతఁబడనియ్యక దానిం గాపాడుచుండెను.

సమాప్తము.



రాజేశ్వరీముద్రానిలయం, రాజమహేంద్రవరము.